# చంద్రగుప్త

నాటకరచనాధురంధరు లగు

శ్రీ ద్విజేంద్రలాల్ రాయల

బంగాళీ గ్రంథమునకు

అనువాదకులు :

శ్రీ డాక్టరు నందూరి శివరావుగారు.



ప్రకాశకులు :

కురుకూరి సుబ్బారావు,

ప్రొప్రయిటరు,

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.



బెజవాడ:

ఆంధ్రవాణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.



1936 జులై.



వెల రు 1-0-0.

# హెచ్చరిక.



# కృతిసమర్పణము

గీ॥ ఏసతీమణి కే జనియించుకతన

సార్థకం బయ్యె నాజన్మ; మట్టి సుగుణ

విమలచారిత్రి సీతమాంబికకు దీని

[illegible]

—నందూరి శివరావు.



# భూమిక



ఆదిరాజయశోబిమ్బ మాదర్శం ప్రాప్య వాఙ్మయం
తేషా మసన్నిధానే௨పి న స్వయం పశ్య నశ్యతి.

—ఆచార్య దండి.

హిందూరాజుల చరిత్రలో చంద్రగుప్తుని చరిత్ర సువర్ణాక్షరములవ్రాయఁదగినది. కూటనీతిజ్ఞుఁడగు చాణక్యబ్రాహ్మణుని మంత్రిణకుఁ దన యవక్రబాహుపరాక్రమము దోడుపడఁ జంద్రగుప్తుఁడు బంగాళాఖాతము మొదలుకొని అరేబియా సముద్రము వఱకునుగల దేశమును జయించి హిందూరాజ్యమును స్థాపించెను. హిందూరాజ్యము ఇంతవిశాలరూపమును జెందుట కిదియే తొలిసారి. అన్యమహాపురుషులువలె చంద్రగుప్తుఁడును తనజీవితములోఁ బెక్కుకష్టముల ననుభవించెను. జనకునిమరణానంతరము పాటలీపుత్రమునుండి నిర్వాసితుఁడై పెక్కుదేశములను దిరిమ్మరెను. అప్పుడే అలెగ్జాండరును సందర్శించెను. నందపరీభూతుఁడగు చాణక్యపండితుఁడు ప్రతిశోధ స్వరూపమును దాల్చి నందవంశవినాశమునకు దృఢప్రతిజ్ఞుఁడై యుండెను. ఏకకార్య సాధనాభిలాషులగు చాణక్య చంద్రగుప్తులకు సమావేశమయ్యెను. నందవంశోన్మూలనయాగమున చాణక్యుఁడు ఋత్విక్కును, చంద్రగుప్తుఁడు యజ్వయు నయిరి. తదనంతరము చంద్రగుప్తుఁడు సస్యశ్యామల యగు మాతృభూమిని గ్రీకులపాలిటనుండి రక్షించి దేశభక్తికి ప్రథమోదాహరణ మయ్యెను.

చంద్రగుప్తుఁడు మగధరాజగు మహానందునకు మురయను శూద్రదాసియందు జనించెను. మహానందుఁడు క్షత్రియుఁడని ప్రాకృత గ్రంథమున నేమి తదితరచరిత్రలవలన నేమి తెలియవచ్చుచున్నది. కాని దేశభక్త లాలా లజపత్‌రాయిగారు తమ భారతవర్షేతిహాసమున మహానందుఁడు మంగలి యనియుఁ జరిత్రాధారము గలదనియు

వ్రాసిరి. చంద్రగుప్తుఁడు క్రీ. పూ. ౩౧౬ సం॥న మగధసింహాసనము నధిష్ఠించి ౨౪ సంవత్సరములు అప్రతిహతముగ రాజ్యముచేసెను. ఈతని పరిపాలనకాలమున పాటలీపుత్రము (పాట్నా) మహైశ్వర్య సంపన్నమై వెలఁగుచుండెననియు, అపరాధులు చాలకఠినముగ శిక్షింపఁ [illegible] యుఁ జరిత్రలు దెలుపుచున్నవి.

చంద్రగుప్తుని చరిత్రను దెలుపు గ్రంథములలో మొదటిది విశాఖదత్తమహాకవిచే సంస్కృతమున వ్రాయఁబడిన ముద్రారాక్షస నాటకము. దీని రచనాకాలము ౧౧వ శతాబ్దమని యూహింపఁబడినది. ఇది కావ్యదృష్టిచే భారతవర్షమందేగాక జర్మనీ మున్నగు విదేశము లందును బఠనపాఠనములచే నధికప్రచారమును గాంచినది. ప్రయాగలో నే నొకనాఁడు పాణిని ఆఫీసునకు పోఁగా అచ్చటకు ముద్రారాక్షసమునకై వచ్చిన యొక జర్మనుదేశీయ సంస్కృతపండితుని జూడ నాకాశ్చర్యమయ్యెను. ఇది అన్నిభాషలందును అనువదింపఁబడినది. తెలుఁగునందును అస్మద్గురువరులగు శ్రీ తిరుపతివేంకటేశ్వర మహాకవులు దీనిని అనువదించిరి. ఇట్టి యుత్తమగ్రంథ ముండ వంగభాష యందు "చంద్రగుప్త" నాటకమును వ్రాసి ఆధునిక విమర్శకలోకముచే నధికముగఁ బ్రశంసింపఁబడిన శ్రీ ద్విజేంద్రలాల్‌రాయి నిక్కముగ మహాకవి.

ముద్రారాక్షసమునఁ జాణక్యునికే ప్రాధాన్య మీయఁబడినది. చంద్రగుప్తుఁడు చాణక్యునిచేతి కీలుబొమ్మ. చాణక్యుని కూటనీతియు, ఆతఁడు గనిపెట్టిన గూఢచారపద్ధతియు అందు ప్రధానవర్ణ్యములు. దేశప్రేమ, విశ్వప్రేమ మున్నగు మహోన్నతభావము లందు లేవు. మానవుని మానసిక నీచప్రవృత్తుల నాధారముగఁగొని స్వార్థపరుఁ డగు మానవశ్రేష్ఠుఁడు తనయుత్కృష్టాభిలాషల నెటుల నెఱవేర్చుకొనునో ముద్రారాక్షసకర్త చూపించెను. అందలి చాణక్యుఁడు ప్రేమరహితుఁడు, నీరసుఁడు. ద్విజేంద్రుని చంద్రగుప్తుఁడు స్వతంత్రించి కార్యమును జేయవలయు నను తలంపు గలవాఁడు. అతఁ డనుచున్నాఁడు—"గురు

వర్యా! నా కాజ్ఞమాత్ర మొసఁగుఁడు. కేవల మాశీర్వదింపుఁడు. 'చంద్రగుప్తా! ముందుకుఁ బొమ్ము' అని మాత్రము సెలవిండు. అంత కంటె నే నేమియుఁ గోరను. తక్కినది సర్వము నేన నిర్వహించెదను." ద్విజేంద్రుని చాణక్యుఁడు కూటనీతిజ్ఞుఁడేకాక కన్యావియోగమునకై సామాన్యమానవునివలె విలపించునంతటి కోమలహృదయుఁడు. మఱియు బుద్ధిబలముచేఁ బ్రజలను భయపెట్టి సామ్రాజ్యమును స్థాపించితినే కాని ప్రజలకుఁ బ్రేమభావము గలిగించుటకు నాకు హృదయము లే దని తెలిసికొనఁ గలిగినంతటి సహృదయుఁడు. "బ్రాహ్మణాభిమానము గలిగినను, క్షత్రియపరాభవాగ్ని రగులుకొనుచున్నను" అదంతయు మా దోషమే. ఒక జాతియొక్క సమస్తవిద్య, యశము, సామర్థ్యము తమకే హక్కుగాఁ జేసికొనినవా రెవరైన వృద్ధిపొందఁజాలుదురా?..." అని విచారింప గలిగినంత నిష్పక్షపాతుఁడు. ప్రపంచిక కష్టములచేఁ బీడితుఁడై నిరాశుఁడై ఈశ్వరపదార్థము నన్వేషించుటకు మాఱుగ ఈశ్వరునియందు విశ్వాసములేని నాస్తికుఁడయ్యెను. అయితే కొందఱు చరిత్రకారులు వ్రాఁతలు చూడ చాణక్యుని యీనాస్తికత ద్విజేంద్రుని సృష్టి [illegible] చాణక్యుఁడు రచించిన అర్థశాస్త్రము మున్నగు గ్రంథముల [illegible] ఈశ్వరనామము గ్రహింపఁబడకపోవుటచే చాణక్యుఁడు సహజముగ నిరీశ్వరవాది యనియుఁ దోఁచును.

ద్విజేంద్రుఁడు పురాణములను, ముద్రారాక్షసమును, మఱి కొన్ని గ్రీకుచరిత్రములను సాయముగఁగొని యీగ్రంథము రచించెను. చంద్రగుప్తుఁడు అలెగ్జాండరును దర్శించుటయు, గ్రీకుసేనాపతులగు సెల్యూకసు, ఆంటిగోనసుల యుద్ధములో సెల్యూకసు విజయము గాంచుటయు, చంద్రగుప్తుఁడు భిల్లుసైన్యముల సాయమున సెల్యూకసును ఓడించి సంధి గావించుకొనుటయు, సెల్యూకసు కూతును పరిణయమాడుటయు మున్నగు విషయములు చారిత్రకములే. ఇందు చంద్రకేతువు, ఛాయ, హెలీనాపాత్రములు కవిబ్రహ్మ యగు ద్విజేంద్రుని యద్భుతసృష్టి. చంద్రకేతుని రాజభక్తి, తితీక్ష కడుంగడు ప్రశంస

స్త్రీయములు. ప్రేమోపహతయు, సరళహృదయయు నగు ఛాయ తన వ్యక్తిగతసౌభాగ్యమును ఆర్యగ్రీకురక్తమిశ్రణస్వరూప మగు చంద్రగుప్త హెలీనా వివాహ మను యజ్ఞమున హోమముసేయుట రోమాంచి కలిగించును. పితృభక్తిపరాయణ యగు హెలీనా— "ఇది ... కాదు. నీకుమారి యగు హెలీనా మృత్యువు. ఇది వివాహము కాదు, నా బలిదానము." అని నుడువు హెలీనా — ఒక మహోచ్చప్రవృత్తిచేఁ బ్రేరితయై చంద్రగుప్తుని బెండ్లియాడుట విస్మయము గలిగించును. ఈ నాటకము దేశభక్తి, రాజనీతి మున్నగు విషయములను జూపించుచున్నను విశ్వప్రేమయే దీని ప్రధానలక్ష్యము. ప్రతిశోధమాత్రఫలమగు కొంతస్వార్థముగలవాఁడయ్యును అహోరాత్రములు తన్ను కంటిరెప్పవలెఁ గాచు చాణక్యుని యనాగతవిధానమును గుఱుతింపలేక అతని దనరాజ్యమునుండి వెడలఁగొట్టినను తాను సంకటములో నున్నపుడు చంద్రకేతుఁడు కాళ్ళవేళ్ళఁబడి చాణక్యుని దనయొద్దకుఁ గొనితేర తద్గుణపరిచితుఁడయ్యును ఆయనను క్షమాపణ వేఁడుకొనమియు, తనకృతజ్ఞతను బ్రకటింపమియు చంద్రగుప్తునకు కొంత యనుచితముగ నున్న దని నాతుదహృదయమునకుఁ దోఁచుచున్నది.

ద్విజేంద్రుఁడు నాటకవాఙ్మయమున నూత్నపథమును ద్రొక్కిన మహామహుఁడు. ఆతని నాటకములన్నియు, దేశభక్తి, సదాచారము, మానవత్వము, విశ్వసౌభ్రాత్రము మున్నగు మహోచ్చభావముల బోధించుచు ప్రదర్శనయోగ్యములై యున్నను, ఆంధ్రదేశమున బహుసంఖ్యాకయోగ్య వ్యక్తులును తదితరపరికరములును గల నాటకమండలులు చాల నరుదుగ నుండుటచే వీనిని ప్రదర్శించుట వలనుపడుట లేదు. కాని ద్విజేంద్రుని నాటకములను బ్రదర్శింపవలెనను కుతూహలము మాత్రము పెక్కునటులకుఁ గలదు. నాటకరచనాసార్వభౌముఁడగు ద్విజేంద్రుని నాటకములన్నియుఁ గ్రమముగ మేము ప్రకటించుచుండుట నెఱింగి, కొందఱు నాటకసంఘమువారు తక్కువపాత్రములు గలిగి ప్రదర్శనమునకు దీర్ఘకాలము నపేక్షింపని యీచంద్రగుప్తను

2 6 2 1 9

ప్రకటింపవలసినదిగాఁ గోరిరి. ఏతద్గ్రంథమాలాసంపాదకులును సరస కవులు నగు శ్రీడాక్టరు నండూరి శివరావుగారు మాప్రోత్సాహముచే దీనినిఁ దెనిఁగించిరి. శ్రీశివరావుగారు ఇంతకుమున్ను అమరుక కావ్యమును, శివానందలహరిని బద్యములఁ దెనిగించి యుండిరి. మఱియు చంద్రహాస యను నొక యత్యుత్తమ మగు మాలికకావ్యమును వ్రాసియుండిరి. అర్థుల కెందఱకో వీరు ధనమునుబలె అనేకపద్యములను, గ్రంథాంశములను 'తుభ్య మహం సంప్రదదే నమమ' భావముతో గుప్తదానమును జేసియుండిరి. నిరాడంబరజీవితు లగు వీరిని దీనబంధు వగు డాక్టరు అనియేకాని యొకసహృదయకవి యని యెఱింగినవారు తక్కువ. వీరి సరళహృదయమువలె వీరి పద్యములు సరళగమనమును, రసోల్బణతయుఁ గలిగి శ్రవణములకును హృదయమునకును సహజముగ ఆనందమొదవించును. వీరు ఈగ్రంథమును బ్రదర్శనయోగ్యమగు చక్కని శైలిని అనువదించుటయేగాక అమృతగుళికలఁబోలు సుమారు అర్వదిపద్యములను గూడఁ జేర్చి దీనికి చక్కని వన్నె గూర్చిరి. ఇది విశేషించి మూలగ్రంథమునకు భావానువాదము. ఇందలి పద్యము [illegible] ములు విశేషించి అనువాదకులవి. పద్యములక్కఱలేదను [illegible] లు వానిని విడిచినను బాధలేదు. తక్కుగల మంచిచెడ్డలకు శ్రద్ధాళువులగు పాఠకమహాశయులే నిర్ణేతలు. కారణాంతరములచే నీచతుర్థరత్నము సకాలమున వెలువడింపఁబడనందులకు అనుగ్రాహకులగు మాగ్రాహకులు మమ్ము మన్నింతురుగాక! ఇఁకముందు యథాకాలమున గ్రంథములను బ్రకటించుటకు యత్నించుచున్నాము.

బుధవిధేయుఁడు,

జంధ్యాల శివన్న శాస్త్రి.



# విజ్ఞప్తి.

మొదటనుండియు ఆంధ్రభాష యనిన నాకుఁ జాల ప్రేమ. వలయు నంత యోగ్యత లేకున్నను ఆపేక్షయే నావంటి యొక అల్పజ్ఞుని గ్రంథ రచనకు సాహసింపఁజేసినది. ఇదివఱలో నా నేర్చినకొలఁది రెండు మూఁడు శ్రవ్యకావ్యములను వ్రాసితిని. చిరకాలమునుండియు దృశ్య కావ్యము రచింపవలయు నను కుతూహలము కలదు. కాని అన్యవ్యాసంగముల లో నుండుటచేఁ దగినంత యవకాశము కలుగలేదు. సంస్కృతాంధ్ర హిందీ భాషలందు అనుపమపాండిత్యము గలిగి పెక్కుగ్రంథములు వ్రాసిన అస్మన్మిత్రులును, గురువులు నగు బ్రహ్మశ్రీ జంధ్యాల శివన్నశాస్త్రి గారియొద్ద నేను హిందీ నభ్యసించుచుఁ జంద్రగుప్తను హిందీభాషలోఁ జదివితిని. అప్పుడు దీనిని దెలిఁగింపవలయు నను కోరిక నాకు జనించినది. దాని కనురూపముగ మా ఆంధ్రగ్రంథరత్నాకరసభ్యులును ఈ విష యమునఁ దగు ప్రోత్సాహము చేయుటయేగాక తమ గ్రంథమాలా పక్షమున దీనిని బ్రకటించితిమి. కాన శ్రీ శాస్త్రిగారికిని, శ్రీ రత్నాకరసభ్యులకును వందనములు. మా గ్రంథమాల కొన్ని కారణములచే నడుపుట ఆపుదల ఐనందునను, యీపుస్తకము మొదటికూర్పు ప్రతులు అయిపోయి నందు వలనను, తిరిగి ముద్రింప వలసినదిగా మిత్రులందరు కోరి నందు వలనను, దీనిని నాకు ముద్రింపించుటకు సావకాశము లే నందువల నను నామిత్రులును, బెజవాడ వాస్తవ్యులును, సరస్వతీ బుక్ డిపో, యజమానులును నగు కురుకూరి సుబ్బారావుగారికి యీ పుస్తకము యొక్క సర్వహక్కులు ఒసంగి వారిద్వారా ప్రకటించ గల్గితిని. రెండవ కూర్పు శుద్ధముగ ముద్రించి యిచ్చిన ఆంధ్రవాణీ ప్రెస్సు వారికి నేను చిరకృతజ్ఞుఁడను.

విధేయుఁడు,

నండూరి శివరావు.

# పాత్రసూచిక.

## పురుషులు

నందుఁడు—మగధరాజు

చంద్రగుప్తుఁడు—నందుని సాపత్న్యసోదరుఁడు, భారతచక్రవర్తి

వాచాలుఁడు—నందుని స్యాలకుఁడు

చాణక్యుఁడు—చంద్రగుప్తుని మంత్రి

కాత్యాయనుఁడు—నందుని మంత్రి

చంద్రకేతువు—మలయరాజు

సెల్యూకసు—అలెగ్జాండరు సేనాపతి, గ్రీకుచక్రవర్తి

ఆంటిగోనస్—గ్రీకు సేనాపతి

## స్త్రీలు

హెలీనా—సెల్యూకసుకూతురు, భారతరాజేశ్వరి

ఛాయ—చంద్రకేతుని సోదరి

ముర—చంద్రగుప్తుని తల్లి



# చంద్రగుప్త

## ప్రథమాంకము

### ప్రథమ దృశ్యము

స్థానము — సింధునదీతీరము. దూరమున గ్రీకుల నౌకలు

సమయము — సంధ్యాకాలము

[నదీతటమునంగల శిబిరములచెంత నలెగ్జాండరు, సెల్యూకసు అస్తమించు సూర్యుని జూచుచుందురు. హెలీనా సెల్యూకసుచేయి పట్టుకొని ప్రక్క నిలిచియుండును. సూర్యకిరణము లామెముఖముపైఁ బడుచుండును.]

సెల్యూ — అయితే విజయయాత్ర నసంపూర్తిగా వదలిపెట్టి మఱల పోఁదలఁచితి రేల? సమ్రాట్!

అలె — ఈదిగ్విజయము పూర్తిచేయుటకుఁ గ్రొత్తగ్రీకుసైన్య మవసరము. ఆశ్చర్యపడెద వేల? సేనాపతీ! అనేకరాజ్యములను, జనపదములను దృణప్రాయముగ నతిక్రమించి మేసిడోనియానుండి యింత దూరము వచ్చితిని. ఝంఝామారుతమువలె నతిభయంకరాకారమును దాల్చి గొప్పగొప్ప శత్రుసేనాసమూహముల ధూమరాశివలె నెగురఁగొట్టితిని. నావిజయవాహినీవీరపదాఘాతములచే సగ మాసియా ప్రకంపించినది. అదృష్టమువలె ననివార్యమును,

హత్యవలె నతిక్షయకరమును, దుర్భిక్షమువలె నిష్ఠురమును నగు రుధిరాక్తవిజయశకటము నీయాసియావక్షఃస్థలముపై నింతవఱకు లాగికొనివచ్చితిఁ గాని యవరోధ మెంతమాత్ర మెచ్చటను గలుగలేదు. ఎప్పుడైన గలిగిన దని చెప్పవలసివచ్చినఁ దౌలు పోరు సింధునదీతీరముననే కలిగినది.

(అంటిగోనస్ చంద్రగుప్తునితోఁ బ్రవేశించును)

అలె—ఏ మది? అంటిగోనస్! ఈతఁ డెవరు?

అంటిగో—గూఢచారి, మహాప్రభూ!

సెల్యూ—ఆ! అటులనా!

అలె—గూఢచారియా!

అంటి—అవును, మహారాజా! ఈతఁ డొకశిబిరముచెంత నిర్జనస్థలిని తాటాకుపై నేదియో వ్రాసికొనుచుండఁ గాంచి యది చూడఁ గోరితిని. చూచుట కాపత్రి మీయఁబడినది. కాని నే నేమియు జదువఁజాలనైతిని. అందుకే తమవద్ద కితనిఁ దీసికొనివచ్చితిని.

అలె—ఏమివ్రాయుచుంటివి? యువకుఁడా! నిజము చెప్పుము.

చంద్రగు—నిజము చెప్పెదను, సమ్రాట్! నిజమునే చెప్పెదను.

గీ॥ సత్యవాక్పాలనమునకై సంతసమునఁ
ప్రాణములనైన నర్పించువారె కాని
యెఱుఁగ రనృతంబుఁ బల్కుట నింతదనుక
భరతఖండనివాసు లోపార్థివేంద్ర!

అలె—(ఒకసారి సెల్యూకసును జూచి మరల జంద్రగుప్తునితో) మంచిది. సత్యమునే వచింపుము. ఏమి వ్రాయుచుంటివి?

చంద్ర—మహారాజా! తమసైన్యసంచాలనాపద్ధతియు, వ్యూహారచనాప్రణాళికయు, సామరికవిద్యావిధానము మున్నగునవి నెలనుండి నేర్చుకొనుచుంటిని.

అలె—ఎవరియొద్ద ?

చంద్ర—తమసేనాపతియొద్ద.

అలె—ఇది యథార్థమా ? సెల్యూకస్ !

సెల్యూ—యథార్థము, స్వామీ !

అలె—(చంద్రగుప్తునితో) తరువాత ?

చంద్ర—ఇటనుండి తమసేన తిరిగిపోవునని విని నేను నేర్చుకొనిన దంతయు వ్రాసికొనుచుంటిని.

అలె—ఏయభిప్రాయముతో ?

చంద్ర—తమతో యుద్ధముచేయు నభిప్రాయముతోఁ గాదు.

అలె—ఇఁక ?

చంద్ర—వినుఁడు, సమ్రాట్ ! నేను మగధదేశపు రాజపుత్రుఁడను. నాపేరు చంద్రగుప్తుఁడు. నాతండ్రిపేరు మహాపద్ముఁడు. నా సవతితమ్ముఁ డగు నందుఁడు సింహాసన మధిష్ఠించి నన్ను దేశమునుండి వెడలఁగొట్టెను. ఆరాజ్యము మఱలఁ గైకొనునిచ్ఛతో నందందు సంచరించుచుంటిని.

అలె—తరువాత ?

చంద్ర—మేసిడోనియాప్రభువర్యుని యత్యద్భుతవిజయవార్తల నాలించితిని. ఆసియాఖండార్ధమునం గల దుస్తరనదనదీపర్వతముల దుర్వారవిక్రమమున నతిక్రమించి భరతదేశమున కరుదెంచి యార్యకులభూషణుఁ డగు పురుషోత్తమమహారాజు నోడించిన సంగతి వింటిని. ఎవనిబొమముడిపాటు గనినంత నాసియాఖండార్ధము తల్లడ మందునో యాతని మహాపరాక్రమముఁ గనులారఁ జూడ నిచ్ఛగింతిని. ఆర్యుల యనివార్యవీర్యమును బ్రచలితముం జేసిన యాతని యనుపమశక్తి యెం దిమిడియున్నదో తెలిసికొన నెంచితిని. అందుకే యిక్కడ కరుదెంచి తమ సేనాపతి శిక్షణ

మున నుంటిని. పోయిన సామ్రాజ్యమును మఱల సంపాదించు టయె నాకోరిక. కేవల మంతియె.

(అలెగ్జాండరు సెల్యూకసును జూచును)

సెల్యూ—ఆసంగతి నాకుఁ దెలియదు. ఈయువకుని ముఖలక్షణములు, వేషభాషలు నన్నాకర్షించినవి. అందువలన నీయువకునితో మన యుద్ధపద్ధతు లప్పుడప్పుడు చర్చించుచు వచ్చితిని. కాని యీ తఁడు విశ్వాసఘాతుకుఁడని యెంతమాత్రముఁ దెలిసికొననేరనైతిని.

ఆంటి—ఎవరు విశ్వాసఘాతుకుఁడు?

సెల్యూ—ఈయువకుఁడు.

ఆంటి—ఆతఁడు కాదు, నీవు.

సెల్యూ—ఆంటిగోనస్! నావయస్సును గౌరవింపకపోయినఁ బోవుదువు గాక! నాయధికారపదవినైన గుఱుతింపుము.

ఆంటి—ఎఱుఁగుదును. నీవు గ్రీకులసేనాపతి వని యెఱుఁగుదును. అందుకే విశేషించి నీవు విశ్వాసఘాతుకుఁడవు.

సెల్యూ—ఆంటిగోనస్! (ఒరనుండి కత్తిదీయును)

(ఆంటిగోనస్ కూడ ఖడ్గము నెత్తి సెల్యూకసుశిరముపై వేయనుండ నతిలాఘవమునఁ జంద్రగుప్తుఁడు దనకరవాలముఁ బెఱికి యాదెబ్బ [illegible] చును. ఆంటిగోన సాతని వదలి చంద్రగుప్తునితోఁ బెనఁగును)

అలె—ఆగుఁడు.

(వెంటనే చంద్రగుప్తుని ఖడ్గాఘాతమున ఆంటిగోనస్ కత్తిపడును)

అలె—ఆంటిగోనస్!

(ఆంటిగోనస్ లజ్జచే దలవంచుకొనును)

అలె—నీ వీయౌద్ధత్యకారణమున రాజ్యమునుండి బహిష్కరింపఁ బడితివి. ఒకసామాన్యసైన్యాధికారి కింత సాహసమా! నే నింత వఱకును విస్మయముతో మౌనమూని చూచుచుంటిని. నీ కింత

స్పృహకలదని కలనైన తలఁపనైతిని. పొమ్ము, ఈక్షణమునసే నిన్ను బహిష్కరించితిని. పొమ్ము. (అంటిగోనస్ పోవును)

సెల్యూకస్! నీయపరాధ మంతగొప్పది కాదు. కాని గ్రీకురాజ్యాధిపతియుండు, తత్సేనాధిపతి కండ్లెఱ్ఱ జేసిచూచుట శుభము కాదని యింక ముందు జ్ఞాపక ముంచుకొనుము. ఏమి? యువకుఁడా!

చంద్ర—సమ్రాట్!

అలె—నిన్నిప్పుడు కైదుచేసిన?

చంద్ర—ఏయపరాధమునకయి? సమ్రాట్!

అలె—శత్రుగూఢచారివై మాశిబిరములను బ్రవేశించితి వను నపరాధమునకు.

చంద్ర—ఈయపరాధమునకా! ఇంతవఱ కలెగ్జాండరు మహావీరుఁ డనుకొంటిని గాని, యుత్తపిఱికిపంద యని కనుఁగొంటిని. ఇల్లువాకిలి లేక యల్లాడుచు శిష్యత్వ మంగీకరించి వచ్చిన యొకనిరాశ్రయహిందూరాజపుత్రుని గాంచి యింత భయభీతియా? అలెగ్జాండ రింత కుత్సితుఁ డని కలనైనఁ దలఁపలేదు.

అలె—సెల్యూకస్! కైదుచేయుము.

చంద్ర—సమ్రాట్! ప్రాణము లీబొందె నుండ నన్ను కైదుచేయలేవు. (కత్తి దూసి)

గీ॥ ఖడ్గ మిది యండయై యుండఁ గైదుసేయఁ
గడఁగు హతభాగ్యు లెవ్వరో కదలి రండు
పరమపూసధనుండైన భారతీయ
శూరవరుసాహస మొకింత చూడఁగలరు.

అలె—(సోల్లాసముగ) సెబాస్! యువకుఁడా! సెబాస్! నిన్ను కైదుచేయము. పొమ్ము!

గీ॥ సహజశౌర్యాన్వితుని మహాగ్ర్యసాహసమ్ము
విక్రమోదారుసకుఁ గడుఁ బ్రీతి నిడును
కలియఁబడవచ్చు నిర్ఝరివిలసనముల
కంబునిధి పొంగి యొసఁగదే స్వాగతమ్ము.

మంచిది. వీరాగ్రేసరా! నిన్నుఁ గైదుచేయము. కేవలము పరీక్షించుట కట్లంటిమి. నిర్భయముగ నింటికిఁ బొమ్ము. నీభవిష్యత్తుఁ గొంతఁ జెప్పెదము, జ్ఞాపక ముంచుకొనుము. ఒకనాఁడు నీవు నీయసహాయ్రాత రాజ్యమును సంపాదించి దుర్జయుఁడవై దిగ్విజయముం గావింతువు. పొమ్ము. వీరాగ్రణీ! నీవు విడువఁబడితివి.

(నిష్క్రమించును)

---

## ద్వితీయదృశ్యము

స్థానము — శ్మశానవాటిక

సమయము - ప్రభాతము

(ఒంటరిగా చాణక్యుఁడు నిలఁబడియుండును)

చాణక్యుఁడు—ఈజలప్లావితభూమినుండి సుడివడి పొగలెగయుచున్నవి. కుళ్లిన మాంసాస్థిరాసుల దుస్సహదుర్గంధవీచికలకు జగత్ప్రాణుఁడునైత మూపిరాడక యుక్కిరిబిక్కిరి యగుచున్నటులున్నది. కుక్కలవికటభౌభౌకారము లీ నిర్జనప్రాంతపు గాఢప్రశాంతిని భంగ మొనరించు చున్నవి. ఈప్రభాతము ప్రకటవికృతాకార యయి కాన్పించుచున్నది. ఓసుందరీ! భీభత్సమా! నీ వెంత జగన్మోహనాకారవు. నీరూపలోభమునగఁదా గ్రామము వీడి నీకుటిలాట్టహాసస్రవంతిని స్నానమాడుటకుఁ బ్రబలిదిన ముముక్షులు కాల మునఁ బరుగిడివత్తును. సఖీ! నీవలన నెన్నియో నేర్చుకొంటిని. ఒకటియా! భ్రాంతిమంతమగు నీప్రపంచము నేవగించుట నేర్పినది నీవు. మానవుని శక్తిదౌర్బల్యము నెఱుంగుట నేర్పినది నీవు.

దైవోద్దిష్టములగు దురదృష్టపరంపరలకు ఓర్పును చూపి యెదుర్కొనుటయు నేర్పినది నీవ. ఓసుందరీ! ఈమాయాప్రపంచమునుండి యింకను దూరమునకుఁ దీసికొని పొమ్ము. ఎంత దూరము తీసికొనిపోఁగలుగుదువో యంతదూరము తీసికొని పొమ్ము. నరకమైనను మంచిదే. ఈప్రపంచమునకు దూరమైనఁ జాలును.

(ఇరువురు పురుషులు మాటలాడుచు వత్తురు)

౧ వ్యక్తి—అయితే కాత్యాయనుఁడా? క్రొత్తమంత్రి!

౨ వ్యక్తి—కాత్యాయనుఁడు కాదు, శాకతాలుఁడు.

౧ వ్య—ఆయనపేరే కాత్యాయనుఁడు. శాకతాలుఁడను పేరెవరికైన నుండునా? నే ననుకొనున దేమన?

౨ వ్య—ఏ మని?

౧ వ్య—మహారాజాయనను కారాగారవిముక్తుని జేయుటయే పరమాశ్చర్యము. పైగా మంత్రిని గావించుట! మొద టాతని యేఁడుగురు పిల్లలను హత్య గావించెను. ఇప్పు డిది ఏమి వింత?

గీ॥ జనపతులచిత్తవృత్తులు చంచలములు
నేటిశత్రుండె మఱునాఁడు నెయ్యుఁ డగును
నిగ్రహానుగ్రహములకు నియతి లేదు
చిత్తజల్లట్లు వచ్చును చెదరిపోవు.

౨ వ్య—రాజులు త్తకయాళిమనుష్యులు.

చాణక్యుడు—(దూరమున) 'విశ్వాసో నైవ కర్తవ్యః, స్త్రీషు రాజకులేషుచ.'

౧ వ్య—వాఁ డెవఁడు?

౨ వ్య—చాణక్యుఁ డను బాపనయ్య.

౧ వ్య—మానవుఁడేనా?

౨ వ్య—ఆఁ! మానవు డనియే విందును. కాని నాకు నమ్మకము లేదు.

౧ వ్య—అటులయిన పద. తొందరగాఁ బద. అపశకునమైనది.

౨ వ్య—పద. అతనిఁ జూచిన భయమగుచున్నది.

(ఇరువురు నిష్క్రమింతురు)

చాణ—ఇంత విద్వేషమా యీనీచులకు! బ్రాహ్మణున కొక్క శుష్క ప్రణామము చేయుటకైనను జేతులు రావుకాఁబోలును! కాని ఒకనాఁడు—మంచిది, ఇప్పు డామాటలతో నేమి? పోనీ—పొండు, శీఘ్రముగఁ దొలఁగిపొండు. నానీడకూడ మీమీఁదఁ బడనీయకుఁడు. నాయుచ్ఛ్వాసమునఁ గాలకూటవిష మున్నది. నేను దుర్భిక్షమును. మహామారిని. పారిపొండు. త్వరగాఁ బారిపొండు (దూరమున కాత్యాయనుఁడు ప్రవేశించును). నేనొక దరిద్రుఁడను, నీచుఁడను, నిస్సహాయుఁడను నగు బ్రాహ్మణుఁడనని కాబోలు ఈక్షుద్రకుశాంకురములుసైతము తలలెత్తికొని నిలఁబడినవి. ఈదర్భలను సమూలముగఁ బీకివైచెదను. (కుశలను బీకి గాలిలోనెగురవైచుచు) గ్రుచ్చుకొనుఁడు, గ్రుచ్చుకొనుఁడు, ఇంకను గ్రుచ్చుకొనుడు. భూసురునిపాదముల కిపుడు గ్రుచ్చుకొందురా? ఇఁక గ్రుచ్చుకొనుఁడు.

కాత్యా—(దగ్గఱకు వచ్చి) చాణక్యా! నమస్కారము.

చాణ—నీ వెవ్వఁడవు?

కాత్యా—నేను నందమహారాజుమంత్రిని, కాత్యాయనుఁడను.

చాణ—అటులనా? తమరు నందమహారాజుగారి మంత్రు లేమి! ఇట నుండి త్వరగా దయచేయుఁడు.

కాత్యా—ఎందుకు? నే నేమి యపరాధ మొనర్చితిని?

చాణ—లేదయ్యా! యేమియు లేదు. మీ రపరాధము లొనరింతురా! పాపము! ఏయపరాధమును జేయలేదు. మహారాజుకూడ

నేయపరాధముఁ జేసి యెఱుఁగఁడు. ఈశ్వరుఁడును నపరాధ మేమియుఁ జేయలేదు. ఆపరాధము లన్నియు నావియె. మహారాజు నా సర్వస్వము నపహరించెను ఇదియు నా యపరాధమే. ఈశ్వరుఁడు నా యిల్లు పాడుపెట్టి నా గృహలక్ష్మి నకాలమున నన్యాయముగ నెత్తుకొనిపోయెను. ఇదియు నా యపరాధమే. దొంగలు నా యేకపుత్రికను హరించిరి. ఇదియు నాయపరాధమే. నే నుత్త యధమాధముఁడ నని గ్రహించి యిప్పు డీ కుశాంకుర ములు సైతము తలలెత్తికొని నిలఁబడినవి. (కుశాంకురములను జూచుచు) ఏమి! పాదములకు గ్రుచ్చుకొనుఁడు, గ్రుచ్చు కొనుఁడు. ఊఁ, ఇంకను గ్రుచ్చుకొనుఁడు. ఇప్పుడు గ్రుచ్చు కొన రేమి?

కాత్యా——చాణక్యా! తమవద్దకే నేను వచ్చితిని.

చాణ——ఎందుకు? మంత్రిమహాశయా! ఇప్పుడు నాకడ నేమియు లేదు. ఆగుడిసెమాత్రము మిగిలినది. అదియు శూన్యమైనదే. కావల సినఁ దీసికొనిపొమ్ము. లేకపోయిన పాడుచేయుము. నిప్పంటిం పుము. ఆహా! నేఁడు బ్రాహ్మణుల కా పరితాపమేయున్నచో—

కాత్యా——ఆ పరితాప మెందుకు లేదు! పాణిని చెప్పినాడు——

చాణ——అదంతయు మా దోషమే. ఒక జాతియొక్క సమస్తవిద్య, యశము, సామర్థ్యము తమకే హక్కుగాఁ జేసికొనిన వా రెవ్వరైన వృద్ధిపొందఁజాలుదురా? శరీర మాఁకలిచే మాడు చుండిన మెదడు బలముగా నుండునా? ఇ దెవ్వరైనఁ జూచి సహింతురా? లేదు. అందులకే యీ పతనము; అధఃపతనము. ఓ సుందరీ! నీవే చెప్పుము. ఇది సత్యమా? కాకపోయిన నింత యధఃపతన మెట్లు కలుగును?

కాత్యా——అరె, ఆ రెండవవా రెవరు? ఎవరితో మాటలాడుచున్నాఁడు!

చాణ——ఆహా! ఎంత యధఃపతనము, పర్వతశిఖరమునుండి యొక్క సారిగా నీయగాధమునకు! ఒక కలుగునుండి వేఱొక కలుగులో

దూఱు నెలుకవలె నేటి బ్రాహ్మణుఁడు గుప్పెడు బియ్యమున
కయి యిల్లిల్లు చచ్చిచెడి తిరుగుచున్నాఁడు. సిగ్గుగూడను లేదు.

సీ॥ ఎవ్వాని పదపాంసు వెలమి త్రైవిష్టపా
ధ్యక్షునకును శిరోధార్యమయ్యె
నెవ్వాని పదచిహ్న మిందిరాభర్తకు
శ్రీవత్సమునకన్నఁ జెలువమయ్యె
నెవ్వాని వాణి యీరేడులోకములకు
శాస్త్రసమ్మతమైన చట్టమయ్యె
నెవ్వాని విజ్ఞానదృష్టి కీశ్వరసృష్టి
మర్మమ్ము కరతలామలకమయ్యె

గీ॥ నెవని సద్ధర్మశక్తికి భృత్యులట్లు
పంచభూతమ్ములును వశంవదములయ్యె
మృత్యు వెవ్వానియిచ్ఛమై మెలఁగు నట్టి
బ్రాహ్మణుఁడు నేఁడు లేఁడు ప్రపంచమందు.

ఇప్పుడో,

గీ॥ జ్ఞానమంతయు నన్యవంచనము నంద
ధ్యానమంతయుఁ బ్రభువుల దాస్య మంద
నిష్ఠయంతయుఁ బొట్టమ్ము నెర పుటంద
నిలిచె బ్రాహ్మణనామధారులకు నేఁడు.

ఉపవీతమాత్రావశిష్టుఁ డగు నేటి బ్రాహ్మణుఁడు పొట్ట
కూటికయి భిక్షాటనము సేయుచున్నాఁడు. ఆహా! యెంత యధః
పతనము!

కాత్యా——బ్రాహ్మణుఁడు పడిపోయిన మఱల లేవఁగలఁడు.

చాణ——అసంభవము. ఆ శక్తిసామర్థ్యములు పోయినవి. ఏమి సుందరీ!
పోలేదా?

కాత్యా——ఎట్లు? ఇప్పటికిని బ్రాహ్మణుఁడే మంత్రి. బ్రాహ్మణుఁడే
పురోహితుఁడు. బ్రాహ్మణుఁడే విదూషకుఁడు. బ్రాహ్మణుఁడే

వ్యవస్థాపకుఁడు. సమస్తసమాజమును స్వర్ణసూత్రమున గుదిగూర్చు సూత్రధారుఁ డిప్పుడును బ్రాహ్మణుఁడే.

చాణ—కాని రాత్రి సమీపించినది అటు చూడు! (దూరముగా చూపించును)

కాత్యా—ఏమి చాణక్యా! బ్రాహ్మణుఁడు తన ప్రభుత్వమును దాను చేతులార పాడుచేసికొనెను. మఱల నాతఁడే దాని నుద్ధరించును. భూసురోత్తమా! అందులకే నేను మీవద్దకు వచ్చినది.

చాణ—ఎటుల?

కాత్యా—మహారాజు మాతామహుని శ్రాద్ధమున తాము పౌరోహిత్యము చేయవలయును.

చాణ—మంత్రిమహాశయా! నేను దీనుఁడను, దరిద్రుఁడను, నిస్సహాయుఁడను నగు బ్రాహ్మణుఁడ నగుట వాస్తవము. ఒకరోజు తినుట కుండును. ఒకరోజున నదియు నుండదు. అయినను మహారాజునకుఁ బౌరోహిత్యము చేయఁజాలను. చచ్చినను సరే. చేయఁజాలను. నేను రాజునకు దాస్యమును జేయను.

గీ॥ ఎల్లియన నెల్లి మల్లినా మల్లి యనుచు
నక్క—వినయాలు జూపు ననాథగాక
స్వాభిమానంబు గలిగిన జనుఁ డెవండు
స్వేచ్ఛ విడనాడి రాజు సేవింపఁగోరు?

కాత్యా—వినుము భూసురోత్తమా!

చాణ—వలదు, వలదు. అబ్బా! ఏ మీయన్యాయము. నాగుడిసెలో నేను కూరుచుండి యేడుచుటకును వీలు లేదా?

కాత్యా—పురుషు లేడ్చుట మంచిది కాదు.

చాణ—అది యథార్థమే. పురుషు లేడ్చు టంత మంచిది కాదు. (ఆలోచించి) కాని యేమిచేయుదు? మంత్రిమహాశయా! ఎడ

తెంపులేక యొకటివెనుక నొకటిగా వచ్చు దురదృష్టపరంపరలకు నే నణుమాత్రము చలింపలేదు. కాని తుట్టతుదకీ కన్యాపహరణముతో నావెన్ను విఱిగిపోయినది.

కాత్యా——పండితుఁడవయ్యు నింతయధీరుఁడ వయితివా!

చాణ——అధీరుఁడ నయితి నందువా? ఏడిచి యేడిచి నాకన్నీటి వెల్లువ నీభూమినంతయు ముంచి లేవనెత్తవలయు నని యున్నది. కాని కన్నీ రింకిపోయినది. ఒక్కొకపుడు లోపల నశ్రువులు గడ్డకట్టినవా యనిపించును. ఈ విచారములు నీయత్యాచారములు నీశ్వరునిగూడ గప్పివైచినవి. కనుకనే నే నీశ్వరుఁ గనఁజాలకున్నాను.

కాత్యా——నీ వీశ్వరుని మఱలఁ బొందఁగలవు. మబ్బులు విడిపోవును. ఒంటరిగాఁ గూరుచుండి చింతించుట మానివేయుము. నూతనోద్యమమున కాచార్యుఁడవు కమ్ము. కర్మరంగమునకు దిగుము. ఈకార్యమయప్రపంచమున నూరక కూరుచుండిన ప్రొద్దుపోదు.

చాణ——అది నిజము. ఊరక కూరుచుండిన ప్రొద్దుపోదు.

కాత్యా——మానవజీవితమంతయు సుఖదుఃఖములందే యిమిడియున్నది. చూడుము. ప్రకాశాంధకారములలోనే సమయవికాసమున్నది. ప్రపంచమున నీ వొక్కఁడవే దుఃఖభాజనుఁడ వనుకొంటివా? ఈ నందమహారాజు నాజ్ఞచే నాయేడ్వురు పిల్లలు ననాహారులయి చనిపోవుట నాకనులార గాంచితిని.

చాణ——ఆఁ! అటులనా! అంతచేసినను నాతనికి మంత్రిగా నుంటివా?

కాత్యా——అవును. చాణక్యా! కేవలము పగదీర్చుకొనుటకే బ్రతికితిని. అనాహారుఁడ నయినను చావలేదు. పగ దీర్చుకొనుటకే మంత్రిత్వ మంగీకరించితిని. చాణక్యా! నీవు నాకుఁ దోడ్పడుము.

చాణ——బ్రాహ్మణులకు నింత యత్యాచారమా? ఓ తరుణీ! ఇంత తీవ్రదృష్టితో నేల చూచుచుంటివి? ఏమియాజ్ఞ?

కాత్యా—రమ్ము. బ్రాహ్మణునియందు లుప్తమయిన యీతేజస్సును మన మిర్వురమును పునరుద్ధరింతము. నేను రాజుమంత్రిని. నీవు పురోహితుఁడవు. నేఁడే మన మిరువురమును గలసి మనపై జరిపిన యన్యాయములకుఁ బ్రతీకారము తీసికొందము. ఎంతవఱకు భారతవర్షము భారతవర్షమో యంతవఱకు బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుఁడే. రమ్ము సోదరా! రమ్ము.

చాణ—(చెవియొగ్గి విని) మంచిది. నేను పౌరోహిత్య మంగీకరించితిని. ఇదియేకా నీ యాజ్ఞ. మంత్రిమహాశయా! అంతయుఁ బోవు నని తెలియును. విశ్వాసహీన మగు నీబౌద్ధయుగమున బ్రాహ్మణుని శఠత్వము, వంచకత్వము బయటపడినవి. ఈ యుగము బ్రాహ్మణులకుత్సుక పట్టుకొనినది. ఆబౌద్ధమతప్రవాహమును జూడుము. ఎటుల పరుగిడి వచ్చుచున్నదో! పోవును. బ్రాహ్మణప్రభుత్వము పోవును; పోవుటకు సిద్ధముగా నున్నది; తప్పక పోయి తీరును. మనము రక్షింపఁజాలము; రక్షింపఁజాలము. ఆ ప్రళయమునకు పూర్వ మీ కలియుగబ్రాహ్మణుఁ డొకసారి ద్వాదశాదిత్యులకరణి నాకాశమును దహించి మఱి పోవును. పొమ్ము, వచ్చుచున్నాను. (నిష్క్రమింతురు.)

---

## తృ తీ య దృ శ్య ము .

---

స్థానము — నందమహారాజు ప్రమదావనము

సమయము — రాత్రి

[నందమహారాజు, సభాసదులు దర్బారు చేయుచుందురు. వేశ్యలు ఆడుచు పాడుచుందురు]

(చాణక్యుఁడు ప్రవేశించును)

చాణక్యుఁడు—మహారాజా!

౧ సభికుఁడు—ఆఁ ఎవరువారు? ఏమంత వుపద్రవం వచ్చింది?

౨ స—యే ఆకాశాన్నుండి వూడిపడ్డ దీ చుక్క ?

3 స—నీ వాడగలవా ?

నందుఁడు—మీా రెవరు ?

చాణ—నేను బ్రాహ్మణుఁడను.

౧ స—ఆడవాళ్ల గొడవ, బ్రాహ్మలగొడవ మాకక్కరలేదు. వెళ్లిపో.

౨ స—పో, ఇక్కడ నీ కెందుకు ? పో.

3 స—బ్రాహ్మ లుత్తసోమరిపోతులు.

నందు—ఇప్పుడు మీారు మావద్ద కెందుకు వచ్చితిరి ?

చాణ—మహారాజా ! తమ మాతామహుని శ్రాద్ధమున మంత్రము చెప్పుటకు వచ్చితిని. మిమ్ము యాచించుటకు రాలేదు.

నందు—అయితే బొట్టు కాటుక పెట్టి మిమ్ము రమ్మని ప్రార్థించిన దెవరండి ? స్వామీా !

చాణ—తమ మంత్రి.

నందు— మంత్రి రమ్మని పిలిచిన నాతనివద్దకే పొండు.

చాణ— తమబావమఱఁది నన్నవమానించినాఁడు.

౧ సభికుఁడు—ఆయన అట్లాగే చేస్తాడు లెండి.

౨ స—బావమరదు లందరు అవమానం చేస్తూనే వుంటారు.

స—బావమరదుల తప్పులు లెక్కలోకి రావు.

ాణ—(భూమిని కాలితో గట్టిగా తన్ని) మెదలకుఁడు. నీచులారా ! మహారాజా ! యీామూర్ఖులందఱు మీాశుభచింతకు లగు ప్రాణ మిత్రులనియా గౌరవించుచుంటిరి ?

చ॥ మనమున వాక్కునం గ్రియను మక్కువఁజూపుచుఁ గల్మిలేములం
దున నొకరీతిఁ గాంచి సుఖదుఃఖములం దగుతోడునీడలై
తనకు హితాహితమ్ముల యథార్థముఁ దెల్పెడివారుగాక యీా
ధనమున వచ్చిపోవు నరదైత్యులు మిత్రులె కూ్రరశాత్రవుల్ .

నందు—చాలు, చాలు. నీధర్మోపన్యాసములు కట్టిపెట్టుము. నిన్నెవరును నీతులు బోధింపుమని కోరలేదు. వచ్చినపని చూచుకొనుము. అయితే ఆతఁడు నిన్నవమానించిన నేమిపోయినది ? స్వామీ ! ఆయన మగధమహారాజునకు శ్యాలకుఁడని యెఱుఁగుదువు గద!

( వాచాలుఁడు ప్రవేశించును )

వాచా—అరే బ్రాహ్మఁడా ! నే నేమి సామాన్యుణ్ణనుకొన్నావా ? విను, మహారాజుగారికి నేను బావమరదిని. మహారాజుగారి తండ్రి నాతండ్రి వియ్యంకులు, మహారాజుగారి పట్టమహిషి నాసోదరి. మహారాజుగారి పుత్రుఁడు నామేనల్లుఁడు. తెలిసిందా? నేను సామాన్యుణ్ణి అనుకుంటున్నావు కాబోలు! బ్రాహ్మడా!

నందు—పో, ఇటనుండి వెడలిపో. బ్రాహ్మణుల కష్టసుఖములు వినుటకు మే మిక్కడ కూరుచుండ లేదు.

చాణ—మహారాజా ! మీ రెందుకు విందురు ? నేటి భూసురుఁ డానాటి భూసురుఁడు కాఁడు. అందుకే వారలసొత్తు నిస్సంశయముగ కొల్లగొట్టుట, నిస్సంకోచముగ వారల గన్నెఱ్ఱజేసి చూచుట క్షత్రియులకు సహజమై పోయినది. ఈబ్రాహ్మణుల కప్పటి ప్రభావమే యుండిన వారల క్రోధారుణదృష్టికి నీవు, నీసింహాసనముకూడ భస్మమగువారు; భూమిలో కూరుకొని పోవువారు. కాని యిప్పటికేని ఆప్రతాపము పూర్తిగా నశింపలే దని మహారాజు నిశ్చయముగ తెలిసికొనును గాక !

వాచా—మంచిది. బ్రాహ్మడి ప్రతాపం యేమిటో వొకసారి నేను చూస్తాను. మహారాజుగారి బావమరది ప్రతాపం నీవు వొకసారి చూద్దుగాని పద.

చాణ—చూచెదను, చూచెదను. మహారాజును జూడఁగలఁడు. దీనికిఁ బ్రతీకారము చేయనియెడ—

నందు——ఓయీ భిక్షుకుఁడా! ఏమి కండ్లెఱ్ఱజేసి చూచుచున్నావు, నిలఁబడి? పో, ఇక్కడనుండి దూరముగా పో.

చాణ——ఓ కలియుగబ్రాహ్మణులారా! చెవియొగ్గి వినుఁడు. క్షత్రియుఁడుభూసురుని దూరముగాఁబొమ్మని హుంకరించుచున్నాఁడు. అయినప్పటికిని సప్తమారుతము లేకమయి యొక్కపెట్టున వీవకున్నవి. అగ్నివర్షము కురియకున్నది. పృథివి కంపింపకున్నది. ఎంత విస్మారము!

నందు——మెడపట్టి యవతలకు గెంటుఁడు.

చాణ——ఓ భగవతీ! వసుంధరా! రెండువ్రక్కలుగా బ్రద్దలగుము. అరే బ్రాహ్మణుఁడా! మొద్దువలె నిలఁబడి యేమిటి చూచుచున్నావు? ప్రపంచము నిన్నుఁ గని నవ్వుచున్నది. గేలి కొట్టుచున్నది. భాగ్యవంతులయిండ్లకేగి 'భిక్షాం దేహి' యనుచుంటివా? సిగ్గులేదా నీకు?

శా॥ ఓరీ బ్రాహ్మణ! లెమ్ము రాజ్యబలగర్వోన్మత్తభూభృత్తిర
స్కారహ్రీపరితప్తమానసపుటీజాజ్వల్యకోపాగ్ని నీ
ధీరాజన్యయతంత్రకుండమున నుద్దీపించి నేఁ డీదురా
చారిన్ వ్రేల్వఁగ దీక్షఁ గైకొనుము స్వేచ్ఛాశక్తిప్రత్యర్థమై.

శక్తియుండిన కపిలమహర్షివలె నగ్నివృష్టి కురిపించి యీ నీచుల గర్వము భస్మమొనరింపుము. ఆ శక్తియే లేనిచో ఓరీ క్షుద్రుఁడా! మూర్ఖుఁడా! పదదళితుఁడా! మహత్వకళంకా! పొమ్ము, దాగుకొనుము. వెలుగుమొగము చూడకుము. రసాతలమునందల దాఁచికొనుము. పొమ్ము.

నందు——పిచ్చివాని ప్రలాపము వినుటకు కాదు, మే మిక్కడ కూరుచున్నది. వాచాలా! వానిని బయటకు గెంటుము

వాచా——(చాణక్యుని జుట్టుపట్టి లాగుచు) లేచిపో బిచ్చగాఁడా!

చాణ—ఏమి! మంచిది పోవుచున్నాను. పోవుటకు పూర్వ మొకమాట చెప్పి, మఱి పోయెదను. నందమహారాజా! నివురుగప్పి నష్టప్రాయమై యున్న బ్రాహ్మణుని ప్రతాపాగ్ని నీకలికాలమందే మఱల నొకసారి చూడఁగలవు. నందవంశోన్మూలనము చేయని యెడల నేను చణకుని పుత్రుఁడను కాను. నీక్రోన్మత్తరుధిరాస్రమగు చేతులతోఁగాని యీవిడినజుట్టు ముడువను. అంతవఱకు దల విరయఁబోసికొని యిట్లే యుండెదను. ఇదియే నాప్రతిజ్ఞ. నేను పోవుచున్నాను. బాగుగ జ్ఞాపక ముంచుకొనుము. మహారాజా! నీ వొకనాఁడీ భిక్షుకుని పాదములపైఁబడి ప్రాణభిక్ష పెట్టుమని ప్రార్థించెదవు. కాని నేను మాత్రము నీ కాభిక్ష పెట్టను. ఈ బ్రాహ్మణుని శక్తి, యీబ్రాహ్మణుని ప్రతిభ, యీబ్రాహ్మణుని ప్రతిజ్ఞాపాలనము, ఈబ్రాహ్మణుని శాపప్రభావము, యీబ్రాహ్మణుని క్రోధౌద్ధత్యము, ఈబ్రాహ్మణుని దుర్జయప్రతాపము ఆనాడే చూడఁగలవు.

(నిష్క్రమించును.)

నందు—వీఁడెవఁడు? అక్కడ నేమి జరిగినది?

వాచా—ఏం జరుగుతుంది! ఈమూర్ఖప్పశువు మంత్రము చెప్పటకు వచ్చాడు. నే నింకొకపురోహితుణ్ణి తీసుకొచ్చాను. నే నీయనను వెళ్ళమంటే వెళ్ళలేదు. అప్పుడు మెడపట్టుకు గెంటాను. ఇదె నాతప్పు.

నందు—మెడపట్టుకొని యెందుకు గెంటితివి బ్రాహ్మణుని?

వాచా—నేను మహారాజుగారి బావమరదిని.

౧ సభికుఁడు—ఇందులో గొప్ప తమాషా యేమిటంటే మహారాజుగారు యీయనకు బావగారు.

౨ స—ఈయన తండ్రి మహారాజుగారికి మామగారు.

3 స—బాగాచేశావు. చాలబాగచేశావు.

నందు—మజా యంతయు పాడయినది. సరే కానిండు.

౧ స—యేం పాడయింది? వొక కొత్త తమాషా జరిగింది.

౨ స—వాఁడు చక్కఁగా పాడాడు.

౧ స—శ్రార్థాల్లో యిట్లాంటి ఆనందం కలుగదు. ఆట, పాట పిల్లల పెళ్ళిళ్లల్లో వుంటాయి.

౨ స—అది ఒకమాదిరి శ్రార్థమే.

౧ స—అది యెట్లా?

౨ స—శ్రార్థాలు మూడు విధాలు. ఒకటి తండ్రి శ్రార్థం. దీన్నే తండ్రి తద్దినం అంటారు. రెండోది కన్నె శ్రార్థం. దీన్ని పెళ్ళి అంటారు. మూడోది రూపాయల శ్రార్థం. దీన్ని వ్యాజ్యం అంటారు.

3 స—ఆ పిశాచంశ్రార్థం పేరు, దా న్నేమంటారు?

ర స—ఇప్పుడు జరిగింది అదే.

(మురతో కాత్యాయనుఁడు ప్రవేశించును)

నందు—మఱల వీ రెవరు? వీ రిక్కఁడ కెట్లు వచ్చిరి?

కాత్యా—మహారాజా! తమ యాజ్ఞానుసారము ఆలస్యము చేయకుండ—

నందు—అయితే యిక్కఁడకు తీసికొని రమ్మని చెప్పితినా? ఇది ప్రమదావనము. నీకు బొత్తిగా మంచిచెడ్డలు తెలియవు సుమా!

ముర—వత్సా! నీ నోటినుండి యీమాట వినుటవలన పరమానంద మయినది.

నందు—నిన్ను సంతోష పెట్టవలయు నని మే మేమియుఁ జేయుటలేదు. ని న్నందుకు పిలువను లేదు. కాని, మంత్రీ! ఈస్థాన మేమిటి? రాజకార్యమేమిటి? నీవు ఉత్త యవివేకివి.

కాత్యా—ఆజ్ఞ యయిన మఱల నీమెను తీసికొని వెళ్ళెదను.

౧ సభికుఁడు—మంత్రిగారు! మీరు చేసింది యెల్లావుందంటే—

౨ స—యెల్లావుంది?

౧ స—ఒకఁడు పల్లకీ యెక్కి వెళ్ళుతున్నాడు. కొంత దూరం వెళ్ళిన తర్వాత జేబు చూచుకునే సరికి కూలి యిచ్చేందుకు డబ్బులేక పోయింది. అప్పుడు వాడు బోయీలను పిలిచి, "అరే బోయీలు! నాదగ్గర రాగి దమ్మిడి అయినా లేదు. మీరు చాలా బీదవాళ్ళు. పాపం యీనష్టం యెట్లా భరిస్తారు? మంచిది, నన్నెక్కణ్ణుంచి మోసుకొచ్చారో అక్కడకు మళ్ళీ తీసుకు వెళ్ళండి. లేకపోతే నన్నిక్కడ దింపి మీదారిని మీరు పొండి. నేను నడిచే పోతాను" అన్నాడు.

3 స—ఒకఁడు సరిగ్గా యిట్లాగే చేశాడు. వాడు కూలివాళ్ళను పెట్టి బావిని తవ్వించాడు. వాళ్ళడిగిన కూలి యిచ్చేందుకు యిష్ట పడక వాళ్ళందరిని పిలిచి "నే నిచ్చేది మీకు నచ్చకపోతే మీరు తవ్వింది మీరు పూడ్చి పొండి. నే నింకొకళ్ళనుపెట్టి నుయ్యి తవ్వించుకొంటాను" అన్నాడు.

కాత్యా—మహారాజా! తిరిగి యథాస్థానమునకు పంపుమందురా యీమెను?

నందు—సరే, తీసికొని రానే వచ్చితివికద. (మురతో) అమ్మా! నీ పుత్రుఁడు చంద్రగుప్తుఁడు సజీవుఁడేనా?

ముర—జీవించియుండెనా? ఎక్కడున్నాడు, ఎందున్నాడు?

నందు—ఆసంగతి తెలిసికొనుటకే నిన్ను రప్పించినది. వాడెక్కడున్నది నీకు తెలియునా?

ముర—అబ్బాయీ! నాకు తెలియదు.

నందు—కాదు, నీకు తప్పక తెలియును. చెప్పుము వాఁడెక్కడున్నాఁడో. లేకపోయిన నందుని యెఱుఁగుదువు కద!

మురా——నందునే యెఱుఁగనా? ఎఱుఁగకేమి, చక్కగా నెఱుఁగుదును. వాని నొడిలో నుంచుకొని పెంచి పెద్దవానిఁ జేసితిని. ఱొమ్ముపై నిడుకొని నిద్రపుచ్చితిని.

నందు——ఆఁ! అవి యన్నియు నీకు గౌరవాస్పదములు. చంద్రగుప్తుఁ డెట నుండెనో యిపుడేని చెప్పుము.

మురా——నాకు తెలియదు.

నందు——తెలియును. బయట పెట్టుము. లేకపోయిన——

మురా——చంపెదవా? చంపుము —— కాని యిప్పుడు వద్దు. చచ్చుటకు పూర్వ మొకసారి చంద్రగుప్తుని జూడవలె నని యున్న ది——ఒకసారి——ఒక్కసారి మాత్రమే.

నందు——వధింపను. ఇంత శీఘ్రముగా వధించిన మాపని కాదు. నిన్నాజన్మాంతము కారాగారమున నుంచెదను. క్షుధాగ్నిచే మలమల మాడునట్లు చేసెదను.

మురా——ఇంతనిష్ఠురుఁడవు కాఁజాలవు. నేను నీకు తల్లిని.

నందు——ఆహా! శూద్రిణి తల్లియా? నాతండ్రి కుంపుడుకత్తెవై నంతమాత్రమున మహారాజునకు తల్లివి కాఁగోరుచున్నా వేమి?

మురా——అయ్యో! (తలవంచుకొనును)

౧ సభికుఁడు——ఒకకథ జ్ఞాపకం వచ్చింది. ఒక——

నందు——మాటలాడకు——మహారాజునకు మాతవు కాఁగోరుచున్నావు? శూద్రిణి! తల్లి!

మురా——లేదు. మహారాజునకు మాతను కాగోరుట లేదు. చిరకాలము నీవే చక్రవర్తిగా నుండుము. నాచంద్రగుప్తుఁడు భిక్షుకుఁడుగా నుండును. బ్రతికియుండిన చాలును. నాకు కావలసిన దంతియె. నే నాతని నొకసారి చూడఁగోరుచున్నాను. ఒక్కసారి యక్కున

జేర్చుకొని యేడువఁగోరుచున్నాను. నేను చంద్రగుప్తుని తల్లిని.
అదియే నాకు పరమగౌరవము.

గీ॥ దుష్టగుణసంకరమున నికృష్టుఁడైన
రాజరాజును గన్న దుర్గతికకన్న
సుగుణభూషణుఁడైన భిక్షుకుని తల్లి
యగుట యెంతయు మాననీయంబు సూవె!

నందు—సరి. ఇప్పుడైన జెప్పుము. చంద్రగుప్తుఁ డెచ్చట నుండునో?

ముర—అది నాకు తెలిసినను చెప్పను. ప్రాణము రక్షించుకొనుటకు తల్లి తనపిల్లలను క్రూరవ్యాఘ్రమున కప్పగించు ననుకొంటివా మహారాజా? ఓయీ మూర్ఖుఁడా! మాతృశబ్దార్థము నీకు బోధ పడలేదు.

నందు—చెప్పవు కాదు? మంచిది. చంద్రగుప్తుఁడు శత్రువులతోఁగూడి నాకు విద్రోహము చేయనెంచుచున్నాఁడని వింటిని. సైన్యము పోగుచేయుచున్నా డట.

ముర—ఓభగవానుఁడా! ఈమాటయే సత్యమైనచో చంద్రగుప్తుఁడు తన జననియవమానమునకుఁ దప్పక బదులు తీసికొనును.

నందు—కారాగారమునకుఁ దీసికొని పొమ్ము.

వాచా—పద. (కొప్పు పట్టిలాగును. సభికులు నవ్వుదురు. వారితో నందుఁడుకూడ నవ్వును.)

ముర—ఔరా! చివరకు ఇంతవఱకు వచ్చినది. నందమహారాజా! నీతల్లి పరాభవమును జూచి యానందించుచుంటివా? నీవుకూడ నీదుష్టులతోఁ గలసి నవ్వుచుంటివా? నేను నీకు మాతనుగాను. నేను నీకు పాలీయ లేదు. ఏరాక్షసియో రక్తము త్రాగించి నిన్ను పెద్దవానిని జేసినది. కానిమ్ము.

౧ సభికుఁడు—సెబాస్! చాల చక్కఁగా చెప్పింది.

౨ స—బాగుంది, ఇంకా చెప్పనీ.

3 స—సిగ్గుపడతారేమి మహారాజా?

మురా—నందమహారాజా! నేను నీకు జనని కాను. నేను దీనను, నిస్సహాయను, యబలను. స్త్రీపై కళంకాపాదనము—దుర్బలపై నత్యాచారము— స్త్రీ సహించును కాని ధర్మము సహింపదని తెలిసికొనుము.

మ॥ కలుషస్వాంతులు ద్రోహు లాత్మజననీగర్భైకవిచ్ఛేదకుల్
ఖలు లీమానవరూపరాక్షసులసంగాతమ్మునంగూడి న
న్నలయింపం దొరకొంటి లోకమున న్యాయంబన్న దే యున్నఁ ద
త్ఫలముఁ బొందెదు సాధుబాధ యెటు దైవంబోర్చురా దుర్మతీ!

వాచా—రా, నీధర్మపన్నాలు వినుట కిక్కడ యెవరు కూర్చోలేదు. పద (మెడ పట్టుకొనును).

నందు—చంద్రగుప్తుఁ డెటనుండెనో యిప్పుడైనఁ జెప్పుము. లేకపోయిన—
(ఒరదీసిన ఖడ్గముతో చంద్రగుప్తుఁడు ప్రవేశించును.)

చంద్రగుప్తుఁడు—ఇదిగో! చంద్రగుప్తుఁడు నీ ప్రక్కనే యున్నాఁడు. అధమా! (వాచాలుని తన్ని క్రింద బడవేసి) తల్లీ! నీ కెంత యవమానము సంభవించినది? చంద్రగుప్తుఁడు జీవించియుండఁగా నీ కింత యవమానమా తల్లీ!

మురా—వత్సా!

చంద్ర—భీరూ! పాషండా!

గీ॥ పెనిచి నినుపెద్దఁజేసిన జనని నిటుల
పరిభవమొనర్చి తద్దాని పాపఫలము
వంశమునుబట్టి కాల్పక వదలి చనునె?
యిల్లలుకఁగానె పండువౌనే కృతఘ్న!

కాపురుషా! దీనిఫలము త్వరలోనే యనుభవింతువుగాక. [illegible] ! రమ్ము.

(నిష్క్రమింతురు.)

## చతుర్థదృశ్యము

స్థానము—మలయరాజ్యమున చంద్రకేతుని భవనము
సమయము — సాయంకాలము

(చంద్రగుప్తుఁడు, చంద్రకేతుఁడు)

చంద్రకేతు—మహారాజా! ఈభవనము తమదిగా భావింపుఁడు. నేను తమ యనుచరుఁడను. నాయందు విశ్వాస ముంచుఁడు. నాయీ భిల్లసైన్యములు తమకై ప్రాణమర్పించుటకు సిద్ధముగా నున్నవి.

చంద్రగుప్తుఁడు—చంద్రకేతూ! నే నీ యశిక్షితసేనకు గ్రీకుల యుద్ధ పద్ధతుల నేర్పెదను. సామరికవిజ్ఞానమునందు క్రమశిక్షణనందిన యీయాటవికసాహసమునందు ఒక మగధరాజ్యములెక్కయా! సమస్తభారతవర్షము నిలువఁజాలదు.

చం॥ కే—కాని నందుని మంత్రి గొప్ప కూటనీతిజ్ఞుఁ డనియు, సమయమున ప్రజ్ఞాసమన్వితుఁ డనియు విందును.

చం॥ గు—అది నాకు తెలియును. నందుని పూర్వపుమంత్రి కాత్యాయనుఁడు నాపక్షమే యవలంబించెను. అదిగాక సర్వతంత్ర స్వతంత్రుఁడును, అతిసమర్థుఁడు నగు చాణక్యపండితుని తీసికొని రా నాతని నియోగించితిని.

చం॥ కే—ఆచాణక్యుఁ డెవరు?

చం॥ గు—ఆయన కడు సూక్ష్మబుద్ధియు, నేకనిష్ఠాగరిష్ఠుఁడును, విచక్షణ దక్షుఁడు నగు నొక భూసురుఁడు. చాల దినములనుండి నందునిపై నాతనికి ద్వేషాగ్ని రగులుచున్నది. ప్రస్తుత పరిస్థితులవలన నది ప్రజ్వరిల్లినదఁట. ఆయన గొప్ప మంత్రశాస్త్రవేత్తకూడనఁట.

చం॥ కే—ఎవ్వరు ?

చం॥గు—ఆయన గాలితో మాటలాడునంట. అగ్నితో మంత్రాలోచన సలుపునంట. ఆయన కోపదృష్టికి పచ్చిగడ్డియు భగ్గునమండి భస్మమగునంట. ఆయన ఏకాకి. ప్రపంచమునం దాయన కెవ్వరును లేరు.

చం॥ కే—కాని అటువంటి వ్యక్తి చాల భయావహుండు.

చం॥గు—ఈసమయములో మన కట్టి పురుషుండే ముఖ్యముగ కావలసినది. చంద్రకేతూ! నిన్ను నమ్ముకొని యుండవచ్చును గద!

చం॥ కే—మహారాజా! మగధరాజ్యమునకు న్యాయమగు ప్రభువులు తామని యొకసారి యెప్పుడు తెలిసికొంటినో, "సోదరా" యని యొకసారి యెప్పుడు మిమ్మాలింగనము చేసికొంటినో యప్పుడే రాజభక్తుం డగు నీచంద్రకేతుండు తమకొఱకు ప్రాణములనైన బలినీయ సంసిద్ధుం డని యెఱుంగుండు.

చం॥గు—సోదరా! (కౌంగిలించి) నా కిప్పు డితరచింత యేమియు లేదు.

(నేపథ్యమున) చంద్రగుప్తా!

చం॥గు—అమ్మా! వచ్చుచున్నాను. పద, చంద్రకేతూ; తల్లి యాశీర్వాదములను స్వీకరింతము, పద. (ప్రస్థానము)

(ఛాయాప్రవేశము)

ఛాయ—స్వర్గమునుండి దిగివచ్చిన మహేంద్రుండా యేమి యీమహనీయుండు! పూర్ణచంద్రోదయమువలె వీరిదర్శనము మహోదాహముగ నున్నది. వీరి కంఠస్వరము రణదుందుభిధ్వానమును మఱపించుచున్నది. సోదరు నాతండు కౌంగిలించినపుడు శరన్మేఘమును తరణికిరణము లావరించినటుల లోచనపర్వ మయ్యెను. మలయానిలమువలె వచ్చెను, పోయెను, సౌరభము వెదజల్లెను.

## గీతము

కాంతవసంతము వింతపత్రములఁ గట్టుక క్రొమ్మెర రమ్మా
సంతతమును నూతనగీతముల లతాంతసంతతులఁ దెమ్మా
ఎంతయు మంజుమంజరులపుంజముల నింపు నింపి ముదమిమ్మా
ప్రణయపాశమునఁ దవిలి యెల్లరును బడుచును లేచుచునుండన్
అనయము మవ్వపునవ్వుల నలరెద నమలసౌఖ్యస్ఫురితదండన్
ప్రేమ గీమ నే నెఱుఁగను నామధువిషమును మఱి నే నొల్లన్
ఎలనెలఁజుక్కల నలరులఁ దెమ్మా చలువలు తావులు చిమ్మన్
మలయమారుతపుతరగల లేపుమ యలకలు మొగమునఁ గ్రమ్మన్.

[పాడుచు పాడుచు పోవును]

(చంద్రగుప్తుఁడు, మురప్రవేశింతురు)

చంద్రగుప్తుఁడు—జననీ! ఈ యన్యాయమునకుఁ బ్రతిక్రియఁ జేయ వలయునని బయలుదేరి యగ్ని రగిలిచితిని. నీయవమానమందు హుతము చేసెదను. ప్రేమదౌర్బల్యమున సోదరుఁ డని నందుని క్షమింపఁదలఁచితినిగాని యిప్పటినుండియు నావిచారమంతయు నంతరించినది. నీకుగా నాప్రేమాశ్రుబిందువులే క్రోధాగ్నిస్ఫులింగములుగ మారినవి.

మురా—'శూద్రాణి తల్లియా' యని నందుఁడు నను పరిహసించినపుడు వత్సా! యేమని చెప్పుదు? ప్రళయశిఖిశిఖామధ్యమున నిలఁబడి నటు లున్నది. వానియాజ్ఞచే వాచాలుఁడు కొప్పుపట్టి యీడ్చి నపుడు— (యేడ్చును)

చం॥గు—అమ్మా! ఇంతవఱకు జయింతుమా లేదా యని కొంత సందేహము బాధించుచుండెడిది. ఇప్పు డది సంపూర్తిగాఁ దొలఁగి పోయినది. ఊరడిల్లుము, తల్లీ! ఊరడిల్లుము.

సీ॥ వలపుకై పురఁ బయిం బడవచ్చు భిల్లుండు
సమయఁడే దమయంతి శాపనిహతి
కౌరవాన్వయమెల్లఁ గరుగదే పరిభవ
ఖిన్నయౌ ద్రౌపది ఖేదవహ్ని
లంక రాక్షసరాజ్యలక్ష్మితో మునుగదే
పరితపించెడి సీతబాష్పధార
వెకలిచై దమొనర్చి విష్ణువు శిలఁగాడె
తిరుగని తులసీసతీత్వమహిమ
గీ॥ వారికంటెను నందుఁ డవార్యబలుఁడె
మెప్పు డాతఁడు నిను రచ్చ కీడిపించె
నప్పుడే వాని మనుజత్వ మంతరించె
సతుల కవమాన మొనరించి బ్రతికి రెవరు ?

సతీమతల్లుల నవమానించిన నొకజాతి జాతి నిర్మూలమగునన నొకనందవంశము లెక్కయా? తల్లీ! అదికూడను తప్పక నాశ మందును. పూర్తిగా పగతీర్చుకొనెదను. వడ్డితోఁ దీర్చుకొనెదను.

ముర—ఈయాశతోడనే ప్రాణముల బిగఁబట్టియుంటిని (ప్రస్థానము).

చంద్ర—శూద్రదదియా! శూద్రులు మనుష్యులు కారేమి? క్షత్రియుల వలె వారికి కాలుసేతులు లేవా? మెదడు లేదా? హృదయము లేదా? ఔరా! యెంత విద్వేషము! మంచిది. చూపించెద. ఒకసారి యీశూద్రునిశక్తి చూపించెద. శూద్రుఁడు కూడ నొక మానవుఁడేయని చూపించెద. అలెగ్జాండర్! మీభావిష్య ద్వాణి సఫలముఁ జేయుటయె నాజీవితముయొక్క యంతి మాదర్శము.

(కాత్యాయనుఁడు ప్రవేశించును)

చంద్ర—ఎవరు వారు?

కాత్యా—నేను కాత్యాయనుఁడను.

చంద్రి—చాణక్యులవా రెట నుండిరి ?

కాత్యా—వారు పూజ ముగించిన పిదప వత్తురు.

చంద్రి—చూచుటకు వా రెటు లుండిరి ?

కాత్యా—మథించినసముద్రిమువలె నున్నారు. బయలువెడలునది యమృతమో, కాలకూటవిషమో తెలియకున్నది. ఈసారి వారి ముఖలక్షణములు చూచిన మన కంత మంచివిగాఁ దోఁచలేదు. అదిగో వారు వచ్చినారు. పోయి యెదుర్కొనుము.

చంద్రి—వీ రెవరు ?

కాత్యా—వీరే చాణక్యపండితులవారు.

చంద్రి—వీరా ?

( చాణక్యుఁడు ప్రివేశించును )

[చంద్రగుప్తుఁడు చాణక్యుఁడు ఎదురుగానిలఁబడి యొకరి నొకరు చూచుకొనుచుందురు. చంద్రిగుప్తుఁడు ప్రిణామము చేయును]

చాణ—నీవేనా చంద్రిగుప్తుఁడవు ?

చంద్రి—అవును. తమదాసుఁడు వీఁడే చంద్రిగుప్తుఁడు.

చాణ—( ఆపాదమస్తకము చంద్రిగుప్తుని జూచి ) నీవు చేయగలవా !

చంద్రి—మీదయ యున్నచో ?

చాణ—నే నెవఁడను ! ఎవఁడనుకాను ! నీ వొక్కఁడవే చేయఁగలవా ! నే నెవఁడను. ఒక దీనబ్రాహ్మణుఁడను! అతిదీనుఁడను.

చంద్రి—భూసురుఁడవయ్యు దీనుఁడవా ?

చాణ—నేఁడు బ్రాహ్మణునికంటె దీనుఁ డెవఁడు? వాని శాపముచే సగర వంశము భస్మము కాకపోయిన పోవుగాక ! చివరకు నిప్పుకూడ మండుట లేదు. వాని జందెము నేఁడు భిక్షుకుని చిహ్నముగా

మాత్రము పరిగణింపఁబడుచున్నది. నేఁడు వానిని క్షత్రియుఁడు చాఁవగొట్టి చెవులు మూయుచున్నాఁడు.

(చంద్రగుప్తుఁడు నిస్తబ్ధుఁడుగా నుండును)

చాణ—అవును. మాబ్రాహ్మణులు సముద్రతరంగములవలె లేచి యొక్కసారిగా ముందుకు పోదురు. కాని యొద్దుతగిలి బాధచే పెద్దనిట్టూర్పు విడిచి వెనుకకు మఱలి పోదురు. ఇప్పుడు బొత్తిగా శక్తిలేదు. ఏమియు లేదు.

చంద్ర—ఇదేమిటి? నే నేమో చాణక్యపండితులు—

చాణ—యుక్తాయుక్తవిచక్షణదక్షుఁ డగు విద్వాంసుఁ డనియు, రాజనీతిజ్ఞుఁ డనియు వింటివి. ఇంతేనా? ఇది సరిగానే వింటివి గాని యాతనికి గుండె లే దని మాత్రము వినలేదు. నావెన్ను విఱిగి పోయినది. ఈ వక్షము, (చంద్రగుప్తునిచేయి ఱొమ్ముపై నిడుకొని) ఈ వక్షముపై చేయిడి చూడుము. ఏమి చూచుచుంటివి?

చంద్ర—మందముగా రక్తప్రవాహము ప్రవహించుచున్నది.

చాణ—ఏ ప్రవాహము?

చంద్ర—రక్తప్రవాహము.

చాణ—అమాయకుఁడా! రక్తము లేదు. ఈశరీరమున రక్త మెక్కడిది? ఇది తుహినప్రవాహము ఏకాలఁదిగనైన రక్తమే యుండిన నది గడ్డకట్టిపోయినది.

చంద్ర—గురువర్యా! వింటిని. అంతయు వింటిని. నా కాజ్ఞమాత్రమొసఁగుఁడు. కేవల మాశీర్వదింపుఁడు. "చంద్రగుప్తా! నీవు ముందు పొమ్ము" అని మాత్రము సెలవిండు. అంతకంటె నే నేమియుఁ గోరను. తక్కినది సర్వము నేన నిర్వహించెదను.

చాణ—చేయఁగలవా?

చంద్రి—చేయఁగలను. గురువర్యా! నేను దిగ్విజయమొనరింతునని యలె గ్జాండరు భవిష్యద్వాణి చెప్పియున్నాఁడు. నిద్రించినను మేల్కొనినను నిలుచుండినఁ గూరుచుండిన నెల్లప్పు డావాణియే నాచెవులందు గింగురు మని ప్రతిధ్వనించుచున్నది. నేను తప్పక చేయఁగలను. తమ రీ మహాయజ్ఞమునకుఁ బురోహితులుగ మాత్రముండి నాకు వ్రతదీక్ష నిప్పింపుఁడు.

చాణ—ఏమి? ప్రాణేశ్వరీ! నీ యాజ్ఞ యేమి!

చంద్రి—ఇ కెవ రున్నారు! వీ రెవరితో మాటలాడునది?

చాణ—నీయాజ్ఞ మంచిది! (చంద్రగుప్తునితో) అయితే యీబ్రాహ్మణునియాజ్ఞానుసారము సర్వదా ప్రవర్తించెద నని పాదములు ముట్టి శపథము చేయుము.

చంద్రి—(చాణక్యుని పాదముల స్పృశించి) శపథము చేయుచున్నాను. ఇఁక నాకు దీక్ష నొసఁగుఁడు.

చాణ—నిశ్చయముగ నీవు చేయఁగలవు. నీముఖలక్షణములు, నీదృష్టి, నీభావభంగులు నీవు తప్పక చేయగల వని యొకేస్వరమునఁ జాటుచున్నవి. నీకు వ్రతదీక్ష నొసంగెదను. నిన్ను మగధసింహాసనముపై నధిష్ఠింపఁ జేసెదను. నిన్ను భారతదేశమునకుఁ జక్రవర్తిని చేసెదను. ఇంధనములను దయారుచేయుము. చంద్రగుప్తా! బ్రాహ్మణతేజశ్శక్తిచే వానిని ప్రజ్వలింపఁ జేసెదను. దావానలమువలె నీ యగ్ని వ్యాపించి సమస్తభారతవర్షము నాక్రమించునుగాక! చంద్రగుప్తా!

చంద్రి—గురుదేవా!

చాణ—ముఖము నెత్తి పైని జూడుము. ఏమి చూచుచుంటివి?

చంద్రి—ఆకాశము.

చాణ—ఏరంగుగా నున్నది?

చంద్రి—పసుపుతో కలిసిన మెఱుపుచాయ.

చాణ—దానివలన నీ వేమి గ్రహించితివి?

చంద్ర—తుపాను వచ్చును.

చాణ—చక్కగాఁ జెప్పితివి. నిస్సంశయముగా తుపాను రాఁగలదు. అటులనే భవిష్యత్తునైపున జూడుము. నీ కేమైన గోచరించు చున్నదా?

చంద్ర—ఏమియు గోచరించుట లేదు.

చాణ—అంధుఁడవు సుమా! నీవు. ఆహా! అటుకూడను గొప్పతుపాను రాఁగలదు. అది కపిలమహర్షి శాపమువలన కాదు. విశ్వామిత్రుని తపోమహత్వమున కాదు. పరశురాముని యనివార్యశౌర్యమున కాదు. వామనుని మాయాజాలమున కాదు. అది బ్రాహ్మణుని ప్రతిభాప్రభావము, శూద్రుని నిష్ఠ; బ్రాహ్మణుని సాధన, శూద్రుని ప్రతీకారప్రతిజ్ఞలవలన కలుగును. అది బ్రాహ్మణుని తేజశ్శక్తి, శూద్రుని బాహుబలమువలన కలుగును. అది స్వర్గమర్త్యలోకముల యుగపత్సమాగమము వలన కలుగును. భయపడకుము. చంద్రగుప్తా! లెమ్మా. నీ నేత్రగోళములందు నే నేమి చూచుచుంటినో తెలియునా?

చంద్ర—ఏమి చూచుచుంటిరి!

చాణ—ఈధూమ్యావరితమును ప్రజ్వలితమును రక్తస్రోతస్వతీపరిప్లోషితమును నగు నీభయానకభారతభూమికి బదులు రత్నాలంకారశోభితయు, పుష్పోజ్జ్వలయు, సంగీతముఖరయు, మందహాసభాసురయు నగు దేశమాత దివ్యమూర్తిని దర్శించు చుంటిని. చతుస్సముద్రముద్రిత మగు నొక మహాసామ్రాజ్యమును జూచుచుంటిని. ఆసామ్రాజ్యమునకు స్థాపకుఁడవు నీవు. ఆ మహాసామ్రాజ్యమునకుఁ బురోహితుఁడు దీనాతిదీనుఁడగు నీ బ్రాహ్మణుఁడు చాణక్యుఁడు. (నిష్క్రమింతురు)

---

# చంద్రగుప్త

## ద్వితీయాంకము

### ప్రథమ దృశ్యము

స్థానము — హీరట్‌లోని రాజమహాలు

సమయము — రాత్రి

[ సెల్యూకస్ — హెలీనా ]

సెల్యూకస్—వింటివా హెలీనా! వీరవరుఁడగు అలెగ్జాండరు కాల ధర్మ మొందెను.

హెలీనా—ఆ! అది మీ కెటులఁ దెలిసినది?

సెల్యూ—సూర్యుఁ డస్తంగతుఁడయిన సంగతి భూమికి తెలియకుండునా?

హెలీనా—అటు తరువాత?

సెల్యూ—తరువాత నిం కే మున్నది? ఈ ఆసియాసామ్రాజ్యమునకు నన్నుత్తరాధికారిగాఁ జేసిరి.

హెలీనా—మహదాకాంక్షాప్రేరితులయి యీ ఆసియాఖండార్థము జయించిరి కాని మాతృదేశమున మరణించుటకుఁ గూడ వారికి ప్రాప్తిలేకపోయినది.

సెల్యూ—హెలీనా! అలెగ్జాండరు మహారాజేపని పూర్తిఁజేయఁజాలఁ డయ్యెనో అది నేను పూర్తి చేసెదను.

హెలీ—ఏపని?

సెల్యూ—భారతవర్షమును జయించుట.

హెలీ—అందువలన వచ్చు లాభము?

సెల్యూ—కీర్తి.

హెలీ—అపకీర్తి కాదుకద. పురుషుల యత్యాచారముఁ జూచిన నాశ్చర్య మగును. దానికిఁ దృప్తిలేదు. దేనిచేతను దృప్తి కాదు. వారల హింసాప్రవృత్తి మఱెంత యాశ్చర్యము గొలుపును.

ఉ॥ ఎంతటి వింతజంతువులొ యీమగవారలు కీర్తిపేర నెం
తెంతొ దురంతహత్య లొనరించెద; రందును సభ్యజాతు లం
చెంతయు విఱ్ఱవీగెడి యహీనులె నిష్ఠురు లట్టి నిర్దయ
స్వాంతుల రక్తలోలుపులఁ బద్మజుఁ డేల సృజించెనో యినీ!

వధించుకొనుటకు మనుష్యులడవిమృగములో యేమో! మానవులమాంసముఁ దినకుండియు నొకరి నొకరు చంపుకొనుట మఱెంత యాశ్చర్యము. నాయనగారూ! ఆ మాంసము ఎందుకు తినరు?

అంత రుచిగా నుండదా యేమి?

సెల్యూ—ఆచారము లేదు.

హెలీనా—ఈ యాచారమును మీరు ప్రచారము చేయరాదా? మీ నామము శాశ్వతముగ నిలిచిపోవును. నాయనగారూ! మీరు, మీ పురుషులు ఎందుకింత రక్తపిపాసు లయిరి? మీ హృదయములందు వేఱొండు ప్రవృత్తి లేదా యేమి?

సెల్యూ— ఏ ప్రవృత్తి?

హెలీనా—ఏ ప్రవృత్తి యని యడిగెదరా?

సీ॥ దుఃఖార్తు లగువారి దుర్దశల్ తొలఁగించి
తగురీతి వారి నోదార్పరాదొ
వ్యాధిసంక్షుభితుల బాధ నివారించి
మందుమాకుల నిడి మనుపరాదొ
అజ్ఞానతిమిరమం దల్లాడు జడులకు
జ్ఞానదీపికల నొసంగరాదొ
క్షుత్పిపాసాదుల శోషించువారికి
నన్నపానముల నీయంగరాదొ

గీ॥ యిచ్ఛ కలిగిన నింక నెన్నెన్ని లేవు
దుష్టమౌ స్వార్థపరతయు దుఃఖవృద్ధి
యన్యపీడన మన్యాయ మాదియైన
వృత్తులే మీకుఁ దగిన బ్రవృత్తు లయ్య !

సెల్యూ—మానవుని మహోన్నతచిత్తప్రవృత్తులలో విజిగీష యొకటి యని డిమస్తనీస్ మహాశయుఁ డొకచోట వచించెను.

హెలీ—డిమస్తనీస్ ఆవిధముగ నెచ్చటను జెప్పలేదు. కావలసిన గ్రంథమును దెచ్చెదను. (పోఁబోవును)

సెల్యూ—వద్దు, వెళ్ళవద్దు. తీసికొని రా నవసరము లేదు. డిమస్తనీసు కూడ చదివితివా ?

హెలీనా—అవును. చదివితిని.

సెల్యూ—అంత యెక్కువగా నెందుకు చదివెదవు? చదివి చదివి చివరకు స్వతంత్రజ్ఞానము పోఁగొట్టుకొందువు. మంచిది. అమ్మాయీ! నేను మన వృద్ధసేనాధ్యక్షుని శిబిరమునకు పోయివచ్చెదను. నీవు వెళ్ళి నిద్రపో—దాదీ !

హెలీ—నాయనగారూ ! పోవుచుంటిని ; నే నింకను చంటిపిల్ల ననుకొంటిరా, దాదివచ్చి నిద్రపుచ్చుటకు ?

సెల్యూ—లేకపోయిన నీవు చాల పొద్దుపోవువరకు చదువుకొనుచు కూరుచుందువు. ఎక్కువగా చదువుటచే నీ శరీరము పాలిపోవు చున్నది. అంతగా చదువకు.

హెలీ—సరే నాయనగారు! నే నికనుండి స్వతంత్రజ్ఞాని నగుదును.

(సెల్యూకస్ నిష్క్రమించును)

హెలీ—(చాలసేపు పుస్తకము చదివి దాని నవల నుంచి) సూర్యుఁడస్తమించుచున్నాఁడు. సింధునదీతటమున నాటి గరిమాామయ మగు సూర్యాస్తమయము జ్ఞాపకము వచ్చుచున్నది. తరణి కిరణోజ్వలమగు భారతవర్ష మెక్కడ? తుహినసంఛన్నమగు ఆఫ్గనిస్థాన మెక్కడ? (మరల చదివి) ఆయన మగధదేశపు రాజపుత్రుఁడా!—నేను సంస్కృతము చదివెదను — సంస్కృత భాష నవీనభావశోభిత యనియు, కవిత్వతత్త్వాఢ్య యనియు, విజ్ఞాన ఖనియనియు విందును. (మరల చదువును) ఎవరు వారు? ఆంటిగోనస్! (ఆంటిగోనస్ ప్రవేశించును)

ఆంటిగోనస్—ఆఁ! నేనే హెలీనా!

హెలీనా—(నిలఁబడి) నాయనగా రింటిలో లేరు.

ఆంటి—అది నాకు తెలియును.

హెలీ—అయితే యిక్కడ కెందుకు వచ్చితివి?

ఆంటి—నా యాగమనము నీ కింత యప్రియమా?

హెలీ—ఆలాగున నే ననలేదు.

ఆంటి—"ఆలాగున నే ననలేదు." ఎంత చక్కని ప్రత్యుత్తరము? నీ వనలేదు. అది సత్యమే. కాని నారాక నీకు ప్రియమో యప్రియమో సరళముగా తెలిపిన బాధ యేమి?

హెలీ—దానివలన కలుగు లాభ మేమి?

ఆంటి—నష్ట మే మున్నది? చెప్పిన నీకు లాభము లేకపో వచ్చును గాని, వినుటవలన నాకు లాభ మున్నది.

హెలీ—నీ కేమి లాభము?

ఆంటి—లాభ మేమియా? ఈప్రశ్నయుత్తరముపైన నా భవిష్యత్తంత యు నాధారపడి యున్నది. హెలీనా! వినుము? ఇదే తుద సారి నిన్నడుగుటకు వచ్చితిని.

హెలీ—ఏమి?

ఆంటి—బాష్పజలార్ద్రలోచనుఁడనయి మోకరిలి బిచ్చ మడిగితిని కాని సఫలుఁడఁ గానైతిని. క్రోధకంపితస్వరమున నడిగితిని కాని లాభ ము లేకపోయెను. వాచవిగాని తేటమాటల మఱల నొకసారి యడిగిపోద మని యిప్పుడు వచ్చితిని. ఇందు క్రోధముకాని, దైన్యముకాని లేదు. కేవలము తెలిసికొనుటకే యడుగు చున్నాను. నన్నుఁ బరిణయమాడుట కిచ్చగింతువా లేదా!

హెలీ—జనకుని జంపఁ గత్తినెత్తిన మహాత్ముని పెండ్లాడఁజాలను.

ఆంటి—ఆ విషయము వేఱు. దానికి కూడ కారణము నీవే. అంతకు పూర్వ మొకనాఁడు నిన్నీ విషయ మడిగితిని. నాతండ్రి యిష్టమే నాయిష్ట మంటివి. జ్ఞప్తియుండెనా? అంతట నీజనకు నడిగితిని. అజ్ఞాతజన్ముని సెల్యూకసుపుత్రిక వివాహమాడుట యసంభవ మని యాతఁడు వ్యంగ్యోత్తర మిడెను.

హెలీ—వారు సర్వసేనాధిపతులు. నీవో సాధారణ సేనాపతివి.

ఆంటి—ఆకారణమున కాదు హెలీనా! నాయజ్ఞాతజన్మముపై దెబ్బ తీసెను. అందుకు నా యొడలు మండ పిచ్చివాఁడనయి ఆయన పై కత్తి నెత్తితిని. క్షమింపుము; హెలీనా! నన్ను క్షమింపుము.

హెలీ—క్షమించెదను, కాని వివాహ మాడఁజాలను.

ఆంటి—ఎందువలన ?

హెలీ—కారణము చెప్పను.

ఆంటి—ఇంత గర్వమా ? సరి కారణము గీరణము నా కవసరము లేదు. కేవలము జవాబునే కోరుచున్నాను. చెప్పుము. నన్ను వివాహ మాడెదవా లేదా ?

హెలీ—ఇంత క్రోధస్వరమా !

ఆంటి—ఉత్తరమును కోరుచుంటిని. వివాహ మాడెదవా లేదా? చెప్పుము. (చేతులు పట్టుకొనును)

హెలీ—ఆంటిగోనస్ ! దుష్టుఁడా ! చేయి వదలుము. నీవు గ్రీకువేనా?

ఆంటి—నేను ప్రేమికుఁడను. సరళమగు నుత్తర మిమ్ము. పరిణయము చేసికొందువా లేదా ?

హెలీ—నిన్ను పెండ్లాడుటకంటె దుర్గంధబంధురుఁడగు నికృష్టపు కుష్ఠ రోగిని పెండ్లాడుటకు సిద్ధముగా నున్నాను. అధముఁడా (చేతులు విడిపించుకొని) ఇటనుండి పొమ్ము.

ఆంటి—పోవుచున్నాను (పోబోయి మఱల వచ్చి) ఒకమాట చెప్పి మఱి పోయెదను. హెలీనా !

హెలీ—రాజకన్యా! యనుము. నా పేరెత్తుటకును నీ కర్హత లేదు. ఒక సామాన్యసైనికుఁడు — ఇష్ట ముండిన కాలితోఁ దాచి నలపఁ గలను.—అటుచేయను ; ఇంతయధముని నేలరాయుటయు నైచ్యమే. ఒక క్షుద్రసైనికుఁడు ఆసియాచక్రవర్తికూతును స్పృశించుట ఎంత సాహసము !

ఆంటి—దీని కుత్తరము ఎప్పుడో ఒకపుడు చెప్పెదను. ఎప్పుడైన నదృష్ట చక్రము నావైపునకు తిరుగునో తిరుగదో చూచెదను. (వెళ్లుచు తిరిగిచూచుసరికి సెల్యూకస్ నిలఁబడును)

సెల్యూ—మఱల నేకాంతమున పోడఁచూపితివి ?

హెలీ—మీ కుమారిశరీరస్పర్శన మొనరించిన ఈ యవనభ్రష్టుఁడు, ఈ కాపురుషుఁడు మీాగ్రీకుసేనాపతియేనా?

సెల్యూకస్—ఏమిటి? ఇది నిజమేనా? ఆంటిగోనస్!

ఆంటి—ఆఁ! నిజమే. నే నపరాధ మొనరించితిని.

సెల్యూ—అటులనా! ఆంటిగోనస్! అలెగ్జాండరు నీకు దేశబహిష్కార శిక్ష విధించినను నిన్ను సేనాధ్యక్షునిగా నియమించితిని. దాని కిదియా ప్రతిక్రియ. సైనికులారా! (ఇరువురు సైనికులు ప్రవేశింతురు) ఖైదుచేయుఁడు. (సైనికులు ఆంటిగోనసును పట్టుకొందురు) ఆంటిగోనస్! నీకు మరణదండన విధించితిని. సైనికులారా! వీని నిప్పుడే వధ్యభూమికిఁ గొనిపొండు. (సైనికులు ఆంటిగోనసును తీసికొనిపోఁజూతురు)

హెలీ—ఆగుడు. నాయనగారు! ఈసారి ఇతని విడిచిపెట్టుడు.

సెల్యూ—వదలిపెట్టను. ఈతని కింత పొగరా?

హెలీ—పదచ్యుతుని జేయుము.

సెల్యూ—పదచ్యుతుని జేయుట తగినశిక్ష కాఁజాలదు.

హెలీ—అట్లయిన రాజ్యమునుండి బహిష్కరింపుఁడు. కాని మరణ దండనమాత్రము విధింపకుడు. ఆంటిగోనస్ వీరుఁడు. చేసిన తప్పు నొప్పుకొనుచున్నాడు. ఈ సారి ఆఖరుతడవ నీతని క్షమింపుడు. నీతని బహిష్కరింపుడు.

ఆంటి—సెల్యూకసుని నేను క్షమాపణకోరుటలేదు. నేను తప్పు నొప్పుకొనుచున్నాను. శిక్షవిధింపుము. నిన్ను క్షమాపణ వేడను.

హెలీ—నేను వేడుచున్నాను, నాయనగారు!

సెల్యూ—వద్దు. హెలీనా!

హెలీ—జనకా! (మోకరిలి చేతులు జోడించును)

సెల్యూ——మంచిది. ఆంటిగోనస్! నీ వీ సారి క్షమింపఁబడితివి. వెళ్ళి పొమ్ము. ఇఁకెప్పుడైనా నా రాజ్యమందు కాలిడితివా నీకు మరణదండనమే. వదలిపెట్టుఁడు. (సైనికులు వదలుదురు. ఆంటిగోనస్ మెల్లమెల్లగా పోవును) (తెఱపడును)

---

(ప్రస్థానము)

## ద్వితీయదృశ్యము

స్థానము——చాణక్యనిశిబిరము, యుద్ధక్షేత్రము

సమయము – రాత్రి

(మురా, చాణక్యుఁడు)

ముర——ఱేపేనా యుద్ధము జరుగునది?

చాణ——అవును. ఱేపే యుద్ధము జరుగును.

ముర——చంద్రగుప్తుఁడు దండెత్తిపోవునా?

చాణ——అవును, మురా! ప్రొద్దుటినుండి యీ మాట నూఱుమారులు చెప్పినట్లు చెప్పితిని. అయినను రాత్రి యింత ప్రొద్దుపోయిన తర్వాత నదే యడుగుటకు మఱల వచ్చితివా?

ముర——నాకు బొత్తిగా స్థిమితము లేకున్నది. గురుదేవా! యుద్ధమున కవసరము లేదు. ఈ రణమునకుఁ గారణము లేనే లేదు. యుద్ధము నా కిష్టము లేదు.

చాణ——(ఆశ్చర్యముతో) మురా!

ముర——చంద్రగుప్తుఁడు నా పుత్త్రుఁడు. నందుఁడో అతఁడును నా తనయుఁడే. చంద్రగుప్తుఁడును నందుఁడును ఒక తొడిమ నున్న రెండు పుష్పములు. నా హృదయాకాశమునకు వా రిరువురు

చంద్రసూర్యులు. వారి సంఘాతమున నీ యాకసము చూర్ణ మగును. లేదు, గురువర్యా! బవరమున కవసరము లేదు. నా చంద్రగుప్తుఁడు దారివెంట నడుగుకొను భిక్షుకుఁడై నను సరియేకాని యుద్ధమునకుమాత్ర మావశ్యకత లేదు.

చాణ—కాంతా! కాలునిసంహారమూర్తి యదె దఱిదాపై యున్నది. ఒక తృటిలో విలయము రానున్నది. సర్వము సిద్ధమయినది. ఇప్పుడా నీ ప్రార్థన, గీర్థన? నీ వెడఁగు వేడికోలు వినుట కిది సమయము కాదు. నీ శిబిరమునకుఁ బొమ్ము.

ముర—స్త్రీ ప్రార్థన! వెడఁగువేడికోలా? స్త్రీ యింత చులకనై నదా! గురువర్యా! ఈ నాహృదయమున నెంతగందరగోళము జరుగు చున్నదియు మీరు తెలిసికొనలేకున్నారు. నే నెంత సహించి యూరకొనుచుంటినో మీ కేమి తెలియును? గురూత్తమా!

చాణ—అబలా! ఈ హృదయమున ప్రజ్వలించు ప్రతిహింసాజ్వాలలు, ఈ మర్మదాహము నీ కెట్లు తెలియును? పొమ్ము, నన్ను విరక్తునిజేయక పొమ్ము, నీ శిబిరమునకు. యుద్ధ మనివార్యము.

ముర—కాని గురుదేవా!

చాణ—(కఠోరస్వరముతో) వెళ్ళిపొమ్ము (మురభయముతో పోవును). (పచారుచేయుచు) సూకరముఖమును, తంతువాయిత్వక్కును శవదాహదుర్గంధమును, ఏరండాస్వాదనమును, గార్దభస్వరమును కలిపి యొక కళాయిలో వేయించుచుంటిని. ఏమి తయారగునో చూచెదగాక! ఏదో క్రొత్తమాదిరి కలగలుపుకూర తయా రగు ననుట మాత్రము నిశ్చయము. ఎవరు వారు? కాత్యా యనుఁడా?

కాత్యా—అవును. చాణక్యా! నేనే.

చాణ—ఇంతరాత్రివేళనా!

కాత్యా—ఒక మాట చెప్పవలసి వచ్చితిని.

చాణ—ఏమి?

కాత్యా—నందుని వృద్ధమంత్రి వచ్చినాఁడు.

చాణ—(ఆగ్రహముతో) వచ్చినాడేమి? అయితే?

కాత్యా—సంధివిషయమయి ప్రసంగించినాడు.

చాణ—ఏమని ప్రసంగించెను?

కాత్యా—కుశలప్రశ్నానంతరము ఆతఁ డీ విధముగ వాక్రుచ్చెను. "అన్నదమ్ములకు వివాద మెందులకు? సర్వరాజ్యము నిరువురు సమానముగ విభజించుకొన వచ్చును. నందుఁడు బొత్తిగా ప్రపంచజ్ఞాన మెఱుంగని పసివాఁడు. కుఱ్ఱవాఁ డేదైన లోప మొనరించిన పెద్దవారు క్షమింపకుండుట పాడియా? వీలులేదా క్షమించుటకు!"

చాణ—నిజము, నిజము. అత్తటి చంద్రగుప్తుఁ డచటనే యుండెనా?

కాత్యా—అక్కడనే యున్నాఁడు.

చాణ—ఆ మంత్రి చాల చతురుఁడు. చంద్రగుప్తుఁ డేమైన మాటలాడినాఁడా?

కాత్యా—లేదు.

చాణ—నీవేమైన చెప్పితివా?

కాత్యా—నేను మీ సలహా తీసికొని ప్రత్యుత్తర మొసఁగుదు నంటిని.

చాణ—ఆతని నాయొద్ద కెందుకు తీసికొని రావైతివి?

కాత్యా—వచ్చుట కాయన యిష్టపడలేదు.

చాణ—చాల మంచియెత్తు నెత్తినాఁడు. తమ పరాజయ మనివార్యమని తెలిసికొని—ఇదియా! (ఆలోచించును)

కాత్యా—మీ రే మనెదరు ?

చాణ—ఏమియు లేదు.

గీ॥ మనసులోని తలఁపు మాటలతో తేట
పరుపరాదు కార్యవాది కెందు
పెదవి దాటెనేని పెన్నదాటు నిజమ్ము
గోడలకును చెవులు కూడియుండు.

'మనసా చింతితం కర్మ వచసా న ప్రకాశయేత్.'

కాత్యా—అయితే నేను మీ యాంతరంగికమిత్రుఁడను కద!

చాణ—'న మిత్రే ష్వపి విశ్వసేత్' అని చాణక్యుని మతము. నీ కెఱిం గించుట కింకను తరుణము రాలేదు. ప్రస్తుతము సంధి కుదుర దని మాత్రము చెప్పఁగలను.

కాత్యా—ఎందుకు ?

చాణ—ఈపాటికి నీవు నీ శిబిరమునకుఁ బొమ్ము. నా ప్రేయసితో ముచ్చ టింపఁ దలఁచితిని.

కాత్యా—ఆ ప్రేయసి యెవరు ?

చాణ—తెలియదా నీకు ? (నవ్వుచు) నా కొక వలపుసాని యున్నది.

కాత్యా—మీకు వలపుసానియా ?

(చాణక్యుఁడు బిగ్గరగా నవ్వుచు కాత్యాయనుని తేరిపార చూచుచు)

చాణ—ఈ వచ్చిన నందునిమంత్రి నెఱుఁగుదువా ?

కాత్యా—ఎందు కెఱుఁగను! చిన్నతనమున మే మిరువుర మొకచోట శాస్త్ర మభ్యసించితిమి. మానసికశాస్త్రమం దాయన కభి మానము మెండు. రాత్రి పగలు సాంఖ్యము చదువుచుండువాఁడు.

చాణ—మీరో—పాణినీయము బట్టిపెట్టుచుండువారు కాఁబోలు !

కాత్యా—ఆక్షేపించుచున్నారే! పాణినివ్యాకరణమున ఒక్కొక్క సూత్ర మొక్కొక్కగూఢతత్వము నుద్బోధించుచుండును. ఇది కనుఁడు.

చాణ—చాలు, ఆగుము. నీ పాణినీయము వినుటకు నాకు వ్యవధిలేదు.

కాత్యా—పాణినీయ మెందుకు పనికిరానిదానిగా తీసివేయుచున్నారే! మీ రిది జ్ఞాపక ముంచుకొనుఁడు.

చాణ—నందుఁడు నిన్ను ఖైదుచేసిన కారణ మిప్పుడు నాకు చూచాయగాఁ దెలిసినది.

కాత్యా—ఎందుకు ఖైదుచేసెను?

చాణ—మాటమాటకు పాణినీయ మేకరువెట్టుచుందువట! రాజ్యములో మారి మసగనీ — పాణినీయము. యుద్ధముపొసగనీ — పాణినీయము. అతివృష్టి కలిగిన — పాణినీయము. రాజునకు రాణికిని ప్రణయకలహము వచ్చిన — పాణినీయము. అన్నిటికి పాణినీయమే. నీ పాణినీయఁపు పీడవలన నందున కారోగ్యము కూడ చెడినదఁట, చివరకు.

కాత్యా—ఆరోగ్య మెందుకు చెడినది?

చాణ—చెప్పెద వినుము. నీపాణినీయపీడవలన నందునకు శూలపుట్టినదఁట. తలతిరిగిన దఁట. అన్నముమీఁదకూడ నసహ్యము పుట్టినదఁట. చివరకు ఏమి తోఁచక నిన్ను ఖైదు చేయించెనఁట. పాప మంత వివశుఁడయినాఁడు కాఁబోలు! నీపాణినీయము విని విని. పాణిని పెద్దపొరపాటు చేసినాఁడు.

కాత్యా—ఏమి పొరబాటు?

చాణ—ప్రతిభాశాలి యెవ్వఁడును కంఠస్థము చేయలేనంత పెద్దగ్రంథము వ్రాసెను.

కాత్యా—పాణినీయము మీకు బొత్తిగా తెలియదని విచారముగా నున్నది. పాణిని సూత్రములు—

చాణ—చాల నుత్కృష్టమైనవికావూ ! చాలు, శిబిరమునకుఁ బొమ్ము. చంద్రకేతుఁ డెక్కడ నున్నాఁడు ?

కాత్యా—చంద్రగుప్తుని శిబిరమందు.

చాణ—చక్కఁగా తూచినటు లుత్తర మిచ్చితివి. నీపాణినిసూత్రములలో నెందైన కల దేమో చూపింపఁగలవా ?

కాత్యా—పాణిని యిటువంటి క్షుద్రవిషయములఁ గై కొని తల పగుల గొట్టుకొనఁడు.

చాణ—వెళ్ళుము. చంద్రకేతుని నాశిబిరమున కొకసారి పంపుము.

కాత్యా—అటులనే పంపెదను. కాని పాణిని—

చాణ—మఱల పాణినియా ! రణరంగమున రాత్రి రెండు జాములప్పుడా నీపాణినీయము వినుట ? వ్యవధి లేదు. త్వరగా వెళ్ళి యాతని పంపుము. అగత్యమైన పని యున్నది.

కాత్యా—కాని పాణిని సూత్రములు—

చాణ—కట్టకట్టుకొని గోతిలోపడనీ పాణిని, వాని సూత్రములు. పొమ్ము.

కాత్యా—పాణినీయము కేవలవ్యాకరణగ్రంథ మనే జనులు తలఁచెదరు; శుద్ధమూర్ఖులు. పాణినీయము వేదాంతసారము.

చాణ—పొమ్ము, కాత్యాయనా ! తర్కవితర్కము లాడకు. చెప్పుచున్నాను, పొమ్ము.

కాత్యా—వెళ్ళుచున్నాను. పాణినిని చాల నవమానించితిరి. (విచారముతో పోవును)

చాణ—పాప ముత్త గంగిగోవువంటివాఁడు. బొత్తిగా తెలివితేటలు లేవు. ముక్కునకు సూటిగాఁ బోవును. తన పనియేమో తానే

మో అంతే. ప్రేయసీ! ఏమనెదవు? నందుని మంత్రి చక్కని పన్నాగము పన్నినాఁడు. పరాజయ మనివార్య మని తెలిసికొని యీయుక్తి పన్నినాఁడు. లేనియెడ నీపన్నుగడ యెందులకు? నే నప్పుడే దానిని కనిపెట్టితిని. నీవుకూడ కనిపెట్టితివికాదు, సుందరీ! మంచి యదన నెఱిఁగి ప్రయోగించెను. అయితే యేమి ప్రయోజనము? మంత్రీ! చాణక్యుని ముందు నీయాటలు సాగవు. ఆతనిపై నీమంత్రము పాఱదు. జాగరూకుఁడవుగా నుండు మని కొంచెము మేల్కొలిపితివి. నీ దొంగయెత్తున కిదియే ఫలము.

(చంద్రకేతుఁడు ప్రవేశించి నమస్కరించును)

చాణ — విజయోస్తు. నేనే రమ్మని కబురంపితిని. వీరాగ్రణీ!

ఉ॥ వారనిభక్తి స్వామికయి ప్రాణములం బణ మొడ్డి వైరులన్
మారిమసంగినట్లు పరిమార్చి యశమ్మును గాంచినట్టి మీ
వారలబీరముం దలఁచి వారియవారితశౌర్యవీర్యవి
స్ఫారుఁడవైన యట్లు లని సల్పుము నిల్పుము పేర్ప్రతిష్ఠలన్.

ప్రాణములు తుచ్ఛములుగా నెఱిఁగి యుద్ధమొనర్పుము. మనకు విజయము కలుగుట నిశ్చయము.

చంద్రకే — గురువర్యా! నాచేత నేల పలికించెదరు?

గీ॥ శౌర్యధైర్యములను శత్రుసైన్యముఁ దాకి
చంపుటొండె, కలనఁ జచ్చుటొండె
కాని, ప్రభునికొఱకుఁగాని యీమొడలితో
దిరుగు టెఱుఁగనయ్య గురువరేణ్యా!

ప్రాణములు తుచ్ఛములుగా నెఱిఁగి యుద్ధ మొనర్పు మందురా? ఎందు కిటు లుపదేశించెదరు? గురూత్తమా! నాపై నింత యవిశ్వాసమా?

చాణ — లేదు.

చంద్రకే—అయితే—

చాణ—చంద్రగుప్తునిపై నాకు పూర్తిగా విశ్వాసము లేదు.

చం॥ కే—అదేమి, గురుదేవా!

చాణ—రాజ్యలాభాపేక్ష నుపేక్షసేయఁజాలు బలవత్తరమగు వేఱొక ప్రవృత్తి యాతనిచిత్త మన్యథాయత్తము చేయుచున్న దని పరిశీలించి కనిపెట్టితిని. వికాసమాన మగు చంద్రగుప్తనిముఖమండలము చూచుచుండగనే మేఘచ్ఛన్నమగుటయు, గొంచెము బాష్పవృష్టి కురియుటయుఁ జూచుచుందును. చంద్రగుప్తుని శౌర్య మనివార్యము. కాని యీప్రబలప్రవృత్తికి లోఁబడకుండ చూడవలయును. జాగ్రత్త!

చం॥ కే—అయిన తమయాజ్ఞ యేమి?

చాణ—యుద్ధము రేపే జరుగును. సంగర మంతమగువఱకు తోడు నీడవై యాతని వెనువెంట నీ వుండవలయును. ఒంటరిగా నుండనీయరాదు. యుద్ధమధ్యమందైనను నాతనిదండఁ బాయకుండుము.

చం॥ కే—చిత్తము, గురూత్తంసమా! తమ రింతగాఁ జెప్పవలయునా?

చ॥ తిరుగనిరాజభక్తియు, స్వదేశముపై నభిమానముల్, సదా
తఱుగని బాహుశక్తి, యని తప్పని యుక్తి, పరానుకూలతం
బరగని యుక్తి, మాకులమువారల పుట్టుకకల్మి లంచు మీ
రెఱిఁగియు శిష్యుని న్నను పరీక్షయొనర్చెద రేల యిమ్మెయిన్.

చాణ—నీ వట్టివాఁడ వని యెఱుఁగక కాదు. ఊరక చెప్పవలసి చెప్పితిని. పొమ్ము. మఱియు నేను నీపర్వతప్రాంతమందలి నిర్ఝరిణీ సేతువుకడ మీ విజయవార్తల కెదురు చూచుచుందుము. పొమ్ము.

చం॥ కే—చిత్తము.

చాణ—(చంద్రకేతుఁడు వెడలిపోవుచుండ) చంద్రకేతూ! (చంద్రకేతువు ఆగును) చంద్రగుప్తుఁడు నిద్రించెనా?

చంద్రకే—నిద్రించెను, గురువరా!

చాణ—ఒకసారి—వలదులే—మేల్కొలుపవలదు. నిద్రపోనిమ్ము—అయితే మురను—వద్దు. ఈరాత్రి యేమియుఁ బ్రయోజనము లేదు. రేపు నీవు కనుచీఁకటి యుండగనే లేచి చంద్రగుప్తుని మేల్కొలుపవలయును. మురలేచుటకుఁ బూర్వమే నీవును చంద్రగుప్తుఁడును రణరంగమునకు వెడలవలయును. తెలిసినదా? పొమ్ము (చంద్రకేతుఁడు నిష్క్రమించును) ఉదారయువకుఁడు.

గీ॥ భువి సరోజ మొకఁడు దివి సూర్యుఁ డొక్కండు
స్నేహపాశ మొకటి చేసె రెంటి
నొకనికొఱకుఁ బ్రాణ మొక్క డర్పించును
స్నేహధర్మబలము చెప్పనగునె?

అమాయకుఁడా! చంద్రగుప్తుఁడు నీ కేమి కావలయును?



## తృతీయదృశ్యము



స్థానము: హీరట్ రాజప్రాసాదము
సమయము: ప్రభాతము

[ఆంటిగోనస్ ఎదుట ఖైదీగా సెల్యూకస్ నిలఁబడును]

ఆంటిగోనస్—సెల్యూకస్! ఇప్పుడు నీవు నాఖైదీవి.

సెల్యూకస్—అది నాకు తెలియును, ఆంటిగోనస్!

ఆంటి—సమ్రాట్! అప్పటి దర్ప మిప్పు డేమయినది?

సెల్యూ—దర్పము నా కెప్పుడును లేదు. యుద్ధములో జయమో పరాజయమో కలుగుచునే యుండును. అనేకయుద్ధములలో నిన్ను జయించితిని. నేఁడు నావంతు వచ్చినది. నీచే పరాభూతుఁడ నయితిని. మఱల రణమే యగు-చో—

ఆంటి—సెల్యూకస్ ! యుద్ధ మిఁక జరుగదు. ఇదే యంతిమయుద్ధము.

సెల్యూ—అంతిమ యుద్ధమా ? నన్ను హత్యచేయుదువా యేమి ?

ఆంటి—చేయను. నిన్ను హత్య చేయను.

సెల్యూ—అయిన నేమి చేయఁదలఁచితివి ? ఆంటిగోనస్ ! నీ నేత్రములం దొక హింసాజ్వాల ప్రజ్వరిల్లుచున్నది. నీముఖ మెఱ్ఱవాఱినది. పండ్లు పటపట మనుచున్నవి. శరీరము కంపించుచున్నది. ఇవియన్నియు చూడ నీ మనమునం దొక పైశాచికసంకల్పము ప్రవర్ధమానమయిన దని చెప్పక చెప్పుచున్నవి.

ఆంటి—లేదు. నిన్ను హత్య చేయఁదలఁప లేదు.

సెల్యూ—ఆంటిగోనస్ ! తడవ తడవ కదే యేల యుచ్చరించెదవు ?

ఆంటి—నేను సభ్యజాతీయుఁడను. పాలికలని నొకరినొకరు కత్తులతో మొత్తుకొనెదరు. క్రొవ్వులులవలె నొకరి నొకరు గాసివఱచుకొనెదరు. కాని పోరుటుడిగిన పిదప పగతురఁ బట్టి చీఁకటికొట్టునం బెట్టి బిట్టలయింతురు. అంతియేకాని హత్యమాత్రము చేయరు. చిరాంధకారబంధురమ్మగు కారాగారమున నిన్నుఁ బడఁ ద్రోయింతును. హత్యమాత్రము చేయను. భయపడకుము.

సెల్యూ—అటులకాదు, ఆంటిగోనస్ ? చంపఁదలఁచిన నొకసారిగాఁ జంపుము. ఇదే మంచిది కాని, అటుల బంపపుకోత కోసి మాత్రము చంపకుము.

ఆంటి—అటు కాఁజాలదు. నేను సభ్యజాతీయుఁడను. నిన్ను జన్మాంతము కారాగారమం దుంచెదను. సూర్యరశ్మి చొఱ వెఱచును.

గాలి దూఱ వెనుదీయును. అట్టికోట్టులో జన్మాంతము నిన్ను బంధించెదను. హత్యమాత్రము చేయను. సెల్యూకస్! బాల్యము నుండియు నేను పితృహీనుఁడను. ఈశ్వరుని దయాధర్మ భిక్షమునకు విడువఁబడితిని. దుర్భరదారిద్ర్యబాధల నడ్డికొనుచు శౌర్యబలచాతుర్యములు ప్రకటించి సేనాధ్యక్షుపదవి నందితి. దీనికయి నేను సిగ్గుపడవలసినదా?

సెల్యూ—నే నాలా గెన్నఁడు ననలేదు.

ఆంటి—లేదు. నీ వనలేదు. లోకులు పలుగాకులు. అవిచారముగ నో టికి వచ్చినటు లాడుదురు. జనకుఁ డెవరో చెప్పఁజాలనంత మాత్రమున నన్ను జారజుఁ డందురా? నన్నుఁ జూచి యేవగించు కొందురా? నానుండి దూరదూరమునకుఁ దొలఁగిపోవుదురా? ఔరా! లోకమునకు హద్దుపద్దు లేదు.

గీ॥ వ్యక్తిగౌరవంబు వరలు తద్గుణకర్మ
ములనుగాని జన్మవలన గాదు
పాలఁబుట్టి విసము పరువేమి కనె? మణి
మన్నుబొడమి యేమి వన్నె తఱిగె?

నాతండ్రిని నే నెఱుఁగ ననుమాట వాస్తవము. కాని యాతఁడును మీ మాదిరి మనుష్యుఁడే యని మాత్రము గట్టిగాఁ జెప్పఁగలను. జారజుఁడనా? నాజన్మమునకు నే నెంతమాత్రము కర్తను గాను. కాని నాచేతలకు మాత్రము నే నవశ్య ముత్తరవాదిని. నే నెప్పుడైన నీచకార్య మొనరించుచుండగాఁ జూచితివా నీవు?

సెల్యూ—ఎప్పుడు లేదు.

ఆంటి—ఇంక, ఈసమయమున నీప్రశంసాప్రసంగమునకు విలువ యే ముండును? ఏమియు నుండదు. ఇప్పుడు చిలుకవలె నే నేది చెప్పిన నది యనెదవు. అదిగో సెల్యూకస్! నీ కుమారి వచ్చినది.

(పహారేదారులతో ఖైదీగా హెలీనా వచ్చును)

హెలీనా—ఆఁ! ఎవరు! నాయనగారా? నాయనా! నాయనా!

(సెల్యూకస్ ఒడిలోఁ బడును)

సెల్యూ—కుమారీ! హెలీనా! (కౌఁగిలించుకొనును)

ఆంటి—సమారిట్! మీయిష్టాగోష్ఠి సమాప్తమయ్యెనా? ఇంకను లేదా? కానియెడల నింతటితోఁ బూర్తిచేయుఁడు. నే నంత నిష్ఠురుఁడను గాను. మీయిరువుర కిదే యంతిమసందర్శనము.

హెలీనా—అంతిమసందర్శనమా?

ఆంటి—అవును, రాజకన్యా! నీజనకునకు శిక్ష విధించితిని — యావజ్జీవ కారాగారావాసము—

హెలీనా—చిత్తము, న్యాయాధిపతీ!

ఆంటి—నీ వేమైన చెప్పుకొనెదవా?

హెలీ—నేనా?—యేమియు లేదు. వీరుఁడు వీరు నెడ నెట్లాచరింపఁదగినది వీరుఁడె విచారించును. బంధితునిపట్ల విజయి యెట్లాచరించునది విజయుని యభిరుచిలో నున్నది. ఈవిషయములో నే నేమి చెప్పుదును? అధికారములేని విషయములలో నేను జోక్యము కలుగఁజేసికొనను.

ఆంటి—మంచిది. ఇదేనా? సెల్యూకస్! నీకుమారి పితృభక్తిపరాయణగాఁ గన్పట్టుచున్నది.

హెలీనా—ఆంటిగోనస్! నీవు నీరాజ్యకార్యము లేవైననుండినఁ జర్చించుము. జనకునిపైఁ బుత్రికకుఁ గల గాఢానురాగము పుత్రికయే విచారించును. నీకు సంబంధము కలుగఁజేసికొనుట కేమి హక్కు—?

ఆంటి—ఇంకను గర్వమా?

హెలీనా—ఆంటిగోనస్ ! నీవు నన్నిక్కడ కెందుకుఁ రప్పించినదియు దెలియును. కాని నీయీప్రయత్నము అందని పండునకయి యఱ్ఱుచాచు మరుగుజ్జుప్రయత్నమువంటిది. సఫలుఁడ వెన్నటికిని కాఁజాలవు. ఇది నిశ్చయము. ఇప్పుడు నీవు జయించితివి. ఒక రాజ్యమున కధిపతి వయితివి. ఆ రాజ్యమందు నీ యిచ్చ వచ్చినట్లు లధికారము చలాయించవచ్చును. కాని నాకు నొక రాజ్యమున్నది. దాని కధీశ్వరిని నేను. ఆరాజ్యమందు నీ కడుగిడుటకును హక్కు లేదు—నాయనగారూ ! ఏల సిగ్గుపడెదరు?

క॥ కారాగారమొ ధర కధి
కారమొ వీరునకుఁగాక కలుగునె యెందుఁ
భీరునకు ; భంగసంగతి
వారిధికింగాక కూపవారికిఁ గలదే ?

మీరు వీరులు, వీరుఁడు వీరునకు విధించు విధానమది. కావున వెళ్ళుఁడు. అంధ కారాగారమునకు వచ్చిన నష్ట మేమియు లేదు. నేను కూడ వెళ్ళుచున్నాను. మన యీయెడబాటు జన్మాంతముండునది యని తెలిసికొనుఁడు. తండ్రీ ! సెలవొసఁగుఁడు. అదేమి నాయనగారూ ! తలవంచుకొనెదరేల ?

సెల్యూ—హెలీనా ! లేదు, అది యగుఁగాక ! మన మిరువురము కారాగారదుఃఖ మనుభవింతము.

హెలీనా—తండ్రీ ! ఈ విరహదుఃఖము మనయిరువురకు సమానము నీ నేత్రములతో నే యంధకారమును గాంతువో ఆ యంధకారమునే నేనుకూడ చూచెదను. పురుషునివలె నీవు సహింపుము. స్త్రీవలె నేను సహించెదను. ఇందు భయ మేమున్నది? ఈ అంటిగోనస్ మనల కోపముతోఁ జూచుఁగాక !

ఆంటి—హెలీనా ! నాపై నీ కింత కోపమెందుకు? నా కింత విముఖవయ్యెద వేల ? నన్ను వివాహ మాడుము. నీ తండ్రికి నేను

దాసుఁడ నయ్యెద; మఱల నాతని నీ సింహాసనముపై ప్రతి
ష్ఠించెద. హెలీనా! ప్రసన్నవు కమ్ము. సింహాసన మొసఁగెదను.

హెలీనా—ఆంటిగోనస్! నీవు శుద్ధమూర్ఖుఁడవు సుమా! [illegible] స్త్రీ హృదయము హరింపఁగోరెదవా? సతీధర్మము—ప్రభాత ప్రభాకరునికంటె ప్రభావంతము మృత్యువునకంటె నధిక ప్రబలము. మాతృప్రేమకన్న పవిత్రతరము. ఇట్టి సతీధర్మమును దోసెడు దుమ్ముతోఁ గొన నెంచితివా? ఎంత సాహసము! పొమ్ము. నిన్ను చూడ నసహ్యముగ నున్నది.

ఆంటి—మంచిది. ఇప్పుడు నాదోష మేమియు లేదు. సేవకులారా! వీ రిరువుర చెరియొక చీఁకటికొట్టున బంధింపుఁడు. తీసికొని పొండు.
(ఇరువురు సేవకులు హెలీనా సెల్యూకసులఁ దీసికొని పోదురు.)

హెలీనా—తండ్రి! సెల వొసంగుము.

సెల్యూ—హెలీనా! (తలవంచుకొని కన్నులు తుడుచుకొనును)

హెలీనా—ఇదియేమితఁడ్రి! కంటతడిపెట్టుకొందురా! మీరు వీరపురుషులుకద! మీరుకూడ దుఃఖభారవివశులయ్యెదరా! ఇది నేను చూచి సహింపఁజాలను. ఆఁకలి కాక్రోశించు పసికూనలను, పరిభవఖిన్నులగువృద్ధులను, అభాగులగు రోగులను, ఇంక నిట్టి గర్భనిర్భేద్యదృశ్యములఁ జూచి సహింపఁగలను; కాని మీకంట తడి మాత్రము చూడఁజాలను. తండ్రి!—అట్లయిన ఆంటిగోనస్ ఇచ్ఛానుసారమగు-గాక—మీకొరకు నే నేమి చేయఁజాలను? మనఃపూర్వకముగ మీకొరకు నన్ను బలియిచ్చుకొనెదను.

ఉ॥ వంతల చింతలం జివికి వగ్గయి యేమియొ త్రవ్వి నెత్తిపై
నుంతు రటన్న భ్రాంతి దన కున్న ధనమ్ము సుఖమ్ము జీవనం
బంతయు ధారవోయు పిత యాతతప్రేమఋణమ్ము నెట్లుగా
సంతతి తీర్చుకోఁగలుఁగు సర్వసమర్పణఁ జేసి యేనియున్.

తండ్రీ! యేమి చేయుచుంటివి, యేమి చేయుచుంటివి! లజ్జచే భూకుహరమునందు శిరముదాపనెంచుచుంటివా? తండ్రీ!— ఒడలు కంపించుచున్నది. మండిపోవుచున్నది—ఆఁ! అట్లగుఁగాక! ఆంటిగోనస్! నిన్ను వివాహమాడెదను. నేను నీకు దాసి నగుదును. (మోకరిలి) నాజనకుని వదలుము.

సెల్యూ—ఇది యెన్నటికిని కాఁజాలదు. హెలీనా! దీనికి బదులు నరకప్రవాసమునకైన సిద్ధముగా నున్నాను. కన్య నొసఁగి విడుదలఁ బడయఁజాలను. నేను గ్రీకువీరుఁడను. ఇది క్షణికమాత్రదౌర్బల్యము. పదుండు, సిపాయిలారా! కారాగారమునకుఁ దీసికొని పొండు. మీయిచ్ఛవచ్చినచోటికిఁ దీసికొని పొండు. పుత్రీ! సెలవొసఁగుము. (కౌఁగిలించుకొని) హెలీనా! హెలీనా! (సైనికులు వారిరువుర విడదీసి కొంతదూరము తీసికొని పోవుదురు. ఆంటిగోనస్ సింహాసనము దిగును)

ఆంటి—ఆగుడు—(సిపాయీలాగుదురు) సెల్యూకస్! నిన్ను విడుదలఁ జేసితిని. నీవు విముక్తుఁడ వయితివి. జారజుఁడనయినను గ్రీకుజాతీయుఁడను. మహాత్త్వమును గ్రహింపఁజాలుదును. ఇది కేవలము మనోహరము—కాదు—స్వర్గీయదృశ్యము. ఫిడియస్ కూడ నింత మనోహరముగ కల్పింపఁ జాలఁడు. నేను చాల నిష్ఠురహృదయుఁడను. కాని యీదృశ్యము చూడ నాకే కనులనీ రుట్టిపడుచున్నది. హే భగవాన్! నీవు అఘటనఘటనాప్రవీణుఁడవు. హెలీనా! నేను నీకుఁ దగను. సెల్యూకస్! ఈ సింహాసనము నీయది. (నిష్క్రమింతురు)

---

## చతుర్థదృశ్యము



స్థానము—యుద్ధక్షేత్రము

సమయము—సంధ్య

[ స్త్రీశిబిరము—ఛాయ, చెలికత్తెలు ]

ఛాయ—ఈయుద్ధఫలాఫలములఁ దెలిసికొనఁజాల నక్కఱ [illegible]. దూరమున సంకులతుములకోలాహలము వినవచ్చుచున్నది. యుద్ధపిపాస తగ్గుటకు మాఱుగ పెరుగుచున్నది. హృదయము పగులఁగొట్టుచున్నది.

౧ చెలికత్తె—రాజకుమారీ ! నీ కింత యుద్ధతృష్ణ యెందుకు ?

ఛాయ—వారికి నే నయోగ్యను కా నని చూపింప నాశించెదను.

౧ చెలి—ఎవరికి ?

ఛాయ—చంద్రగుప్తునకు.

౧ చెలి—పాడయిపోదువు.

ఛాయ—ఎందుకు ?

౧ చెలి—చంద్రగుప్తుని ప్రేమించుచుంటివా ?

ఛాయ—ప్రేమించితినో లేదో తెలియదుకాని, యిదిమాత్రము తెలియును. నిద్రించినను మేల్కాంచినను నాధ్యానమంతయు నాతనిపై నుండును. నిన్నరాత్రి కలలో నే నేమి కంటినో నీకుఁ దెలియునా ?

౧ చెలి—తెలియదు. ఏమి కంటివో చెప్పుము.

ఛాయ—అల్లనల్లన నే నాకాశముపై కెగురుచున్నట్లు తెలిసికొంటిని. క్రింద నాకుఁ గనఁబడినవి రెండే. ఒకటి భూమి, రెండవది చంద్ర

గుప్తుఁడు. గగనముపై కెగురు కొలఁది క్రమక్రమముగా భూమి చిన్నదయి చివరకు దృష్టిపథమునఁ గానరాలేదు. చంద్రగుప్తుఁ డొకఁడే సూర్యునివలె ప్రకాశించుచుండెను. ఇది నే కన్న కల.

౧ చెలి—చెప్పుచున్నాను చూడు, నీవు పాడగుచుంటివి.

ఛాయ—దేనిచేత ?

౧ చె—ఈ రోగముచేత.

ఛాయ—ఏ రోగముచేత ?

౧ చె—ఈ ప్రేమరోగముచేత.

ఛాయ—అయితే దీనిని రోగ మందురా ?

౧ చె—ఇది కూడ రోగమే.

ఛాయ—అయితే యీరోగముచేతనే గతించెదను. ఇంతకంటె సుఖకరమైన మరణము నేను కోరను.

(చంద్రకేతుని ప్రవేశము)

ఛాయ—అన్నా యుద్ధసమాచార మేమి ?

చం॥ కే—నాగుజ్జము మరణించినది. ఇం కొకటి కావలెను. ఛాయా! మే మోడిపోతిమి.

ఛాయ—ఓడుటా !—అన్నా ! చంద్రగుప్తుఁ డెట నున్నాఁడు.

చం॥ కే—గొప్ప చిక్కులో తగులుకొని యున్నాఁడు. సంకటస్థితిలో నున్నాఁడు. అతని సహాయమున కరుగవలయును.

ఛాయ—ఆగుము. నేనుకూడ వచ్చెదను. నాగుజ్జముకూడ సిద్ధము చేయింపుము.

చం॥ కే—మంచిది, నీవుకూడ రమ్ము.

(ప్రస్థానము)

ఛాయ—(సఖులతో) పొండు, మీరు శిబిరముల రక్షింపుఁడు. (సఖులు పోదురు) ఓ సర్వేశ్వరా! మంచితరుణము లభించినది. కృతకృత్యురాల నగునట్లు వరమొసంగుము. వారు మంచి యిరకటములో నున్నారు. వారి ప్రాణము రక్షింపఁగలను. తద్రక్షణార్థము నాప్రాణ మీయవలసివచ్చినను నవ్వుచు నవ్వుచు సమర్పించెదను. నిజప్రాణరక్షణమునకుఁ బ్రతిఫలముగ నొక మాఱు—ఒక క్షణము—నన్ను ప్రేమించిన చాలు. ఒకసారి చిఱునగవుతో నావంకఁ జూచినఁ జాలును. నామృత్యువు సార్థకమగును.

(రెండు గుఱ్ఱములతో చం॥ కే ప్రవేశము)

చం॥ కే—ఛాయా! గుఱ్ఱము సిద్ధముగా నున్నది.

ఛాయ—పద అన్నా! వచ్చుచున్నాము. (మోకరించి) హేభగవతీ! మహేశ్వరీ! నీ వేమహాశక్తిచే దానవలోకమును జయించితివో ఆశక్తిలో నొకకణముమాత్రము నాకుఁ బ్రసాదింపుము. తల్లీ! జగజ్జననీ! పద అన్నా!

(గుఱ్ఱముల నెక్కి యిర్వురు పోదురు)

---

## పంచమదృశ్యము

---

స్థానము — వంతెనదరి తోట

సమయము — సంధ్య

[చాణక్యుఁడు]

చాణ—(స్వగతము) ఆఁకలిచే నకనకలాడు కాట్లకుక్కల యుద్ధక్షేత్రమున విడిచి పెట్టితిని. అవి స్వేచ్ఛగా నీరక్తప్రవాహమును

ప్రాగునుగాక. ఈ నిబిడతమారణ్యమున వ్యాఘ్రభల్లూకములు లేని కొఱఁతను నేఁడీ మనుష్యులు తీర్చుచున్నారు. అవి తమ పొట్టనింపుకొన వేఱుపాయముఁగానక మనుష్యులరక్త మాస్వాదించును. మనుష్యు లన్ననో కేవల లోభవశమున నొడలు తెలియక క్రోధాంధులయి పరస్పర మొకరి నొకరు చంపుకొందురు. పగలంతయు లోకము నట్టుడికించినటు లుడికించి సూర్యుఁ డదే య స్తమించుచున్నాఁడు.

గీ॥ తనదు కరతైక్ష్ణమున జగమ్మును దపించి
రాజచంద్రునిరాకకై రహిఁ దొలంగి
యపరభూధరుపాదాల నడఁగె నినుఁడు;
దుష్టప్రభువులగతి యింతె తుట్టతుదకు.

ఈసూర్యుఁడు మఱల తేపు ఉదయించును. అవును. ఈతఁడు మఱలనెన్నఁడు నుదయింపనిదినముకూడ రాఁగలదు. ఈప్రభాకరుని యుజ్జ్వలజ్యోతిఃపుంజము క్రమక్రమమున సన్నగిలి మలినధూసర మగును. ఆతని పాంశురక్తచ్ఛవి భూమిని గుంకుమపంకాలేపమునఁ గై సేయును. అదియును మాసిపోవును. పిదప ఛాయామాత్రుఁ డగు సూర్యభగవానుఁ డనంతాకాశమున నదృశ్యుఁ డగును. అది యెంతగరిమామయదృశ్యము!—ఎవరు వారు? కాత్యాయనా! యేమి సమాచారము?

కాత్యా—యుద్ధములో మే మోడిపోతిమి.

చాణ—ఓడిపోతిరా?

కాత్యా—చంద్రగుప్తుఁడు రణరంగమును వీడి పాఱిపోయెను. అది చూచి సమస్తసైన్యము చిందఱవంద ఱయినది.

చాణ—చంద్రగుప్తుఁడు పాఱిపోయెనా? ఎక్కడకు?

కాత్యా—తూర్పుదిక్కునకు.

చాణ—ఏదిక్కున కని కాదు నే నడిగినది; ఆతఁ డెక్కడ నున్నాఁడని!

కాత్యా—ఆసంగతి నాకుఁ దెలియదు.

చాణ—ఆఁ! ఇటు లగునని నే నిదివఱకే శంకించితిని. చంద్రకేతుఁ డెక్కడ నున్నాఁడు?

కాత్యా—అది నాకుఁ దెలియదు. ఇంతకుముం దాతఁడు రణరంగమున గుఱ్ఱమునుండి పడుటఁ గాంచితిని.

చాణ—ఇంతవఱకు నీ వేమి చేయుచుంటివి? మూర్ఖాగ్రేసరా!

కాత్యా—నే నీ పర్వతమం దుండి యుద్ధపుస్థితిగతులఁ గాంచుచుంటిని.

చాణ—స్థితిగతులఁ గాంచుచుంటివా? విజయము నిశ్చయముగ మన గుప్పిటిలో నున్నప్పు డేమియుఁ జేయక ఊరక చూచుచుంటివా? ఆహా!

కాత్యా—అదిగో! చంద్రగుప్తుఁడు వచ్చుచున్నాఁడు.

చాణ—ఎక్కడ? ఆఁ! ఆతఁడు వచ్చుచున్నాఁడు. మంచిది. కాత్యాయనా! యిప్పటికిని యాశ కలదు. పొమ్ము. సేనల యుద్ధము నకుఁ బురికొల్పుము. చంద్రగుప్తుఁడు పాఱిపోలేదు, ఇప్పుడే రణరంగమునకు వచ్చుచున్నాఁ డని యుద్బోధింపుము. పొమ్ము. తొందరగాఁ బొమ్ము. చెప్పినదే చెప్పక త్వరగా వెడలిపొమ్ము. (కాత్యాయనుఁడు పోవును)

చాణ—చింతింపవలసినపని లేదు. "కంటకే నైవ కంటకం" మురా! మురా!! (మురి ప్రవేశించును)

ముర—ఏమి యాజ్ఞ, గురుదేవా?

చాణ—అక్కడ నిలఁబడుము. (మురి అట నిలఁబడును) నీ వేదువఁ గలవా?

ముర—అ దేమి?

చాణ—అదే చంద్రగుప్తుఁడు వచ్చుచున్నాఁడు. నీ వేడ్వవలయును.

ముర—పుత్రా! పుత్రా!! (ముందుకుఁ బోవును)

చాణ—జాగ్రత్త! ఈసమయమున నీప్రేమ గీమ పనికిరాదు; ఇప్పుడు గట్టిగా చీవాట్లుపెట్టుట, కన్నీరు కార్చుటఁ తల్లికిఁగల పుత్రాభిమానము, చక్కగా నభినయింపవలయును. తెలిసినదా? సిద్ధముగా నుండుము.

(తలవంచుకొని ఖడ్గహస్తుఁడయి చంద్రగుప్తుఁడు ప్రవేశించును)

చాణ—ఇదిగో చూడు. చంద్రగుప్తుఁడు మురా! విజయలక్ష్మిని జేపట్టి నీపట్టి చంద్రగుప్తుఁ డిదె వచ్చినాఁడు. నీ వీరపుత్రుని గని కన్నులున్న ఫలము నందుము. ఉత్సవ మొనర్పుము.

చంద్ర—లేదు. గురువర్యా! నేను యుద్ధమున జయించి రాలేదు.

చాణ—అదేమి? అయితే—

చంద్ర—సమరమును వీడి పాఱిపోయి వచ్చితిని.

చాణ—అది యెట్లు జరుగును? అసంభవము. మురపుత్రుఁడు సంగరమున విజయ మందును, లేక మ్రిందును. కాని పాఱిపోవఁడు.

ముర—పాఱిపోయివచ్చితివా? చంద్రగుప్తా! ఈమాట యెంత సుస్థిరచిత్తముతోఁ జెప్పుచుంటివి? పాఱిపోయి వచ్చితివి! ప్రాణములు విడువలేకపోతి వేమి? పిఱికిపందా!

గీ॥ అరులఁ దునుమాడి జయలక్ష్మి నందు టొకటి
పోరునం బడి స్వర్గముం బొందు టొకటి
వీరునకు రెండె పద్ధతుల్; పాఱిపోయి
బ్రతుకదలఁపడు జీవచ్ఛవంబుపగిది.

చాణ—కాదు, కాదు. ఇది క్షణికదౌర్బల్యము. పొమ్ము, చంద్రగుప్తా పొమ్ము? యుద్ధము చేయుము.

చంద్రి—చేయఁజాలను. గురుదేవా! యుద్ధ మిఁకఁ జేయఁజాలను.
(కత్తి చాణక్యుని పాదములకడ నుంచును)

చాణ—చేయఁజాలవా?

చంద్రి—సోదరుని క్షతగాత్రుని జేయఁజాలను.

ముర—కాపురుషుఁడా!

చంద్రి—కాపురుషుఁడను కాను, తల్లీ! ఆతఁడు నాసోదరుఁడు.

చాణ—నిన్ను రాజ్యబహిష్కార మొనరించిన సోదరుఁడు కాదా!

చంద్రి—అయినను అతఁడు నాకు సహోదరుఁడే.

ముర—నీజనని నవమానించిన సహోదరుఁడా!—ఏమి? మాటలాడకుంటివి?

చాణ—వాని రాజత్వము కేవలము దుర్మార్గభూయిష్ఠము.

చంద్రి—భ్రాతృవిరోధమునకుఁ బురికొల్పుచుంటిరా? గురువరా!

చాణ—అవును. ధర్మయుద్ధమునకు కురుక్షేత్రసంగ్రామమున శ్రీకృష్ణ భగవానుఁ డేమి సెలవిచ్చెను?

చంద్రి—క్షమింపుఁడు, గురుదేవా! శ్రీకృష్ణునియుక్తి నామనస్సునకు నచ్చలేదు.

చాణ—(ఆవేగమున భూమి తన్ని) ఈపాపముచేతనే ఆర్యావర్తము పాడయిపోయినది. చంద్రగుప్తా! గీతలగుప్తమహత్వము నీ కేమి తెలియును? శాస్త్రచర్చ బ్రాహ్మణునిది. నీది కాదు.

చంద్రి—బ్రాహ్మణుని అధికారము బ్రాహ్మణుఁ డనుభవించును గాక! నాకు సెలవిండు.

చాణ—చంద్రగుప్తా! నీ యీ హృదయదౌర్బల్యమును జాలకాలము నుండి చూచుచున్నాను. ఇతర సమయములం దీదుర్బలత్వ మంత

హానికరము కాదు. శుష్కనైరాశ్యమున దినమెల్లను బుచ్చెదవుగాక! కన్నీరు మున్నీరుగ కాఱ రాత్రులెల్లను గడపెదవుగాక! అందువలన వచ్చిన ప్రమాద మంతగా లేదు ఒక్కొకప్పుడేద్చుటయు విలాసముగా నుండును. కాని కర్మక్షేత్రమున—కర్తవ్యము నెదుట నిలఁబడినపుడు—ఈ దౌర్బల్యమువలన గొప్ప ముప్పు వాటిల్లును. అది యొక భూకంపమువలె బయలుదేరి నూఱేండ్ల కష్టమంతయు నొక్కక్షణములో మట్టిని గలుపును. ఇంతకాలమునుండి కష్టపడిచేసిన ప్రయత్నములన్నియు నొక్కత్రుటిలో నిష్ఫలము సేయకుము. ఈయలసభావమును జీర్ణవస్త్రమువలె హృదయమునుండి దూరీకృతము చేయుము. యుద్ధమున కగ్రేసరుఁడవు కమ్ము.

చంద్ర—క్షమింపుము, గురుదేవా!

ముర—చంద్రగుప్తా!

గీ॥ దేశమాతృత్రాణములఁ దీర్ప దివురునట్టి
వీరపుత్రుఁ డొకం డున్న విలువగాని,
భీరుకుక్షింభరుల్ పదివేలు గలిగి
ప్రబల నేటికి? భూమికి బరువుగాఁగ.

చంద్ర—నందుని క్షమింపుము, తల్లీ!

ముర—క్షమించుటా! ఆపాదమస్తకము శరీరమంతయు వేయితేళ్లు కుట్టినట్లు భగభగమండుచుండ క్షమించుటా? కేవలము ఒక్క వస్తువు మాత్రమే ఈప్రళయాగ్నిని—ఈపరాభవానలమును ఈశరీరదావదహనమును—జల్లార్పగలుగును. అది నందునిరక్త మొక్కటియే.

చంద్ర—తల్లీ!

సీ॥ తమ్ముఁడా రమ్మని తనివారఁ గౌఁగిలి
క్రీడించు నాటి మాఖేలనములు

అశ్వఖురాఘాత మతనికై నేను పా
ల్గొన్న నాటి కృపావిలోకనములు
జనకతిరస్కారజనితఖేదము వాయఁ
బ్రీతి నించెడు నాటి ప్రీణనములు
అనురాగమునఁ గూడి యారగించెడు స్మృతి
భాజన మ్మగు నాటి భోజనములు
గీ॥ నెయ్యపుంగయ్యమున వీగి నిలుచునపుడు
ప్రేమ నోదార్చు నాటి నాప్రేరణములు
నతనికోమలవదనంబు నరసినంత
నొకపరిం దోచి చైతన్య మూడ్చె నమ్మ!

మఱియు నానందునిమస్తక ముత్తరింపఁ గత్తి పైకెత్తునప్పటికి అమ్మా! యేమి చెప్పుదు. పూజ్యు లగు తండ్రిగారి మూర్తి రక్తసిక్తమయి మానసమున గోచరించి హృదయము పిడుగులు నటుల "చంద్రగుప్తా! జాగ్రత్త! నందుఁడు నీ సోదరుఁడు. ఆతని కంటె మగధసామ్రాజ్య మెక్కువా?" యని యుద్బోధించినటు లయ్యెను.

ముర—నందుఁడు నీకుఁ దమ్ముఁడైన నా కేమి కావలయును?

చంద్ర—నందుఁడు నీయాత్మజుఁడు. తల్లీ! గర్భమున నీవు భరింపనంత మాత్రమున నీ కాతఁ డాత్మజుఁడు కాఁడా? తల్లిలేని కొఱంత కనంబడకక నీవ తల్లివయి యాతని బెంచి పెద్దవానిం జేయలేదా? నీ యమృతతుల్య మగు స్తన్య మొసఁగ లేదా? ఒడియం దిడికొని నిద్రబుచ్చలేదా, తల్లీ!

ముర—అందువలననే నే నాతని క్షమింపఁజాలను. నా చేసిన చేత లన్నియు చెఱువున కలిసినవి. అన్నియు మఱవఁబడినవి. కాని నేను మాత్ర మెన్నటికిని మఱవఁజాలను. అధమాధముఁ డగు వాచాలుఁడు నా శిరోజములు బట్టి లాగినపుడు, నందుఁడు

'శూద్రాణి తల్లియా' యని నన్నవహేళనచేసినప్పుడు, ఏమి చెప్పుదును, నాయనా! నాపడిన మనోవేదన తలఁచుకొనిన నిప్పటికిని నోడలు కంపించుచున్నది. అప్పటి దుఃఖము, క్రోధము, దైన్యము! ఓహో! తల్లియవమానము నీకు లెక్క లేదా! తల్లి నీ కేమియుఁ గాదా?

చాణ—ఒక తల్లి గర్భవాసమున జనించినగదా సోదరసంబంధబాంధవ్యము. అప్పుడు తల్లి యెక్కువా సోదరుఁ డెక్కువా? అనునది. మాతృపరాభవమునకుఁ బ్రతీకార మొనర్ప నుపేక్షించు పుత్రునకు నీవే జగత్తునందు ప్రథమోదాహరణము కాఁగలవు. (మురను జూచి) మురా! దురదృష్టురాలా! ఏడువుము, ఏడువుము. పరాభవాగ్ని చల్లారునంతవఱ కేడ్వుము. ఈతఁడే నీ పుత్రుఁడు—తల్లిని లక్ష్యముచేయని పుత్రుఁడు. చంద్రగుప్తా!

ఆ॥ వె॥ జన్మభూమికన్న జననికన్నను బ్రేమ
పాత్ర మొండు కలదె ప్రజకు నెందు;
జనని కష్టసుఖములను గణింపనివారు
బ్రదికి చచ్చినట్టివారు సూవె.

చంద్ర—అది నాకుఁ దెలియును, గురువర్యా!

చాణ—లేదు. తెలిసికొనలేదు. తెలిసికొనినయెడ మాతృపరాభవమునకు బదులు తీసికొన శంకింతువా? జనని జనని యనిన నే మనుకొంటివి? యోగనిద్రాముద్రితుఁ డగు శ్రీమహావిష్ణుని గర్భకుహరమున నిమిడియుండు సృష్టివలె తనగర్భమునందు నిన్నుఁ దాల్చి ఒకేశరీరము, ఒకేప్రాణము, ఒకేమనము, ఒకేశ్వాసము, ఒకేయాత్మగ లీనముచేసికొని తుదకు అగ్నిస్ఫులింగమువలె, సంగీతమూర్ఛనమువలె, చిరంతనసమస్యవలె నీకుఁ బ్రత్యేకవ్యక్తిత్వ మాపాదించినది—ఈజనని. ప్రాణాధారమగు తన రక్తమును హృదయకటాహమునం దిడి, యారని ప్రేమా

నలమున కాచి, తయారుచేసిన సుధామధుర స్తన్యము నాన సిచ్చినది—ఈజనని. అల్లనల్లన నవ్వించుచు మాటలు నేర్పి, నీ పురోభివృద్ధికయి యాశీర్వాదపూర్వకముగ ముద్దాడి, ని న్నీ ప్రపంచమునకు పంపినది—ఈజనని. వ్యాధివిచారములందును దైన్య దుర్దినములందును నీ వందు దుఃఖములు తనవిగ దుఃఖించుచు, నీ వాడినముఖపద్మమును మరల వికసింపఁజేయ తన ప్రాణములనైన నీయ వెనుదీయక తనస్వచ్ఛతరమగు ప్రేమ మందాకినిని నీమానసమరుభూమిపై శతధా ప్రవహింపఁజేయునది—ఈజనని. ప్రభాతసూర్యుని తిరస్కరించు తననిర్మలకరుణా కిరణముల నిర్క్షోభముగ, నిర్విచారముగ, నిస్స్వార్థముగ, నిష్ఫలాపేక్షగ సంతతిపై ప్రసరింపఁజేయునది—ఈజనని. అనురాగాదార్ద్యమున నొడలు పులకరింప కంపితహస్తముల నెత్తి, తనసంతానముతో నైక్యమగునటుల హత్తుకొనునది—ఈజనని. చంద్రగుప్తా! తెలిసినదా, జనని యన నెట్టిదో?

చంద్ర—గుహూత్తమా! రక్షింపుము. భ్రాతృవధకు నన్ను ప్రేరేపకుము.

ముర—చంద్రగుప్తా! నేను నీ కేమియు కా నని యింతకాలమున కిప్పుడు తెలిసికొంటిని. నందుఁడు క్షత్రియుఁడు; నీవు క్షత్రియకుమారుఁడవు. నందుఁడు నీసోదరుఁడు. నేనో శూద్రదానను. నిన్ను పదినెలలు గర్భమున ధరించితిని. అంతియె, కేవల మంతియె. నే నెవతెను నీకు? నేను నీకు తల్లిని గాను.

చంద్ర—పుత్రునిపై నింతనిష్ఠురమా? దల్లీ! నీవు నాజననివి. జననివి మాత్రమే కాదు—నాధర్మము, నాసాధనము నీవు. నీవ నా యీశ్వరివి. నీయాజ్ఞయే నాకు వేదవాక్యము.

ముర—ఇదే సత్యమైన యుద్ధమునకు సిద్ధము కమ్ము—అ దేమి! మఱల నూరకుంటి వేమి? చంద్రగుప్తా! (భగ్నస్వరమున) నేను నీజననిని—

అవమానమ్లానిత నగు నీజననిని—నందప్రపీడిత నగు నీజనని. ఇదే నా యాజ్ఞ.

గీ॥ నీచవాచాలనిర్వాచ్యనిష్ఠురోక్తి
ప్రజ్వలితమైన పరిభవవహ్ని మ్రగ్గి
బ్రతికియుంటి ప్రతీకారయార్థంబు వత్స!
తల్లిఋణమును దీర్చెదో తలఁగి చనెదొ.

చంద్రి—నీయిష్టమే నాయిష్టము, తల్లీ! దీనికి మాఱులేదు. ఈకంటక భూయిష్ఠ మగు నీప్రపంచమున నీయాజ్ఞయే నాకు మార్గదర్శి. నీవే నాజీవనమునకు ధ్రువతారవు. నిన్నే నౌకగాఁ గొని నే నీసంసారసాగరమును దరించెదను. అమ్మా! ఆశీర్వదింపుము. ఇప్పుడె యుద్ధమునకుఁ బోయెదను.

ముర—అటులయిన నీవు నాపుత్రుఁడ వగుదువు.

చాణ—అటులయిన నీవు నాశిష్యుఁడవే. నీహృదయమందలి యీక్షణిక దౌర్బల్యమును బాఱఁదోలుము. ఒకసారి బలపూర్వకముగా—

(దూర నేపథ్యమున)—ఈవైపు ఈవైపు

చాణ—అల్లదిగో! వారు వచ్చుచున్నారు. లెమ్ము, వత్సా! లెమ్ము. మేఘనిర్ముక్తప్రభాకరునిభాతి ద్విగుణప్రభాభాసి వయి లెమ్ము. అదె వినుము. వీరుల సింహనాదములు వినవచ్చుచున్నవి. నీ సైన్యముకూడ వచ్చుచున్నది. భయము లేదు. ఒక చంద్రగుప్తుఁడు వేయినందులకు సమానము. నా శిష్యుని బరాభవింప నెవరికి గుండె యుండును. అటు చూడుము. నీ సహాయార్థము చంద్రకేతుఁడు సేనాసహితముగ వచ్చుచున్నాఁడు.

(నేపథ్యమున దగ్గఱగా) — ఈయడవిలోనే.

చాణ—చంద్రగుప్తా! నిశ్చలమనస్కుఁడవై యుండుము. రమ్ము, మురా! పద. విజయోస్తు.

(ఇరువురు నిష్క్రమింతురు. నల్గురు సిపాయీలతో. ... ఖడ్గము ధరించి నందుఁడు ప్రవేశించును)

నందుఁడు—ఈమూల డాగియుంటివా? పాఱుఁబోతా! ... డాగినను నిన్నీనందుఁడు విడువఁడు.

గీ॥ కత్తి చేపట్టి నేనును క్షత్రియుండ
నను చుఁ బ్రేలిన క్షత్రియుం డగుదె నీవు?
కెరలి పడ నేల క్షుద్రుఁడా! క్షేత్రగుణము
వి త్తనమ్ములఁ జెఱుపక విడచి చనునె?

చంద్ర—మూర్ఖుఁడా!

గీ॥ పౌరుష మ్మగు కర్మమ్ము పట్టు వదలి
దైవిక మ్మగు జన్మమ్ముఁ దడవ నేల?
బ్రహ్మకులమునఁ బొడమఁడే రావణుండు?
పాలగుణములు వహ్నికేపాటి గల్గె?

మాన్యు లగు తండ్రిగారి యాత్మ కశాంతి చేకూర్ప వెఱచి, సోదరుఁడ వని కనికరించినందుల కిట్లు తూలనాడు చుంటివా? శుద్ధక్షత్రియుఁడ వగు నీక్షాత్రముఁ బరీక్షించెద. కాచికొమ్మి.

(ఖడ్గము దూయును)

నందు—శూద్రాణి తల్లి! దాసీపుత్రుఁడు సోదరుఁడు! చాల బాగుగా కుదిరినది. సైనికులారా! చూచెద రేల? తలపడుఁడు. వధింపుఁడు. ముక్కలు ముక్కలు సేయుఁడు.

(చంద్రగుప్తుఁడు సైనికులు పోరాడుదురు. సైనికులు ఇరువురు చత్తురు! ఇరువురు పాఱిపోదురు. చంద్రగుప్తుఁడు నందుని శిరము నఱుక కరవాల మెత్తును.

నందు—(కంపితస్వరమున) అన్నా! క్షమింపుము, క్షమింపుము. వధింపకుము. (కాళ్ళపైఁ బడఁబోవును)

చంద్ర—సోదరా! అనుచిత మొనర్చితిని. క్షమింపుము. ప్రాణభయము లేదు. ఇదే నాఖడ్గము పాఱవైచెద. (కత్తి దూరముగాఁబాఱవేయును) నీయపరాధముల మఱచితిని. కౌఁగిలించుకొనుము. (చంద్రగుప్తుఁడు నందుని కౌఁగిలించుకొనును. ఇంతలోఁ బాఱిపోయిన యిరువురు సైనికులు నందుని సహాయార్థము వచ్చి నందుని కనుసన్నచే నిరాయుధుఁ డగు చంద్రగుప్తుని జంపనుంకింతురు)

చంద్ర—నందా! నీవును క్షత్రియుఁడవేనా? (పెనగు లాడును)

(చంద్రకేతుఁడు ససైన్యముగఁ బ్రవేశించును)

చంద్రకే—పిఱికిపందలారా! నిరాయుధు వధింప నెంచితిరా? కాచికొనుఁడు. (సైనికులపైఁ బడి వారిఁ దుదముట్టించి నందుని జంప ఖడ్గ మెత్తును)

చాణ—(తెఱలో) వధింపవలదు, వధింపవలదు. బంధింపుఁడు, నందుని బంధింపుడు.

చంద్రకే—(కత్తి దింపి) గురువర్యుని యాజ్ఞ శిరోధార్యము. సైనికులారా! నందుని బంధింపుఁడు. (సైనికులు నందుని బంధింతురు)

(నిష్క్రమింతురు)



# చంద్రగుప్త

## తృతీయాంకము

### ప్రథమదృశ్యము

స్థానము — సముద్రతీరము

సమయము — సంధ్య

[సైనికులు పాడుచుండెదరు. కొంచెము దూరమున ఆంటిగోనస్ మాటలాడక నిలఁబడి యుండును]

సైనికులు— గీతము

అదె నాహృదయేశ్వరి నాసహచరి యదె నాగృహలక్ష్మి
ఘనఘనాఘనము గర్జనసేయుచు గగనమండలము గప్పఁగ
తనవదనస్మితచంద్రిక నెయ్యది తమ మడంచు జిగియొప్పఁగ॥ అదె॥
పండువెన్నెలలు వెండి నూదినటు నిండి నభమ్మునఁ బఱవఁగ
గండుఁగోయిలల పిండుపాటల కజాండమెల్ల మెయి మఱవఁగ
పండువుగా నే కలికిపలుకు స్మృతిపథమునఁ బడుఁ గడుఁజొఱవఁగ ॥అదె॥
చిరదినమ్ములకు నరుదెంచిన న న్నరసి విరియు వదనమ్మున
విరహవిధుర మగు నధరమధురిమను విమలమందహాసమ్మున
స్వరభంగమ్మును బూని వినుచు నెది ప్రణయకథాలాపమ్మున॥ అదె॥

(సైనికులు పోవుదురు)

ఆంటిగోనస్ —

సీ॥ జన్మభూమీమంత్రజపపరాయణులకు
సుఖములెల్లను స్వప్నసుఖము లగును
జన్మభూమీమహైశ్వర్యకాముకునకు
ధనములెల్లను జితేంధనము లగును
జన్మభూమీయశఃస్థాపనాచణులకు
వాసమ్ము కారానివాస మగును
జన్మభూమీపరశక్తిసాధకులకుఁ
బ్రాణ మన్నను దృణప్రాయ మగును

ఆ॥ జన్మభూమినామచతురక్షరములందు
నెంత పరమమహిమ మిమిడినదియొ
పేరుఁ దలఁచినంతఁ బెఱుఁగు నొడల్ కన్న
తల్లిఁ గన్న చిన్నిపిల్ల కటుల.

ఆహా! యేమి యానందము?

చ॥ కలుములమాటలట్లునిచి గద్దియు గాదము లేక ఊాల అ
ప్పలఁ దఱచౌ నెడారి కనుపండువ యౌ, బ్రజ కాత్మభూమిపైఁ
గల యభిమాన మట్టిదగుఁగాదె; స్వదేశపవిత్రనామముౕ
దలఁచి మనుష్యుఁడెవ్వఁడు ముదమ్మునఁబొంగఁడు మోడుకాని-చోన్.

చాలకాలమునకుఁ బిదప జన్మభూమిని బ్రియజనులను మఱలఁ గాంచు భాగ్యము లభింప నున్న నెవ్వఁ డానందపారవశ్యమున మునుంగఁడు? ప్రియజనసందర్శనోత్సాహులయి ఎవరిండ్లకు వారు పోవుచున్నారు. కాని నే నేకాకిని. నా యనువా రెవ్వరును లేరు. నాయభ్యుదయముం గూర్చి సంతసించువా రెవ్వరును లేరు. ఒక ముదుసలి తల్లి మాత్రము కలదు. చిన్నతనమున లాలన పాలన చేసి పెంచినది. కాని దయాశూన్య యయి గొడ్డునువలె సంతలో విక్రయించినది. ఈ ప్రపంచమున

నేను ప్రేమించువారు కాని, నన్నుఁ బ్రేమించువారు గాని మచ్చునకైన లేరు. అయిన నెందులకో నాదేశమునకుఁ బోవు చున్నాను. నిప్పురవ్వ లవాయిచువ్వ నాకసమునకై [illegible] పోవునటుల న న్నొకదుర్భరాపవాదఝంఝామారుతము స్వదేశ మునకు నెట్టుకొని పోవుచున్నది. ఒక మహావ్యాధి—అది యైనను నాసంచితము కాదు—దానికే నే నుత్తరవాదియును గాను. కాని అవుదునో కానో యీవిచారణ యంతయు లోకులకుఁ గావలయునా? ఎవరికి కావలయును? ఉన్నదానికే యీవిచారము లేనప్పుడు. పాపము! లోకుల త ప్పేమి కలదు? తండ్రి భాగ్యభోగ్యముల కు త్తరాధికారి యగు పుత్రుఁడు ఆతని పాపములను, దైన్యములను, వ్యాధులను బొల్లగొనఁడా? కాని—ఛీ! ఈమాటలతో నేమి? పోనీ—ఇఁక [illegible] చింతింపను. చింతించిన కొలఁది పిచ్చి యెక్కుచున్నది.

కాఱుమబ్బులు క్రమ్ముచున్నవి. తుపాను వీఁచుచున్నది. సముద్ర మల్లకల్లోలముగ నున్నది. హా మ్ము, హే ఉచ్ఛ్వసిత నీలసింధూ! రంగదభంగభంగముల నల్లకల్లోల పరచుకొనుచు హా మ్ము. మనుష్యుల క్షుద్రదంభము నలక్ష్యము సేయుచు మృత్యుభ్రుకుటీవిక్షేప ముపేక్షసేయుచు నుత్తుంగతరంగముల ననంతానంతపదము చుంబించుచు సృష్ట్యనాదిసంగీతము నతి గంభీరముగ పాడుచు నొకప్రాంతమునుండి మఱొకప్రాంతము నకుఁ బరుగెత్తుచుందువు. నీవు సర్వస్వతంత్రుఁడవు. యుగ యుగాంతములనుండియు విసుగు విరామము లేక యొకేవిధముగఁ బరుగెత్తుచుందువు. పైన నున్ముక్తనీలాకాశ మున్నది. క్రింద దాని ప్రతిచ్ఛవిగ నీ వుంటివి. చంద్రసూర్యగ్రహనక్షత్రమం డలముల నీస్వచ్ఛతర హృదయమునందు ప్రతిబింబచ్ఛలమున ధరించెదవు. తీవ్రతరఝంఝామారుతాసంగత్యమున నుల్లోల తరంగ మాలికలు వికటలాస్యముచేయ దానవక్రీడ నెఱపుదువు.

అశనిగర్జనములతో నీగంభీరనినదముల మేళగింపుము. నీపింగళ ఫేనద్యుతులతో విద్యుత్ప్రకాశ మపహసింపుము. ప్రబలప్రభంజనావేగ మడఁగినపిదప నిర్మలాకాశమువగిది నీవు సుస్థిరగభీర భావమున ప్రశాంతి నందెదవు. అందువలననే నీవు భయంకరుఁడవును, మనోహరుఁడవును. భువనసామ్రాజ్యభద్రుఁడ వగు నోసముద్రా! పొమ్ము; పీరునివలె నుద్దామాంధవిక్రమమున పొమ్ము; కలకాల మొకేవిధమున కల్లోలపడుచు పొమ్ము.

(ప్రస్థానము)

---

## ద్వితీయదృశ్యము

---

స్థానము—కారాగారము

సమయము — రాత్రి

[నందుఁడు వాచాలుఁడు కొట్టునుండి బయటకు వత్తురు]

నందు—ఔరా! దుస్సాంగత్యదోష మెంతకుఁ దెచ్చినది?

చ॥ కలిమి ప్రభుత్వముం గలుగఁ గాకులపోలికఁ జుట్టుమూఁగి మె
చ్చులకయి తప్పు లొప్పులుగ స్తోత్ర మొనర్చెడి యిచ్చకంపునె
చ్చెలులను నమ్మి యిట్టి చెడుచిక్కులఁ జిక్కితిఁ జిక్కితిం గటా!
పలువలఁ గూడి తిర్లిపడువారలపాటు లివేకదా! తుదిన్.

నాఁడు చాణక్యుఁడు చెప్పనే చెప్పెను. కాని యామదోద్రేకమున వానిమాటలు వినఁబడినవా? వాని ధర్మోపదేశములు వినకున్న వినకుంటిని. పాపము బ్రాహ్మణుని దూలనాడి యవమానించితిని. దానికి ఫల మిప్పు డనుభవించుచుంటిని. విచారించిన లాభ మేమున్నది? వాచాలా! ఈకొట్టు ఎంత చీఁకటిగా నున్నది?

వాచా—చీఁకటయితే మానే గాని పురుగులబాధ లేకుండా బ్రతికిపోయినాము.

నందు—కాత్యాయనుని బందీచేసినకొట్టు ఇదేనా యేమి?

వాచా—అవును, మహారాజా!

నందు—ఎంత భయంకరముగా నున్నది?

వాచా—కాత్యాయనుని యేడ్గురుపిల్లల్ని అన్నం పెట్టకుండా కడుపు కాల్చి చంపింది యీకొట్లోనే, మహారాజా!

నందు—దానికి నేను పశ్చాత్తాపము పడుచుంటిని.

వాచా—పశ్చాత్తాపం పడుతున్నారా? మహారాజా! అయితే యింకేం భయ ముంది?

నందు—అంతమాత్రమున భయములేకుండునా? చంద్రగుప్తుడు వధింపఁ డనుమాట నిశ్చయము. ఇఁక వధించిన ఆభగ్నభ్రుకుటీకుటిలుఁ డును, ప్రతిహింసాపరాయణుఁడు నగు నాబడుగు బ్రాహ్మణుఁడు వధింపవలెను. మృగరాజు తన చేఁబడిన మృగమును జూచునటుల నాతఁడు నన్నానాఁడు తీవ్రలోలుపదృష్టితో వీక్షించెను.

వాచా—అయితే భయ మెందుకు?

నందు—వాచాలా! నీకు భయ మగుట లేదా?

వాచా—కొంచెమైనా లేదు. అసలు లేనే లే దని చెప్పవచ్చును. వారు మహాచేస్తే నిన్ను చంపుతారు. ఇంతేగా, అంతకన్న యెక్కువేం చేస్తారు? అందువల్ల నాకేం భయం? అయితే నాచెల్లెలు విధవ అవుతుంది! నాకేం?

నందు—ఆఁ! అటులనా? వారు నన్నుమాత్రము చంపి నిన్ను వదలి పెట్టుదు రనుకొంటివా యేమి?

వాచా—మీయూహ సరియైనదే.

నందు—అటు లనుకొనకుము.

వాచా—ఆఁ !

నందు—చంద్రగుప్తుని తల్లిశిరోజములఁ బట్టి యీడ్చితివి.

వాచా—ఆఁ ! ఈడ్చితిని.

నందు—చాణక్యపండితుని జుట్టుపట్టుకొని లాగితివి.

వాచా—ఎప్పుడు— లేదు— అయితే—

నందు—ఇవన్నియు నిటు లుండ, నీవు నాబావమఱఁదివి !

వాచా—నిజమే.

నందు—నన్ను వదలవలె ననిన వదలుదురు. కాని నిన్నుమాత్రము వారు వదలరు.

వాచా—(చేతులు జోడించి) హా ! మహారాజా !

నందు—నాయెదుట నెందుకు చేతులు జోడించెదవు ?

వాచా—అది నాకు సహజమై పోయింది. అది నాకు తెలియను కూడా తెలియదు.

నందు—భయపడెద వెందుకు ? చంపితే చంపెదరు. ఇంతేగా ?

వాచా—అంటే ?

నందు—"వారు మహాచేసిన చంపెదరు" అని యిప్పుడే కదా నీ వంటివి ! నేను దానినే మఱల నంటిని.

వాచా—నేనట్లా అన్నానో లేదో జ్ఞాపకం లేదు.

నందు—నీ జ్ఞాపకశక్తి నీయిష్టములో నున్న దనుకొనెదను. నీకు జ్ఞాపక ముంచుకోవలె ననిన నుంచుకొందువు. లేకపోయిన నుంచు కొనవు. అరె ! నీవు ఇప్పుడె, యిప్పుడే కాదు అంటివి ?

వాచా—ఎప్పుడు ? అనివుంటే అని వుండవచ్చును. కాని నాయభిప్రా యం మాత్రం అది కాదు.

నందు—ఏమైనను సరే నిన్ను చంపివేయుదురు.

వాచా—చంపరు, మహారాజా! (చేతులు జోడించును)

నందు—తప్పకుండ చంపి తీరుదురు.

వాచా—వెధ వవుతుంది.

నందు—నీవు చనిపోయిన విధవ యెవ రగుదురు? నీకు భార్యయే లేదు కదా!

వాచా—అయ్యో! దేవుఁడా! ఈ సమయంలో పెళ్ళాం అయినా లేక పోయింది, వెధవయ్యేందుకు.

నందు—నీ కయి యేడ్చువారైన లేరు.

వాచా—కాని, మహారాజా! ఇప్పుడు పెళ్ళాం ఉన్నట్టయితే తప్ప కుండా యేడ్చేదే.

నందు—ఇట్టి యాసన్నవిపత్సమయమందుకూడ నీహాస్యభాషణము నవ్వు పుట్టించుచున్నది.

వాచా—నవ్వు వస్తున్న దంటున్నారే? ఇది బాగా జ్ఞాపకం ఉంచుకోండి.

నందు—ఈయుద్ధమునకు మొదట మహారాణిని మంత్రియధీనమం దుంచి వచ్చితివి కాదా?

వాచా—అవును, మహారాజా! మంత్రి అధీనం చేసి వచ్చాను.

నందు—ఆధ్వని యేమిటి? వాచాలా!

వాచా—(వడఁకుచు) ఎవరో వస్తూ ఉన్నట్టు, తలుపు తెరచినట్టు తోస్తూంది.

(ఇరువురు సిపాయిలతో కాత్యాయనుఁడు ప్రవేశించును)

కాత్యా—మహారాజా!

నందు—విశ్వాసఘాతుకుఁడా! స్వామిద్రోహీ!

కాత్యా—నేను విశ్వాసఘాతుకుఁడనా ?

నందు—చిన్నతనమునుండి మాతండ్రి పప్పుపులుసు చెడ తిని క్రొవ్వి—

కాత్యా—వారు మీ కొక్కరికే జనకులు కారు. చంద్రగుప్తునికి కూడ జనకులే. మీతండ్రిగారికి విరుద్ధముగా నే నేదియుఁ జేయలేదు. వారి కనిష్ఠపుత్రుని వీడి జ్యేష్ఠపుత్రునిపక్ష మవలంబించితిని. ఇందు విశ్వాసఘాతుకత యే మున్నది ?

నందు—ఆఁ! అట్లాగా! ఆయనదాసీపుత్రునిపక్ష మవలంబించితి వేమి ? చెప్పుటకు సిగ్గుగుట లేదా, నీకు, బ్రాహ్మణుఁడా ? నీవు, నాచాణాక్యుఁడు—మీ రిరువురు ఆర్యులయి, అందును బ్రాహ్మణులయి కూడ కుట్రలుపన్ని యనార్యు లగు భిల్లసైన్యముల కడుపులు కాళ్ళు పట్టుకొని వారిసహాయమున నొక సుక్షత్రియుని రాజ్యచ్యుతుని గావించి యతనితండ్రిదాసీపుత్రుని సింహాసన మధిష్ఠింపఁ జేసితి రేమి ? ఇది యేమి ప్రతిష్ఠ యనుకొంటిరా ? ఒక శూద్రుఁడు—జారిణీపుత్రుఁ డగు శూద్రుఁడు—నేఁడు మగధ సింహాసన మధిరోహించెను. ఘోరా! హతవిధీ! యెంత జేసితివి ?

గీ॥ ప్రాజ్యరాజ్యాధిపతిఁ బదభ్రష్టుఁ జేసి
క్షుద్రశూద్రుండు సామ్రాజ్యభద్రుఁ డయ్యెఁ
గుంజరం బుండు గద్దెపైఁ గుక్క యెక్కె
దుర్విధివిపాక మెవ్వాఁడు తొలఁగఁగలఁడు ?

అ దేమి తల వంచుకొంటివి, విశ్వాసఘాతుకుఁడా ?

కాత్యా—రాజా ! మొదటినుండియు నేను విశ్వాసఘాతుకుఁడను కాను. నన్ను నీవే విశ్వాసఘాతుకునిగాఁ జేసితివి. అభము శుభ మెఱుంగని నాయనుంగు బిడ్డల కారాగారమం దునిచి చంపితివి. వారు ఈ కొట్టులోనే, ఈచీఁకటి కొట్టులోనే యన్నము లేక యలోలక్ష్మణా యని మలమలమాడి చచ్చుచుండ నీపాపిష్ఠి

నేత్రములతో నేను చూచితిని. చనిపోవుటకుఁ బార్శ్వము ప్రతి వాఁడును నోరార నిను దూరుచు తన కిడిన గుప్పెడన్నము నా కిడి నాయనా! యీయత్యాచారమునకు, నీఘోరతరాన్యాయ మునకు తప్పక ప్రతీకారము తీసికొను మని యంత్యసందేశ మొసఁగి మఱి మరణించువాఁడు. వృద్ధుఁ డగు తండ్రి తన సంతానముకొఱకు పడు సంతాపము నీ కెట్లు తెలియును? మేఘాచ్ఛాదితమయి ప్రపంచమంతయు గాఢాంధకారమున లుప్త మయి పోయినప్పుడు ముదుసలి యగు తండ్రి యెదుట జగత్తం తటిలో నొక్కపుత్రుఁడె ప్రకాశించుచుండును. తన కీర్త్యప కీర్తులు, తన కలిమిలేములు, తన పుణ్యాపాపములు ప్రపంచము లో తన కున్నదంతయుఁ దనపుత్రునకే యిచ్చిపోవును. అట్టి నా యేడ్వురు పిల్లలను నీపొట్టను బెట్టుకొంటివి. నాభవిష్యజ్జీవిత మంతయు దుఃఖములపాలు జేసితివి. శూన్యనైరాశ్యమున ముంచివైచితివి. ఔరా! వారు నీ కన్నులయెదుట స్వేచ్ఛగా నాడుకొనుచుండువారే? వారు నీ కేమి యపకృతిఁ గావించిరి?

నందు—కాత్యాయనా! నే నన్యాయ మొనరించితిని. ఘోరతరా న్యాయ మొనరించితిని. సహజముగా నే నంత పాపిని గాను. దుస్సాంగత్యదోషమే నన్నుఁ బాపిని జేసినది.

సీ॥ కలిమిలేములయందుఁ గల సుఖదుఃఖముల్
సమముగాఁ బాల్గొను సతి హితుండు
కష్టమ్ములం జిక్కి కాలుసేయాడని
తఱి నయమ్మును దెల్పు గురుఁడు హితుఁడు
మంచిచెడ్డ లెఱింగి మనుదారికైన స
త్పథముఁ జూపెడి మార్గదర్శి హితుఁడు
జీవనయాత్రలో జీవితనౌకను
గడపెడి చుక్కానికాఁడు హితుఁడు

గీ॥ అట్టిహితు, సద్గుణాఢ్యుఁ జేపట్టువాఁడు
దివ్యసుఖ మొందు విబుధసంభావ్యుఁ డగుచు
ఇఁక నతఁడె దుర్గుణుం డైన నేమి చెప్ప
నమితసంకటములఁ జిక్కి యంత మొందు.

దుష్టప్రేరితుఁడ నయి నే నొనరించిన దురన్యాయములకుఁ బశ్చాత్తాపమందుచుంటిని.

కాత్యా——మహారాజా ! ఇంత నిష్ఠురుఁడ వెట్లయితివి ! నీవు నాకనుల ముందర పుట్టి పెరిగితివి. నాచేతులతో ని న్నెత్తుకొని పెంచి పెద్దవానిని జేసితిని. ఇంత నిష్ఠురుఁడ వెట్లయితివి ?

నందు——బ్రాహ్మణోత్తమా ! నన్ను క్షమింపుము.

కాత్యా——పొమ్ము, నందా ! నిన్ను క్షమించితిని. కాని నే నీసంసారమును బరిత్యజించి సన్యాసి నయ్యెదను.

వాచా——మీా యీ ఉద్దేశం చాల ఉత్తమమైంది. జగడాలమారిది యీ ప్రపంచం. ఇటువంటి దానిలో ఉండటం అంత మంచిది కాదు. అయితే మేము విడిచిపెట్ట బద్దామా ?

కాత్యా——మిమ్ము వదలిపెట్టుటకు నా కధికారము లేదు. మిమ్ము వదలుమని చాణక్యమంత్రిని బలవంత పెట్టెదను.

నందు——ఆ బక్కచిక్కిన బడుగుబ్రాహ్మణుఁడు చాణక్యుఁడా, యిప్పుడు మంత్రి ?

కాత్యా——ఆతఁడు కేవలము మంత్రియే కాఁడు. మహారాజునకు గురువు కూడా.

నందు——శూద్రుఁ డగు చంద్రగుప్తుఁడు మహారాజు. సరే ! భిక్షుకుఁ డగు చాణక్యుఁడు మంత్రి. ఇఁక సేనాపతి యెవరు ?

కాత్యా——మలయరా జగు చంద్రకేతుఁడు.

నందు—చాల బాగుగ నున్నది. బ్రాహ్మణుడా! నీవిషయమై క్రూరమగు నత్యాచారము జరిపినమాట వాస్తవము. దానికయి నిన్ను క్షమాపణకోర వెనుక ముం దాడను, లజ్జింపను. కాని శూద్రుండగు చంద్రగుప్తుని జూచినను, శూద్రాణి యగు మురను జూచినను అఱకాలుమంట నెత్తి కెక్కును. ఇప్పుడు విముక్తుండ నయితినా?—

కాత్యా—మిమ్ము వదలు మని గట్టిగా వాదింతును.

వాచా—అయ్యా! మంత్రిమహాశయా! నావిషయమై కూడా కొంచెం గట్టిగా చెప్పండి దయయుంచి.

కాత్యా—వాచాలా! నీ విడుదలవిషయమై స్వయముగా నీవే మాటలాడ వచ్చును. మంత్రిచాణక్యుండు నిన్ను తీసికొనిరా నన్ను పంపెను.

వాచా—అయ్యో! దైవమా!

కాత్యా—నిన్ను తీసికొని వెళ్ళుటకే నేను వచ్చితిని?

నందు—వాచాలునితో ఆయన కేమి పని?

కాత్యా—అది నాకుం దెలియదు. వాచాలా! రమ్ము.

వాచా—అయ్యా! (ఏడ్చుచు) మహారాజా!

నందు—నే నిప్పు డేమి చేయంగలను? ఇప్పుడు నేను నీమాదిరిగానె యుంటిని పొమ్ము.

వాచా—అయ్యా! ఆయనను తలచుకొంటె శరీరమంతా కంపించుచున్నది. ఎట్లా ఆయన దగ్గరకు వెళ్లే దిక?

కాత్యా—రమ్ము, వాచాలా! నీకు వచ్చిన భయమేమి లేదు.

నందు—నష్టము కూడా యేమి లేదు.

కాత్యా—పద, నడువుము.

వాచా—మీరు పదుండి ముందు.

(కాత్యాయనుఁడు, వాచాలుఁడు నిష్క్రమింతురు)

నందు—ఈ దాసీపుత్రుఁడు నేఁడు మగధరాజ్యాధిపతి యయ్యెను—
ఇప్పుడు నేను విముక్తుఁడ నయితినా—

(మఱియొక కొట్టులోనికిఁ బోవును)

---

## తృతీయదృశ్యము

---

స్థానము — చాణక్యుని కుటీరములోని భాగము

సమయము — రాత్రి

చాణ—తిరిగి పోవుటా! ఎక్కడకు? నిర్వ్యాపారనిషేవణమునకా? లేక వైరాగ్యనిష్కుటమునకా? తిరిగి యెక్కడకు పోదును? ఎక్కడకును బోను? అవి యన్నియుఁ జెడి దుస్సహాముగ నున్నవి. వానికంటె నిదియే మంచిది. ఇందు ప్రతీకారతీవ్రజ్వాలలు కలవు. ఉత్తేజనోన్మాద మిందు కలదు. అధఃపతనలక్ష్య మిందు కలదు. దీనివలన స్వర్గము వచ్చినను సరియే; లేక నరకము వచ్చినను సరియే. విధాత నన్ను స్వర్గభ్రష్టుని జేసిన నరకము నకే పోదును. సర్వేశ్వరా! నన్ను నీపక్షమునకుఁ దీసికొనకున్న నీవిపక్షులతోఁ జేరి నిన్నెదుర్కొనెదను. నీవు చేయఁదలచినది చేయుము. తిరిగి పోను. ఎన్నటికిని తిరిగిపోను. ఓపిశాచినీ! నీయక్షయసౌందర్యముగ్ధుఁడ నగు నాపై నీపాపకవచనమును గప్పుము. ఆయన నన్నేమి చేయఁగలుగునో అప్పుడు చూచెదను. ఓఅదృశ్యమహాశక్తీ! నాకుఁ జేయూఁత నొసఁగుము. నేను నీ ప్రేమాస్పదుఁడను. నేను నీపాదదాసుఁడను. నీ యధర విషము నాని యమరుఁడ నయ్యెదను. నీ విషాక్తమగు నాశ్లేష

ణము గైకొని నరకమునకుఁ బోదును. ఓప్రేయసీ! నన్నుఁ దీసికొని పొమ్ము; ఇంకను దూరమునకు, ఇంకను దూరమునకు.
(వాచాలునితో కాత్యాయనుఁడు ప్రవేశించును)

చాణ—ఎవరు? కాత్యాయనా! వా రెవరు?

కాత్యా—నందుని బావమఱది, వాచాలుఁడు.

చాణ—అఁహా! అటులనా!

(వాచాలుఁడు సభక్తికముగా నమస్కరించును)

చాణ—అబ్బా! ఎంత గాఢభక్తి? నాఁడు నీవేకాదూ నాజుట్టు పట్టుకొని యీడ్చినది? జ్ఞాపక మున్నదా!

వాచా—ఎప్పుడు? లేదే! (వెనుకకు చూచును)

చాణ—ఊఁ హుఁ! జ్ఞాపకము లే దేమి? పాపము. బాగుగా జ్ఞాపకము చేసెదనులే. నందుని కుటుంబ మెక్కడ నున్నదో ముందు చెప్పుము.

వాచా—ఆసంగతి నాకుఁ దెలియదు

చాణ—(కోపముతో నేల తన్ని) నీకుఁ దెలియును. చెప్పుము.

వాచా—(భయపడుచు) ఆఁ అవును నాకు తెలియును.

చాణ—ఎక్కడ నున్నదో చెప్పుము?

వాచా—(వెనుకకుఁ దిరిగి చూచును)

చాణ—వెను కేమి చూచెదవు? నందుని కుటుంబ మెక్కడ నున్నది? నీ సోదరి పిల్లలు ఎక్కడ నున్నారు?

వాచా—మలయపర్వతమందు.

చాణ—(కోపముతో నేలను దన్ని) అక్కడ లేరు. కేవల మసత్యము.

వాచా—(భయముతో) అసత్యము.

చాణ—ఎక్కడున్నారో నిజము చెప్పుము. మంచి బహుమాన మిచ్చెదను. నందుని కుటుంబ మెక్కడ నున్నది?

వాచా—పుట్టింటికడ.

చాణ—కాత్యాయనా! ఇప్పుడే అచటికి సేనల నంపుము. అంతవఱకీతని కారాగారమున బంధింపుము. నందునికుటుంబము పట్టుబడిన నీతని వదలుదము. లేనియెడల ప్రాణదండనమే. పొమ్ము.

కాత్యా—వాచాలా! రమ్ము.

వాచా—ప్రా—ణ—దం—డ—న—మా!

చాణ—ఆఁ! అవును, వాచాలా!

వాచా—నాసోదరి అక్కడ లేదు.

చాణ—ఏమి వాచాలా! త్రాఁచుపాముతోఁ జెలగాట లాడుచున్నావు. జాగ్రత్త. నిజము చెప్పుము.

వాచా—ధర్మము తోఁడు.

చాణ—నిజము చెప్పుము. ఇదే ఆఖరు సారి నిన్నడుగుట. నందుని కుటుంబ మెక్కడున్నది?

వాచా—మంత్రిగృహమందు.

చాణ—(కొంచె మాలోచించి) ఇది సత్యము కావచ్చును. మంచిది చూచెదగాక! సేవకా! (సేవకుఁడు ప్రవేశించును) పొమ్ము, ఈతని బందిఖానాలో నుంచుము. ఈమాట నిజమైన నీతనివదలెదను. లేనియెడ మరణమే— తీసికొని పొమ్ము.

వాచా—నాకు చాల దప్పికగుచున్నది. కొంచెము దాహముయిప్పిచండీ.

చాణ—ఆకొట్టులోనికి తీసికొనిపోయి జలమిండు.

(సేవకుఁడు వాచాలుఁడు పోదురు)

చాణ—

గీ॥ పెరటిలోఁ గంపుగొట్టెడి పెంటయేని
పారిజాతమ్ము కిడు దివ్యసౌరభమ్ము
గడ్డితోఁగూడఁ గొండంతకార్యమగును
ధారుణిని వ్యర్థ మగు పదార్థమ్ము కలదె?

కాత్యాయనా! యేమి ఆలోచించుచుంటివి?

కాత్యా—ఏమి యాలోచించుచుంటినా? మనుష్యు లింత నీచులు కాఁగలరాయని యాలోచించుచుంటిని. అత్యాచారము, పరకీయహరణము, హత్య మొదలగునవి సహింపనగును గాని యీమాదిరి కృతఘ్నత అసహ్యము, అసహ్యము.

చాణ—మనుష్యుల యీకృతఘ్నతయే చాణక్యుని రాజనీతికి ప్రధానము. మనుష్యుల యీదుస్సహప్రవృత్తిచేతనే నేను కార్యము సాధింతును. మిత్రభేదము, సోదరకలహము, హింసోత్తేజనము, ఆక్రోద్దీపనము—యివియే చాణక్యుని రాజనీతులు. నవ్వుచు నవ్వుచు తడిగుడ్డతో గొంతుగోయుట, పయోవిషప్రయోగమునకు ముందు మృదుమధురాలాపమోహితులఁజేయుటయే రాజనీతి.

గీ॥ వజ్రమును గొట్ట వజ్రమే వలయునటుల
శత్రుల వంచింప శాఠ్యమే సలుపవలయుఁ
గాని నీతులతోఁ బని కాదు నిక్క—
మార్యచాణక్యనీతిసారాంశ మిదియ.

కాత్యా—చాణక్యా! నేను ప్రతిహింసాంధుఁడ నయితినికాని యీరాజనీతి మాత్రము నేను బాగుగ గ్రహింపఁజాలకుంటిని.

చాణ—నీ వన్నియుఁ జేయఁగలుగుదువు. నిన్ను పూర్తిగా విశ్వాసఘాతుకుని జేసి మఱి విడుతును. శాఠ్యవిద్యావిధానము నే నభ్యసించుచుంటిని. అదంతయు నీ కుపదేశించెదను.

కాత్యా—ఇది చాల అన్యాయము. "నిర్వాణో వాతే" అని పాణిని సూత్ర మొకటి కలదు. అనఁగా—

చాణ—మఱల పాణినియమా! ఇది యన్యాయ మని యెవ రందురో చెప్పుము.

కాత్యా—సమాజము.

చాణ—నేను దాని నొప్పుకొనను.

కాత్యా—వివేకవంతులు.

చాణ—వివేకవంతులా! వా రుత్త కుసంస్కారులు.

కాత్యా—ఈశ్వరుఁడు.

చాణ—ఈశ్వరుఁ డసలు లేనే లేఁడు.

కాత్యా—చాణక్యా! నీవు పర్వతశృంగాగ్రమున నిలఁబడితివి. పడఁగలవు.

చాణ—నేనే పడిన నక్షత్రములు రాలును. ప్రపంచమంతయుఁ గంపించును. ఇఁకఁ బొమ్ము. నేను నిద్రించెదను. సిద్ధపఱచుము.

కాత్యా—ఏమిటి?

చాణ—యూపస్తంభము, ఖడ్గము. బలిపశువువిషయమై నీ వేమి విచారింప నక్కఱలేదు. అది సిద్ధముగ నున్నది.

కాత్యా—నేను మీతోఁ జెప్పినది యేమి ఆలోచించితిరి? నందుని విముక్తుని జేసెదరా?

చాణ—వదలిపెట్టను, పొమ్ము. అన్నియు సిద్ధపఱచుము. ఇదిగో ఇటు చూడుము. నాప్రేయసి నవ్వుచున్నది, పొమ్ము.

(కాత్యాయనుఁడు విస్మయముతోఁ బోవును)

ఛాణ—ఓ అదృశ్యమహాశక్తీ! నన్ను చక్కఁగా లాగుకొని పోవుచున్నావు. కొట్టుకొని పోవుచున్నాను. ఈ నీ కుటిలదృష్టి, నీవికటహాసము, నీవక్రగతి, నీదుర్గంధనిశ్వాసము, నీమలినస్పర్శము నెంత మనోహరముగ నున్నవి! ఇవియన్నియు విడిచి పోవలయు నని యిచ్ఛగించుచుంటిని. ఓప్రేయసీ! నీ వెంత కుత్సితురాలవు? నిన్ను చూచినకొలఁది ముగ్ధుఁడ నగుచుంటిని. ఒక కృష్ణదావానలము చెలరేగి సమస్తజగత్సౌందర్యము మ్రింగుచున్నది. క్రూరవ్యాఘ్రము తనచేఁబడి చావనున్న మృగమును దీవ్రలోలుపదృష్టితోఁ జూచుచున్నది. ఆహా! ఎంతభీషణము! ఎంత మనోజ్ఞము!!

---

## చతుర్థదృశ్యము

---

స్థానము — చంద్రకేతుని గృహోద్యానము

సమయము — సంధ్య

ఛాయ—(స్వగతము) ఆహా! ఆ మోహనాకారుని నగు మొగముఁ గాంచి యెన్నియుగములైనది. మఱతుమన్నను మఱపునకు వచ్చుట లేదు.

శా॥ ఆమోమందము నాకనుంగవ బెడం గాతళ్కుఁ జెక్కుళ్ళతీ
రామైక్రొంజిగి యావెడందయురమా యాజానుబాహుద్వయం
బామాటాడెడునేఱు పేయువతి భ్రాంత్యావిద్ధగాఁజేసి త
త్ప్రేమాంభోనిధి ముంపకుండు హృదయోద్రేకంబు పెంపొందఁగన్.

ఔరా! సర్వకాలసర్వావస్థలయందును నావీరవరుని దివ్యసుందరవిగ్రహమే నాకన్నులయెదుట ప్రత్యక్ష మగుచుండును. ప్రపంచమందలి ప్రత్యణువునందును దచ్ఛృంగారమూర్తియే

గోచరించుచుండును. ఐంద్రజాలకుఁడవా యేమి? మనోనాథా! నీవు విశ్వరూపమును ధరించితివి. ఆఁ! అదె! నాహృదయ దైవతము సాక్షాత్కరించెను. (కొంచెము ముందున కేగి) ప్రాణేశ్వరా! రమ్ము, నాహృదయసింహాసన మధిష్ఠింపుము. నాప్రణయామృతార్ఘ్యపాద్యములఁ గైకొనుము. నావాక్కుసుమాంజలి స్వీకరింపుము. నీనామమంత్రోపాసకిని, నన్నను గ్రహింపుము. దాసిగాఁ బరిగ్రహింపుము. (అని ముందుకు పోయి యేమియుఁ గానక) ఆహా! ఎంత నిష్ఠురుఁడవు. కన్మొఱఁగిపోతివా? ప్రాణపతీ! నాయీ సంతప్తగాత్రివల్లిపై నీ శీతలదృక్ప్రవాహముఁ బఱఁగింపవా? ప్రేయసీ, యని నోరార నొకమాఱు పిలువవా? నీప్రేమయందు లీనమయి జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలయందును నీదివ్యమూర్తినే ధ్యానించుచు నన్య మెఱుఁగని దీనను, మాతాపితృహీనను, వంచింతువా? విలపింపఁజేతువా? ప్రియతమా! త్వదేకశరణ్య నగు నన్నా మోసగించుట? రమ్ము. నీకరుణార్ద్రదృష్టుల నన్నాశీర్వదింపుము. నీసాయుజ్య మొసంగుము.

ఆఁ! యిదేమి! మోహోన్మాదినయి నే నేమి చేయుచుంటిని? అంతయు కల్ల! అంతయు కల్ల! ఛాయా! అమరదుర్లభ మగు చింతామణినా నీ వక్కునఁ జేర్ప నెంచెదవు? శరత్కాలసంపూర్ణపూర్ణిమాచంద్రునా కౌఁగిలింప నెంచెదవు? నీయడియాస లుడుగుము. కేవల తత్సమాలోకమంద యానందింపుము. చిత్తశాంతి నందుము—అకటా! కోరి కోరి యీ దుర్భరదుఃఖము నే నేల వరించితిని? మఱవఁజాలనా! మఱవఁజాలనా! నా కనర్థమగు దానిని మఱవఁజాలనా!—లేదు, లేదు. ఎటుల మఱతును? నామనఃప్రమోదకు నెటుల మఱతును? నా ప్రాణాధికు ప్రాణము లుండ నెటుల మఱతును? ఆతని స్మరణ మంద నాయీ నీరసజీవితము పోయిన పోవును. సరసమగు

మరణ మబ్బును. ప్రాణబంధూ! నీసందర్శనభాగ్యము లభింప నిమ్ము. ప్రాణనాథా! ప్రాణనాథా!!

(చంద్రగుప్తుని ప్రవేశము)

చంద్రగుప్తుఁడు—ఛాయా!

ఛాయ—ఎవరు? మహారాజా!

చంద్ర—నీ సోదరుఁ డెక్కడ నున్నాఁడు?

ఛాయ—తెలియదు. చూచి వచ్చెదను. (పోఁ బోవును)

చంద్ర—ఛాయా! ఆగుము.

(ఛాయ స్థిరదృష్టితోఁ జంద్రగుప్తుని జూచుచుండును)

చంద్ర—యుద్ధానంతరము మఱల నిన్ను కలిసికొనఁ జాల నైతిని.

(ఛాయ మాటలాడ కుండును)

చంద్ర—ఛాయా! నీవు నాప్రాణముఁ గాపాడితివి.

(ఛాయ ఊరకుండును)

చంద్ర—దానికి నాకృతజ్ఞత తెలుపుట కైనను వ్యవధి చిక్కినది కాదు. ఛాయా! నీకు నేను చాల కృతజ్ఞుఁడను.

ఛాయ—ఇంతేనా?

చంద్ర—ప్రత్యుపకారపూర్వకముగ నీకు—

ఛాయ—దానికి నెంతమాత్ర మావశ్యకత లేదు. మహారాజా! మేము హీనుల మగు నడవిజాతివార మగుదుము. అయిన నుపకృతిని విక్రయింపము. మహాప్రవృత్తులలో మే మెన్నఁడు వ్యాపారము సేయము. నేను మహారాజుప్రాణమును గాపాడఁ గలిగితిని. ఈసౌభాగ్యమె పదివేలు. ఇంతకు మించిన ప్రతిఫలాపేక్ష లేదు.

చంద్ర—ఈ కిశోరహృదయమున నింత మహత్వమా! కాక—

ఛాయ—మహారాజా!

సీ॥ సాధుసంతతులను బాధించు ఘాతుక
జంతుల వేటాడి చంపుటయును
శరణాగతప్రాణపరిరక్షకై పోరఁ
బిరువీక ప్రాణ మర్పించుటయును
గలిగినదానినే కలియొ గంజియొ యున్న
దింత యభ్యాగతి కిచ్చుటయును
దుర్వ్యథార్తులవెతల్ దొలఁగించి యాదృతిఁ
జేయఁజాలినమేలు చేయుటయును

గీ॥ ప్రతిఫలాపేక్ష లేశమ్ము పరగకుండఁ
జిన్నతన మాది కొంత నేర్చితిమిగాని
మర్మనర్మోక్తి నొరులను మాయసేయు
టింతయును సభ్యజాతుల ట్లెఱుఁగ మార్య!

మీా సభ్యజాతులవలె ద్వ్యర్థిగా మాటలాడుట మాకుఁ దెలియదు. మామాటల కొక్కటే తిన్నని యర్థ ముండును. అందు కాకలుగాని, లేకలుగాని యుండవు.

చంద్ర—ఛాయా! నీ వొక సమస్యవు సుమా!

ఛాయ—నేను ప్రత్యుపకార మేమియుఁ గోరుటలేదు, మహారాజా!
(పోఁబోవును)

చంద్ర—ఆగుము, ఛాయా! ఒకమా టడిగెదను. నిర్మలహృదయమున నుపకార మొనర్చితివి. సరికాని తదుపకృతవ్యక్తిపై నింతయాదా సీన్య మేల వహించితివి? చంద్రకేతునితో నీవు భాషించునపుడు నేను వచ్చుట తటస్థించెనేని తుఱ్ఱున నవలకుం బాఱిపోదువు. ఇది చాలమాఱులు కనిపెట్టితిని. ఇంత యుదాసీనతయా? ఛాయా!

ఛాయ—(అస్ఫుటస్వరమున) ఉదాసీనతయా? (కొంచెము తలవంచుకొని యాఁగి) పర్వతాగ్రము నెక్కి సూర్యోదయ మెప్పుడైన

చూచితిరా మీరు? దిగంతవ్యాప్తము లగు బాలభానుని యరుణకిరణతరంగములు పర్వతశ్రేణులపై నర్తన మొనరు నాడుచుండుట, చూచితిరా మీరు?

చంద్ర—అవును, చూచితిని.

ఛాయ—మాజీవితము నట్టిదియే. మేఘశ్యామల మగు కోమలలతావల్లి యొకటి యావేగమున కంపించుచున్నది. పర్వతాగ్రా వైపు యూర్ధ్వదృష్టి కది లక్ష్య మెట్లు కాఁగలదు? మహారాజా!

చంద్ర—అందువలననే నిన్ను సరిగాఁ దెలియలేకుంటిని. అయినను మేఘ శ్యామలావరణమున స్వచ్ఛతరహృదయ మున్న దని గ్రహించితిని.

ఛాయ—నల్లనిదేహ మనక ఘనశ్యామలావరణ మనుట మహారాజ సౌజన్యమును దెలుపుచున్నది. కాని మేఘ మెంత నల్లగా నుండిన నంత సలిలసంభారపూర్ణ మగు నని మహారా తెలియుఁగాను గాక! తదంతరాళమున నెంతవిద్యుత్ప్రవాహము తాండవించు చున్నదియుఁ గనుఁగొనునుగాక! నాకు హృదయ మున్నదని యేనా మీకుఁ దెలిసినది? ఆహా! అది యెంత విశాలహృదయమో, అం దెట్టి తరంగములు అల్లకల్లోల మొనర్చుచున్నవో మీరు తెలిసికొనిన—

చంద్ర—ఇదికూడను సంభవమా? ఛాయా! నీవు నన్ను క్షమింపఁ జూచుంటివా? ఇదికూడను సంభవమా?

ఛాయ—ఇది యెందుకు సంభవము కాదు? మహారాజా! ఈశ్వరుఁడు కొంచెము మంచిఛాయ మీశరీరమున కనుగ్రహించెను. దీని కేనా మీ రింతగా గర్వపడుట?

గీ॥ వెలయు సుగుణమ్ములంగాక నలుపు తెలుపు
వర్ణసంపత్తి జనుఁడు సంభావ్యుఁ డగునె?

వాస్తవముఁ గప్పి కప్పుకై బ్రిమయ నేల?
పనసముషిణుల రుచు లెఱుంగనివె మనము?

నన్ను ప్రేమించుచుంటివా యని యడుగుచుంటిరా? లేదు, మహారాజా! మిమ్ము నే సేవగించుచుంటిని. భిక్షుకివలె మిమ్ము ప్రేమభిక్ష మడుగుకొందు ననుకొంటిరా? దయాధర్మభిక్షముగ మీ రిడు గుప్పెడు ప్రేమభిక్షమును చేసాఁచి గైకొందు ననుకొంటిరా? మహారాజా! ఇంత విద్వేషమా! నేను నల్లని యడ విజాతి యబల నయ్యును తాము మగధదేశాధీశులయినను మిమ్ము నే సేవగించుచుంటిని. (త్వరగాఁ బోవును)

చంద్రి—ఆశ్చర్య మాశ్చర్యము! అపుడు ప్రాణము రక్షించుట! ఇపు డేవగించుట! స్త్రీచరిత్ర మొక యపూర్వసమస్య, అగాధము, అగోచరము, అగమ్యము. చాల దినములకిందట సింధునదీ తీరమున, నలెగ్జాండరు సమక్షమందున గాంచిన మనోహర దృశ్యము స్మరణకు వచ్చుచున్నది. ఆహా! ఆ గ్రీకుబాలిక యెంతటి సౌందర్యరాశి!

సీ॥ విరియఁబారు గులాబివిరిఁబోలు ముఖమున
సౌజన్యశాంతిరసమ్ము లొలుక
వాలుకన్గోనల జాలువారెడి చూపు
సంభ్రమాద్భుతకృతజ్ఞతలు దెలుప
మించునిల్కడనించు మేనికొ్రంజిగిబిగిఁ
గరుణాశృంగారముల్ గడలుకొనఁగ
సీడలారెడు తళ్కు నిద్దంపుచెక్కుల
లజ్జానురాగముల్ లాస్యమాడ

గీ॥ నాడు శౌర్యోపకారబంధనవిముక్తు
లందు నాశ్చర్య మనుకంప మధికఖేద
మోదములఁ జూపు నాగ్రీకుముగుద నాటి
దివ్యరూపమ్ము మది నాటె తెమల దహహా!

ఆసుందరిలావణ్యమున కనుగుణముగ సుగుణమండితభా షిత యని కూడ విందును.

గీ॥ క్రమము రాగము గల యుషఃకాలమటుల
సహజసర్వాంగసౌందర్యసంపదలను
సరళభావంబు సౌమనస్యంబు గలియ
నెవని ముగ్ధునిజేయ దాయువతిమిన్న ?

ఆహా ! ఆమె సౌందర్య మెంత మనోహరము !—పోనీ—నాకీ దృశ్య మేల స్మరణకు వచ్చినది ? అది కేవల మొక మధుర స్వప్నము, మధురస్వప్నము.

(చంద్రకేతుఁడు ప్రవేశించును)

చంద్రకే—సోదరా ! బ్రాహ్మణాజ్ఞానుసారము నేటిరాత్రియే సంధుని బలి యిత్తురు.

చంద్రగు—(విస్మయముతో) అ దేమి ! బలి యిత్తురా ! బ్రాహ్మణుని యాజ్ఞవలననా ! నే నెవరిని ? మగధమహారాజు నగుదునా ? ఇంత కష్టము, ఇంత రక్తపాతము, చివరకు బ్రాహ్మణప్రభుత్వ హోమాగ్నిని వేల్చి ప్రజ్వలింపఁజేయుట కేనా పనికివచ్చినది ? చంద్రకేతూ !

చంద్రకే—ఏమి సోదరా !

చం॥గు—మరణదండనము జరుగనేరదు. ఆజ్ఞాపత్రిక నిచ్చెదను. కొని పొమ్ము. ఇది ప్రార్థన కాదు. చంద్రగుప్త మహారాజు నాజ్ఞ యని చెప్పుము. పొమ్ము.

(చంద్రకేతుని ప్రస్థానము)

చం॥గు—ఇంత సహసమా బ్రాహ్మణునికి ? నా అనుమతి పొందలేదు. నాతో నాలోచింపనైన లేదు. ఎంత సాహసము ! ఔరా ? ఈ సామ్రాజ్యమునకు నే నేమియుఁ గాను. కేవలము చాణక్యుని చేతి కీలుబొమ్మను.

(ఛాయ ప్రవేశించును)

ఛాయ—మహారాజా! క్షమింపుము.

చం॥గు—క్షమించుట కేమున్నది? ఛాయా!

ఛాయ—నేను కొంచెము తొందరపడితిని. అపరాధ మయినది. క్షమింపుము. క్షమింపనియెడ మరణదండన విధించుము.

చం॥గు—ఎందుకు? నీ వేయపరాధమును జేయలేదు. నీవు నిజముగా నన్నేవగించుచుంటివి గనుక తెలిపితివి. ఇందు దోష మే మున్నది?

ఛాయ—ఏవగింతునా? ఎవరిని నాజాగ్రదవస్థయందు సదా ధ్యానించుచు, నిద్రావస్థయందు మధురస్వప్నములఁ గందునో; ఎవరిని ఇహమునఁ బెన్నిధియనియుఁ, బరమున స్వర్గమనియుఁ దలఁచుచుంటినో; ఎవరి సందర్శనము నాకు పవిత్రతీర్థమో; ఎవరి దర్శనాభావ మభిశాపమో అట్టివారినా యేవగించుట? కాదు. ఇచ్ఛగింతును—ఏవగింపఁగలిగిన—

చం॥గు—ఎందుకు ఛాయా! నే నేమి చేసితిని?

ఛాయ—ఏమి చేసితి నని యడుగుచుంటిరా? ఏమి చేయలేదని యడుగుఁడు. ఆఁకలిదప్పులు లేకుండఁ జేసితిరి. కంటికి నిద్ర యనుమాట లేకుండఁ జేసితిరి. నామనశ్శాంతిని బాడుజేసితిరి. నాదృష్టి కీజగత్తునే కనబడకుండఁ జేసితిరి. నేను స్వర్గమం దున్నదియు, నరకమందున్నదియుఁ దెలియకుండఁ జేసితిరి. ఇం కేమి చేయవలయును? ఇదిగాక పైఁగా నే నేమి చేసితి నని యడుగుటా? నిష్ఠురుఁడా!

చంద్ర—ఛాయా! (ప్రేమపూర్వకముగఁ జేయి పట్టుకొనును)

ఛాయ—వలదు. స్పృశింపవలదు, స్పృశింపవలదు. ఈనీకరస్పర్శము వలన నాశరీరమంతయు విద్యుత్ప్రవాహము ప్రవహించి, మస్తిష్కమును గలఁతపెట్టును. నే నీ యున్మాదము సడంచుకొనెదను. (త్వరగాఁ బోవును)

చంద్రి—ఏమి యాశ్చర్యము? ఇన్నిదినములనుండియు నే నీపెను సహోదరిగాఁ బ్రేమించుచుంటిని. ఆశ్చర్యము! ఆశ్చర్యము!!



## పంచమ దృశ్యము.



[చాణక్యుఁడు అతని అంగరక్షకులు. దగ్గర బందిగానున్న నందుఁడు. చెంత ఖడ్గము. కొంచెము దూరమున యూపస్తంభము]

చాణ—వీరేనా, నందమహారాజుగారు? రాజ్యభ్రష్టులయిరి కాబోలు! పాపము! బ్రాహ్మణుని ప్రతాపాగ్ని యిప్పటికిని జల్లారలే దని తెలిసికొంటిరా? పరమేశ్వరుఁడు మూర్ఖుఁడయి కాదు దోర్దండములపయి యుక్తాయుక్తవిచక్షణదక్షమగు మస్తిష్కము నుంచినాఁడు. ఆర్యఋషీంద్రులు మూర్ఖులయికాదు క్షత్రియుల శాసించుటకు బ్రాహ్మణుల నెలకొల్పిరి. బ్రాహ్మణుల నవనతులం జేయ నెవరికిని సామర్థ్యము లేదు. భారతఖండ మెంత కాలము భారతఖండముగ నుండునో యంతకాల మీసమాజమును బ్రాహ్మణులు శాసించుచునే యుందురు. అటుపిమ్మట సర్వము ఒక్కసారిగా నష్టమయి భ్రష్టమయి మఱిపోవును.

నందు—నీప్రగల్భాలాపములు వినిపించుటకా నన్ను పిలిపించినది.

చాణ—కాదు. అందుకుఁగాదు. ఈఖడ్గమును చూచుచుంటివా? ఈ యూపస్తంభమును వీక్షించుచుంటివా? ఎందుకు నిన్నిచ్చటికి తీసికొనివచ్చినది యిప్పుడైన తెలిసినదా? నీరక్తరంజితమగు చేతులతోఁగాని యీశీర్ణకుంతలముల ముడువ నని నాఁడు నేను ప్రతిజ్ఞచేసినది జ్ఞాపకమున్నదా! ఇదిగో చూడుము. ఇప్పటికిని ముడివైచుకొనలేదు. నీ వెందుకుఁ దీసికొని రాఁబడితివో యిప్పటికిని దెలియలేదా?

నందు—నన్ను వధించెదవా ?

చాణ—అవశ్యము.

నందు—నిరాయుధుఁడ నగు నాపై దీని హత్యచేయుటా ? ఇదియేనా నీ సనాతనధర్మము ?

చాణ—(నవ్వుచు)

సీ॥ ముకుపచ్చలారని ముద్దుబాలుర కొక్క-
గుర్రెక్కఁడు గంజీక కూల్చునాఁడు
పెంచినవిశ్వాస మించుకైనను లేక
మురఁ గొల్వులో నీడ్చి మురియునాఁడు
న్యాయార్థి నగుచు విన్నపముఁ జేసెడినన్నుఁ
గ్రించుదనాన గెంటించునాఁడు
పౌరులద్రవ్యముల్ పాపభీతియు దైవ
భీతియులేక దోపించునాఁడు

గీ॥ ఈసనాతధర్మమ్ము లెచటి కేగె ?
మఱచినాఁడవె యధికారమదముచేత ?
నొరుల కుపదేశమొనరింప నుపకరించు
ధర్మపన్నాలు తనపట్ల తగవు నిజము.

ఆహా ! ఏమి ! నేఁడు బ్రాహ్మణుఁడు ధర్మాధర్మమర్మములు క్షత్రియునికడ నేర్చికొనవలసివచ్చెనుగా ? నందమహారాజా ! వినుము. ఇది హత్య కాదు. మరణదండనము. విధించినది నేను, బ్రాహ్మణుఁడను.

నందు—ఏ యపరాధమునకు ?

చాణ—ఏ యపరాధమునకా ? బ్రాహ్మణహత్యాపరాధమునకు. బ్రాహ్మణసంపదపహరణాపరాధమునకు. బ్రాహ్మణపరీభావాపరాధమునకు. తెలిసినదా? నీవు దీనిని హత్య యందువా? కాదు,

హత్య కాదు. న్యాయవిచారణానంతరము విధించిన మరణదండ నము. నందా! న్యాయవిచారణమునకు నా కధికార మున్నది. నేను బ్రాహ్మణుఁడను. సిద్ధముగా నుండుము. సైనికులారా! ఈతని యూప స్తంభమునకు బంధింపుఁడు.

నందు—చాణక్యా! కాత్యాయనుని యెడను, నీయెడను అవిచారముగ నే నన్యాయ మొనరించినది వాస్తవము. క్షమింపుము.

చాణ—(బిగ్గరగా నవ్వుచు) నిజమయినది, నిజమయినది. నే చెప్పినదం తయు నిజమయినది. ఒక్కయక్షరమైనను బొల్లుపోకుండ నంత యు నిజమయినది. నందా! నే నిటులనే జరుగఁగల దని చెప్పిన నాటిమాట జ్ఞాపక మున్నదా? ఈభిక్షుకునికాళ్లపైఁ బడి క్షమా భిక్ష కోరెద వనియు అది నే ననుగ్రహింపననియుఁ దెలిపినది నీకు జ్ఞాపకమున్నదా?

నందు—బ్రాహ్మణుఁడా! నిన్ను ప్రాణభిక్ష యాచించుట లేదు. నేను క్షత్రియుఁడను. బ్రాహ్మణప్రభుత్వము నేను గణింపను. శూ ద్రిని గర్హించుచున్నాను. విశేషించి నాతండ్రిగణికాపుత్రుని గర్హించుచున్నాను. నాకు మృత్యుభయము లేదు. నీక్రోధా రుణనేత్రములు నేను లెక్కచేయను. కాని నీయన్యాయమును గూర్చి విచారించుచున్నాను. ప్రజాసంపత్తి కొల్లగొట్టునంత దుర్మార్గుఁడను గాను. నరహత్యఁ జేయునంత పాతకిని గాను.

గీ॥ రసము పొత్తుండి చెడు సువర్ణంబుభాతి
దుష్టులంగూడి నేనును దోషినైతి
చెప్పరానట్టి చెడుగులఁ జేసి చేసి
ఫల మనుభవించుచుంటి నిప్పగిది నకట!

సాంగత్యదోషమే న న్నింత పాపినిగా నొనర్చినది. క్షమింపుము, కాత్యాయనా!

కాత్యా—నందమహారాజా! నేను క్షమించితిని.

చాణ—జాగ్రత్త! కాత్యాయనా! క్షమింపలేవు. ఈప్రపంచమున నెవరు నెవరిని క్షమింపలేరు. క్షమింపఁజాలరుకూడ. తటతటకొట్టు కొను నీదుర్బలహృదయమును నీవేడికన్నీరు సరిచేసినదా; ఇది యెన్నటికిని గాఁజాలదు. క్షమ కేవలము వాచికము. పశ్చా త్తాపము వాచిక మెటులో అటులనే క్షమకూడను వాచికమే. దండనావసరమునఁ బశ్చాత్తాప మందనివాని నింతవఱకును జూడలేదు. ఒకసారి పాడయిన మానసము క్షమాపణచే నెన్న టికిని జక్కఁబడదు. చక్కఁబడినటుల నే నెన్నఁడును జూడలేదు. ఇది యెన్నటికిని జరుగఁజాలదు.

కాత్యా—కాని నందునకుఁ జిన్నతనము.

చాణ—నందునకుఁ జిన్నతనమా? నీకును జిన్నతనమే. పాపము.

గీ॥ చిన్నవాఁడైనఁ దిన్నగా నున్నఁగాక
చిన్నతనమునఁ బెద్దాట చేటుగాదె!
కాలు తెలుఁగక బాలుండు కరము నిడిన
నగ్ని తనవిధి నెఱప వెనుకాడు నొక్కొ!

కాత్యా—అయినను పాణిని—

చాణ—(గట్టిగా భూమిని దన్ని) మఱల పాణినియా? ఇప్పుడు నీపా ణినిమాట తలపెట్టితివా ముందు నిన్ను హత్య చేసెదను.

కాత్యా—నందుఁడు పసికాయ.

చాణ—అదే యనుకొనుచున్నాను. ఖడ్గము నెత్తుము. కాత్యాయనా! నీవే నీచేతితోడనే యీతని వధింపవలయు.

కాత్యా—నేనా!

చాణ—అవును నీవే. పుత్రహత్యకు బదులు తీర్చుకొనుము. కాత్యా యనా! నీపుత్రులశిథిలపాండురశరీరముల నొకసారి తలఁచి కొనుము. వారు అన్నమునకయి క్షీణస్వరమున నాక్రోశించుట నొకసారి చెవియొగ్గి వినుము. వారల సంజ్ఞాహీన మగు నిష్ప్రి

భాదృష్టి నొకసారి విలోకింపుము. కలువకాడనట్టి [illegible] కట్టివారిన వారి చైతన్యహీన మగు దేహము[illegible] వీక్షింపుము. వారల నిష్పంద నిర్నిమేష నేత్ర[illegible] మృత్యుకరాళముద్రాంకణముల నొకసారి జ్ఞప్తికి దెచ్చు[illegible]ము. ఆమృత్యువే యిప్పుడు నీయెదుట తాండవించు [illegible] నూహింపుము. కాత్యాయనా! వారలకుం [illegible] నొక్కమాఱు ఇవన్నియు గణింపుము. ప్రతీకారము [illegible]ము. (కాత్యాయనుఁడు ఖడ్గము ధరించును) ఇంక కాలవిలంబన [illegible] సైనికులారా! ఈతని యూపస్తంభమునకు బంధింపుఁడు.

(సైనికులు బంధింతురు)

చాణ—భ్రష్టమహారాజా!—కాత్యాయనా!—

(కాత్యాయనుఁడు ఖడ్గము ధరించి చెంతకుఁ బోవును)

చాణ—నందమహారాజా! ఇది బ్రాహ్మణోచితకృత్యము కాదు, కాని యేమి చేయుదును? నేఁడు దీనియవసరము వచ్చినది. తప్పి నది కాదు. ఇప్పటిబ్రాహ్మణున కా తపోబలము లేదు. రెండవ పరశురామునివలె భారతఖండము నిఃక్షాత్రము చేయవలయు నని కోరిక యున్నది. కపిలమహామునివలె క్రోధారుణదృష్టి నంద వంశోన్మూలనము చేయవలె నని యున్నది. కాని యీపాపకలి యుగమున నది జరుగనేరదు. అందుకే యిప్పు డీఖడ్గసహాయము కావలసివచ్చినది. ఇప్పుడు ఈ పాపభూయిష్ఠ మగు కలియుగ మందును భారతవర్ష మొకసారి బ్రాహ్మణప్రతాపము చూచు నుగాక—వధింపుము, కాత్యాయనా! ఆఁ! ఆగుము. చనిపోవు టకుఁ బూర్వ మీమాట వినుము. మహారాజా! నీ కిన్నినీళ్లు విడు చువారుకాని, నీతలక్రింద కొఱివి నిడువారుకాని నీవంశమం దొక్క రును లేరు. నందవంశము నిర్మూలమైనది.

(నందుఁడు ఆర్తనాదము చేయును)

చాణ—ఇఁక వధింపుము.

(కాత్యాయనుఁడు కత్తి నెత్తును)

(చంద్రకేతుఁడు త్వరగాఁ బ్రవేశించును)

చం॥ కే—జాగ్రత్త, భూసురా! ఖడ్గము దింపుము.

చాణ—ఎందుకు? చంద్రకేతూ!

చం॥ కే—రాజాజ్ఞ.

(కాత్యాయనుఁడు కత్తి దింపును)

చాణ—దీని కర్థ మేమి? చంద్రకేతూ!

చం॥ కే—ఇదె చంద్రగుప్తసార్వభౌముని క్షమాపత్రము! త్రైకోనుఁడు. మహారాజు నందుని విముక్తుని జేసెను.

చాణ—చంద్రగుప్తమహారాజు నాజ్ఞయా! అది మాయందు వర్తిం పదు—వధింపుము.

చం॥ కే—కాని గురుదేవా! ఇది భూపాలు నాజ్ఞ.

చాణ—ఇది భూదేవునియాజ్ఞ.—వధింపుము, కాత్యాయనా!

చం॥ కే—అయిన మహారాజు స్వయముగ విచ్చేయును. వారురాక పూర్వము వధింపనీయను. రాజాజ్ఞను బాలించెదను. సైనికు లారా! దూరముగ నుండుఁడు.

చాణ—ఎప్పటికిని గాదు. అటనే నిలఁబడుఁడు.

చం॥ కే—వీరబలా!

(వీరబలుఁడు అయిదుగురు సైనికులతోఁ బ్రవేశించును)

చం॥ కే—సైనికులారా! మహారాజు వచ్చుపర్యంత మీాఖై దీని రక్షిం పుఁడు. వీరబలా! మహారాజున కీవృత్తాంతము నెఱిఁగింపుము.

(వీరబలుఁడు పోవును)

చాణ—కరమున కరవాలముఁ గీలించి యోజించుచు గ్రుడ్లప్పఁజెకి చూచుచుంటి వేమి? కాత్యాయనా! రాతిబొమ్మలా గున్నావు. తెమ్ము, ఖడ్గము నా కిమ్ము. (ముందుకుఁ బోవును)

చం॥ కే—(ప్రక్కగాపోయి మోకరిలి, ఖడ్గముతో దారి నరికట్టును) నేను బ్రాహ్మణునకు సదా విధేయుఁడను. కాని రాజాజ్ఞను బాలించెదను.

చాణ—వధింపుము, కాత్యాయనా!

(కాత్యాయనుఁడు కత్తి నెత్తును)

చం॥ కే—(రాజాజ్ఞాపత్రిక చూపించుచు) రాజాజ్ఞ

(కాత్యాయనుఁడు ఖడ్గము దింపును)

చాణ—చింత యిసుమంతయు లేదు. కాత్యాయనా! ఏ బ్రాహ్మణుఁడు చంద్రగుప్తుని సింహాసనాధిష్ఠితుని జేసెనో యాతఁడే సింహాసనచ్యుతుని గూడ జేయ సమర్థుఁడు. చింతింపకుము. వధింపుము.

చం॥ కే—జాగ్రత్త! ఇప్పుడు బ్రహ్మహత్య చేయవలసివచ్చినను వెనుదీయను.

(మందిరమునుండి మురు ప్రవేశించుచు)

మురు—మఱి స్త్రీహత్య కావలసిన యెడ?

(కాత్యాయన చంద్రకేతులమధ్య నిలఁబడును)

చం॥ కే—(నిర్విణ్ణుఁ డయి) అమ్మా! మీరా?

మురు—అవును. నేనే, నాయాజ్ఞ.—వధింపుము.

చం॥ కే—అమ్మా! నందుని క్షమింపుము.

మురు—(వ్యంగ్యహాస మొనర్చి) క్షమింపవలయునా? నేను క్షమింపఁజాలను. నేను క్షమించుట యెఱుఁగనే యెఱుఁగను.

ఎట్లుఱుంగుదును? నేను శూద్రాణిని. క్షమ బ్రాహ్మణధర్మము; శూద్రునిది కాదు.

చం॥ కే.—అమ్మా! క్షమ సర్వమానవధర్మము. కేవల మొక్క బ్రాహ్మణులదే కాదు. క్షమించుటయం దేయపారసుఖ మున్నదో యదియంతయు చూఱఁగొన నొక బ్రాహ్మణునకే యధికారము కలదా? తల్లీ! ఆ క్షమ స్వర్గమునుండి భాగీరథీపావనజలధారా సందోహమువలె ప్రపంచమున కవతరించినది. అందఱకు నీ పుణ్యతరంగిణీతరంగముల నోలలాడి పవిత్రులగుటకు సమానాధికార మున్నది. సర్వేశ్వరుని క్షమాశక్తి దివినుండి శతధా మర్త్యలోకమున కవతరించుట లేదా? తల్లీ! వ్యాధియం దీక్షమయే స్వాస్థ్యరూపిణి యయి మనల రక్షించును. శోకమం దీక్షమయే విస్మృతిరూపము ధరించును. దారిద్ర్యమునం దీక్షమయే సహిష్ణుతారూపమునఁ బొడసూపి ముద మాపాదించును. పిల్లలు బాల్యచాపలమునఁ జేయు నపరాధసహస్రముల తల్లి క్షమింపని యెడ సంతానమునకు బ్రతుకు తెఱవుకలదా? తల్లీ! ఈతని క్షమింపుము. నీపాదములం బడి క్షమాపణ వేడికొందును.

(సాగిలఁబడును)

ముర—చంద్రకేతూ! నీ వొకఁడవే క్షమాపణకోరుచుంటి వనుకొంటివా? నాపంచప్రాణములు నీహృదయపంజరద్వారమును భేదించుకొని వచ్చి కాళ్లపైఁబడి క్షమాభిక్ష మడుగుచుండుట లేదా? నందుని ఈనిర్బంధనావస్థలోఁ గాంచుచుంటిని. వాడిన యాతని కోమలముఖమును వంచుకొనియుండఁ జూచుచుంటిని. అయినను కన్నీరు క్రమ్ముకొని దృష్టిపథము నవరోధించుట లేదు. నందా! శూద్రాణిపాలు క్షత్రియాణిపాలకంటె తక్కువ మధురములా? శూద్రాణియనురాగము క్షత్రియాణియనురాగముకంటె తక్కువ పరిశుద్ధమా? క్షమింపను. నేను క్షమింపను. నేను శూద్రాణిని. నేను గణికను. నందా!

సీ॥ కన్నబిడ్డనికన్న మిన్నగాంచినతల్లిఁ
బరిహాసించిన నాటి పాపఫలము
శూద్రాణి యని నన్నుఁ జుల్కనగాఁ జూచి
దుర్భాషలాడిన దోషఫలము
అనురాగమున నిన్ను నాదరించిన యన్న
వెడలఁగొట్టించు దుర్వృత్తిఫలము
సహజభీరువులైన సాధ్వీమతల్లుర
బలిమిమైఁబట్టిన పాపఫలము
గీ॥ మధురమధురసద్వగుణతోన్మత్తరాజ్య
గర్వమునఁ గన్నుఁగాన కకారణముగఁ
బ్రజల హింసించినట్టి దుష్కర్మఫలము
ననుభవింపుము ప్రభుదుర్నయంబు లడఁగ!

వధింపుము.

చం॥ కే—కాని తల్లీ! ఇది రాజాజ్ఞ.

ముర—అయితే ఇది రాజమాతాజ్ఞ. నేను దాసిని, గణికను అయి నను మహారాజు చంద్రగుప్తుని తల్లిని. ఇది నాయాజ్ఞ— వధింపుము.

చం॥ కే—సరి. ఇఁక నే నోడితిని. సర్వకాలసర్వావస్థలయందును నేను స్త్రీలకుఁ బరాజితుఁడను. అబలల కాలిగోటిని స్పృశించుటకును నాకు శక్తిచాలదు.

చాణ—వధింపుము, కాత్యాయనా!

(కాత్యాయనుఁడు కత్తివిసరును నందునిశిరము తెగిపడును)

చాణ—ఆహా! ప్రతిహింస పూర్తియయినది. ప్రతిజ్ఞ నెఱవేరినది. (నందుని రక్తముతో చేతులు తడుపుకొని జుట్టు ముడివేసికొని పోవును)

కాత్యా——(నందునిశిరముఁ బైకెత్తి) నాయేఁగురుపిల్లల హత్యచేసినదాని కిదె ప్రతిఫలము.

ముర——ఆఁ ఆఁ! ఏమిచేసితివి? వధించితివా? ఏమిచేసితిని? నే నేమి చేసితిని? ఈతని రక్షించుటకు వచ్చితిని.

(చేతులతో ముఖముఁగప్పుకొని యేడ్చును)

(చంద్రగుప్తుఁడు ప్రవేశించును)

చంద్రగుప్తుఁడు——(నందుని శిరముఁజూచి వెనుకకుఁ దగ్గి) ఇ దేమిటి?

ముర——ఆతఁడు నందుని వధించినాఁడు. ఆహా! ఈతనినేకద నా స్తన్యముల నిడి ప్రోదిచేసినది. ఈశరీరమునే ఈకోమలశరీరమునే కద నా హృదయమునం దిమిడ్చుకొని నిద్రపుచ్చినది. అయ్యో! అయ్యో! ఏమిచేసితిని! ఏమిచేసితిని! నాయనా! చంద్రగుప్తా!

చం॥గు——ఎవరు వధించినది?

కాత్యా——నేను.

చం॥గు——ఎవరియాజ్ఞ వలన?

ముర——నాయాజ్ఞ వలన——అరే! బ్రాహ్మణుఁడా? నే నబలను, మూర్ఖురాలను, దుర్బలను, జ్ఞానహీనను, కాని భూసురాధమా! నీ వేమి చేసితివి? ఎన్నిమాఱు లీతని ముద్దుమొగము నెత్తి ముద్దాడికొంటివి. అంతయు మఱచి యిప్పు డీ ఘోరపైశాచికోల్లాసమున తెగిన శిరమును జేనిడుకొని నిలఁబడితివా?

(కాత్యాయనుని చేతినుండి శిరము జారిపడును)

చం॥గు——బ్రాహ్మణుఁడా! రాజాజ్ఞ వేళాకోళ మనుకొంటివా? అవహేళన మొనర్చెదవా?

కాత్యా——ఒనరించితిని.

చం॥గు—బ్రాహ్మణుఁ డవధ్యుఁడు. పొమ్ము, నారాజ్యమునుండి పొమ్ము. నిన్ను బహిష్కరించితిని!

కాత్యా—మహారాజా!—

చం॥గు—వినను పొమ్ము. రాజాజ్ఞ భిక్షుకుని ప్రార్థన కా దని యిప్పుడైనఁ దెలిసికొమ్ము. పొమ్ము. నీది కన్నచోటికిఁ బొమ్ము.

(కాత్యాయనుఁడు పోవును)

చం॥గు—చంద్రకేతూ!

చం॥కే—ఈప్రపంచమున లక్షోపలక్షలుగ విపక్షులు రాజశాసనోల్లంఘనమునకయి విచ్చుకత్తులతో నిలఁబడిన నిలఁబడుదురుగాక! ఈచంద్రకేతుఁడు రాజాజ్ఞాపాలనమునఁ బ్రాణ మర్పించును. కాని స్త్రీసమ్ముఖమున శిశువుకంటెను దుర్బలుఁడు.

చం॥గు—నీవో? తల్లీ!

ముర—నా యపరాధమునకు నన్ను దండింపుము, కుమారా!

చం॥గు—నీయపరాధమా తల్లీ! (మోకరిలి) జనని యపరాధము సంతతి ముందఱనా? నీ వేమి చేసినను సదా నాకు జననివే. 'జననీ జన్మభూమిశ్చ స్వర్గా దపి గరీయసీ' (ఒకచేయి నందునివైపు సాచి రెండవచేతితో ముఖమును గప్పుకొని నిష్క్రమించును)





# చంద్రగుప్త

## చతుర్థాంకము

### ప్రథమదృశ్యము

స్థానము—చాణక్యుని కుటీరమున గది

సమయము—సాయంత్రము

[చాణక్యుఁడు ఒంటరిగ నుండును]

చాణక్యుఁడు—(స్వగతము) ప్రతిహింస పూర్తియయినది. కాని అది యొకక్షణికోన్మాదము. ఇప్పుడు మఱల నదే విషాదము వెన్నాడి నన్నాక్రమించుచున్నది. బాహ్యప్రపంచమున వాద్యధ్వను లంతరించినను హృదయాంతరాళమునమాత్రము ఎప్పటి హాహాకారము, ఎప్పటి ఆందోళనము వినఁబడుచునే యున్నది. ఈ ప్రపంచమున నాప్రేమకుఁ బాత్రు లెవ్వరును లేరు ప్రకంపితావేగమున నెవరినో మక్కువతో నక్కునఁ జేర్చికొన హృదయము తహతహపడుచున్నది. కాని లక్ష్య మగు వ్యక్తిలేమి వేడి నిట్టూర్పుతో నంతమగుచున్నది. ఓసీ! రాక్షసీ! ఏమి చేసితివి? ఇక్కడ నేమి చేసితివి?—ఇది కేవలము అరణ్యరోదనము, కంకాళకరాఘాతము.

(ప్రథమగూఢచారి ప్రవేశించును)

చాణ—ఏమి సమాచారము?

చారుఁడు—కాత్యాయనుఁడు శత్రుశిబిరమం దున్నమాట వాస్తవము.

చాణ—ఇం కేమైన?

చారు—గ్రీకులు సింధునదిని దాటిరి.

చాణ—వారల సేనాపరిమితి?

చారు—నాలుగులక్షలు.

చాణ—మంచిది పొమ్ము. (గూఢచారుఁడు పోవును) కాత్యాయనా! నీరోజులన్నియు నొకేవిధమునఁ గడచుచున్నవి. రాజ్యబహిష్కరణానంతరము అధ్యాపనము సేయ స్థిరముగ సంకల్పించుకొంటివి. కాని సెల్యూకసు నిన్ను విడువఁడు. తన యిష్టమువచ్చినటులెల్ల నిన్నుఁ ద్రిప్పఁ జూచును. అటులే నీవును దిరిగెదవు. ఇం దెక్కువ విశేష మేమన నా మంత్రిత్వమునకు నీవు ఈర్ష్య వహించితివి, మూర్ఖుఁడా!

(ద్వితీయగుప్తచారుఁడు ప్రవేశించును)

చాణ—సమాచార మేమి?

చారు—విప్లవకారులందఱు నొకదళముగాఁ జేరిరి. మూఁడుసారులు తూర్యధ్వని చేయుట వారిసంకేతము.

చాణ—ఇం కేమైన?

చారు—మహారాజు శయనాగారమునకు సొరంగము త్రవ్వి, ఇరువదియైదుగురు ఘాతుకు లందు దాగుకొనిరి. మహారాజురాక నిరీక్షించుచుండిరి.

చాణ—ఈసంగతి నా కిదివఱకే తెలియును. వారలసేనాపతి యెవరు?

చారు—వాచాలుఁడు.

చాణ—మంచిది పొమ్ము. (చారుఁడు పోవును) మూర్ఖాగ్రేసరా! వాచాలా!—వీరబలా!

(సేనాధ్యక్షుఁడు వీరబలుఁడు ప్రవేశించును)

వీర—స్వామీ! యేమి ఆజ్ఞ?

చాణ—చంద్రగుప్తునిశయనాగారమునకు సొరంగము త్రవ్వి ఇరువది యైదుగురు ఘాతుకు లందు దాగుకొనిరి. సేనతోఁ బోయి వారల వధింపుము.

వీర—చిత్తము.

చాణ—ఇప్పుడే పొమ్ము.

వీర—చిత్తము. (ప్రస్థానము)

చాణ—ఆహా! శత్రుసమాచారములు దొంగిలించుటకూడ నద్భుతమే. ఇది కేవలము చాణక్యుని సృష్టి. శ్రీరామచంద్రుల వారు గుప్తచారుల నుంచి రనుట సత్యము కాని వా రుంచినది తమ మంచిచెడుగుల గుర్తించుటకే. ఇఁక నేనో ఇతరులదోషములఁ గనిపెట్టుటకే గుప్తచారుల నుంచితిని.

(చంద్రకేతుని ప్రవేశము)

చం॥కే—నన్ను ర మ్మని కబురంపితిరా? గురువరా!

చాణ—అవును, చంద్రకేతూ! దాక్షిణాత్యుల జయించి చంద్రగుప్తుఁడీరాత్రికి తిరిగివచ్చును. ఈ సంగతి నీకుఁ దెలిసినదేకద!

చం॥కే—తెలియును, గురుదేవా! అందులకే నగరమంతయు నుత్సవములు చేయ నాజ్ఞ నిడితిని.

చాణ—అయితే ఉత్సవములకు నేర్పాటులఁ జేసితివా?

చం॥కే—చిత్రవిచిత్రదీపములు నగరమంతయు వెలిగింపఁబడును. ప్రతి యింటను శంఖధ్వానము మాఱుమ్రోఁగును. సందుసందునను మంగళవాద్యములు భోరుకొనును. ఇంక—

చాణ—ఏమియు నక్కఅలేదు. ఈయేర్పాటులన్నియు వ్యర్థములు— ఏమి! ఏకదీక్షగా నావైపు వీక్షించుచున్నావు. పొమ్ము, ఉత్సవముల నాపుము. పొమ్ము.

చం॥ కే—ఇది యేమి గురుదేవా?

చాణ—పొమ్ము. (చంద్రకేతుఁడు శంకితహృదయముతోఁ బోవును) ఆహా! ఆపవిత్రోజ్జ్వలమహారాజ్యము వీడి నే నెక్కడికిఁ బోవుచున్నాను. ఇప్పటికిని దత్సురుచిరశిఖర మగుపించుచునే యున్నది. అదియంతయు గాఢాంధకారమున లీనమగుటకు మున్నే నేనెందుకుఁ దిరిగిపోకూడదు?—ఓసీ! పిశాచినీ! విడిచిపెట్టుము. నన్ను విడిచిపెట్టుము. పోయెదను. తిరిగిపోయెదను—లేదు. లేదు. ఎక్కడకుఁ దిరిగిపోవుదును? ఎవరిహస్తావలంబనమునఁ బోవుదును? (ఈసమయమున బాలికకంఠధ్వనితో "బాబుగారికి జయంకలగాలె. కొంచెంబిచ్చం పెట్టండి బాబయ్య" అని వినఁబడును. చాణక్యుఁడు క్రిందకు దిగును) ఎక్కడి దీ స్వరము! (వెనుదిరిగి చూచి) ఎవరు వీరు? లోనకు రండు.

(భిక్షుకుఁడు బాలిక ప్రవేశింతురు)

భిక్షుకుఁడు—కొంచెం బిచ్చంపెట్టండి, బాబూ!

చాణ—(బాలికవైపు సానురాగముగఁ జూచుచు భిక్షుకునితో) ఔరా, బిచ్చగాడా! రాత్రి ఇంత పొద్దుపోయినతర్వాతనుగా బిచ్చమడుగుకొనునది?

భిక్షు—ఈపట్నాని కిప్పుడే వచ్చాను, బాబూ! పొద్దున్నుంచి యింతవరకేం తినలేదు బాబయ్యా!

బాలిక—పొద్దున్నుంచి యేం తినలేదు బాబయ్యా!

చాణ—ఆఁ! యిది యేమి? ఆకస్మికముగ నాకు దుఃఖము వచ్చుచున్న దేల? ఒక భిక్షుకబాలిక—అరె! యిది యేమి హృదయచాంచల్య

ల్యము! (బాలికను జూచి) అమ్మాయీ! నాచెంతకు రమ్ము. (బాలిక వెంటనే చాణక్యునిదగ్గఱకు వచ్చును. చాణక్యుఁడు బాలికశిరముపైఁ జేతితోఁ దట్టుచు) ఈబాలిక నీ కుమారియా బిచ్చగాఁడా?

భిక్షు—అవును, బాబయ్యా!

చాణ—(నిట్టూర్పు వుచ్చి) అమ్మాయీ! నీపే రేమి?

బాలి—మాధు.

చాణ—నీ యి ల్లెక్కడమ్మా?

బాలిక—చాలాదూరం, బాబూ! కాదు మాకు యిల్లూ వాకిలీ లేదు. ఏసత్రిమో, ఏచెట్టునీడో, ఎప్పు డెక్కడ దిగితే అదే మాయిల్లు వాకిలి.

చాణ—నీవు పాడగలవా, అమ్మాయీ!

భిక్షు—ఎందుకు పాడలేదు, బాబూ! పాడమ్మా? మాధు!

చాణ—ఇప్పుడు వద్దులే, ఆగండి కొంచెము విశ్రాంతి తీసికొనిన తరువాత పాడుదురు గాని.

భిక్షు—పాడటం అంటె మాకు కష్టంపనికాదు, బాబయ్యా! మాకదే వృత్తి. అమ్మాయీ! పాడమ్మా.

(భిక్షుకుఁడు బాలిక పాడుదురు)

గీతము

పోయెను నను విడిపోయె ననుచు వాపోవ నేల యీలీల
పోయె నచ్చటికె సర్వప్రాణులును బోవు నెచ్చటికి బేల॥
ఎటకు పోయెనో యెందుకు పోయెనో యెచ్చట నుండెనో యని యరయఁ
కిటుకు తెలియ కిటు లటమటింప నెన్నటికేని దొరకదు తుదియుఁ॥
ఎందుల కీపగ ఎందుల కీవగ యెట్టుల విధి విధియించుఁ

ఎందు నయ్యేదియె జరుగకతీరునె యేడ్చిన నెదిరించిన నెంచగ॥
మానంబిది యవమానంబది యభిమానంబయ్యెది యనుచుగ
మానసమున ననుమానముపడకుము మాయకు లోబడి పెలుచగ॥
పుట్టుటయెల్లను గిట్టుట కని మది పొంగక పొగలక యింకగ
పుట్టుట గిట్టుటలేని పదమ్మును బొందగ జనుము కడంకన్॥

చాణ—(తనలో) ఆరాత్రికూడ నిటులె వెన్నెల పిండారఁబోసినటు లున్నది. ఆకస్మికముగ మేఘమొకఁడు చంద్రుని మఱుగుపఱచెను. చలిగాలిచే దీపములు పోయినవి. అయ్యో! నాప్రియ కుమారీ! యెచ్చట నుంటివి? ఆ తలఁపుకూడ స్వప్నతుల్యము. ఆఁ! ఇది యేమి! చాణక్యా! నీకన్నుల యశ్రువులా? అరే, బిచ్చగాడా! ఈ మొహరీలను గై కొనుము. (గుప్పెడు మొహరీల నిడును) అమ్మాయి! పోకుము—త్వరగాఁ బొమ్ము. త్వరగాఁ బొమ్ము.

(భిక్షుకుఁడు బాలిక విస్మయముగ్ధులయి పోవుదురు)

---

## ద్వి తీ య దృ శ్య ము

---

స్థానము — పాటలీపుత్రములోని రాజమందిరము

సమయము — రాత్రి

[మురు, చంద్రకేతుఁడు ప్రవేశింతురు]

మురు—చంద్రకేతూ! నేఁడేకదా దాక్షిణాత్యుల జయించి చంద్రగుప్తుఁడు మగుడి మగధకు వచ్చునది? నగరమునం దుత్సవ ప్రయత్నములే లే వేమి?

చం॥ కే—మనమంత్రి చాణక్యులవారు నిషేధించిరి.

మురా—అ దెటుల ? మన గురుదేవుఁడు తన ప్రియశిష్యుని విజయోత్సవముల నిషేధించెనా ? ఎందు కటులఁ జేసెనో ?

చం॥కే—అమ్మా ! మంత్రివరుఁడు నిషేధించినదానికి తప్పక ఏదియో కొంత తగినకారణ ముండ కుండదు.

మురా—కారణ మేమియు లేదు. చంద్రగుప్తుని విజయగౌరవమున కీ బ్రాహ్మణుఁడు ఈర్ష్యవహించె నని తోఁచుచున్నది.

చం॥కే—ఈ విజయగౌరవమునకుఁ గారణ మెవ్వరు ? తల్లీ ! ఈబ్రాహ్మణునియెడ దురభిప్రాయము పడఁదగినది కాదు.

మురా—అదిగో ! వినుము. వాద్యధ్వని వినవచ్చుచున్నది. అబ్బాయి వచ్చుచున్నటు లున్నది. నేను వెళ్లుచున్నాను. ప్రాసాదము నెక్కి, నగరప్రవేశోత్సవమును దిలకించెదను. (త్వరగాఁ బోవును)

చం॥కే—విజయలక్ష్మీపరిణయశుభలాంఛనుఁ డగు నాసోదరునిముఖకమల మరయు భాగ్య మిన్నినాళ్ళ కిపుడుగదా యబ్బును. ఎంతయానందముగ నున్నది ! చంద్రగుప్తా ! పూర్వజన్మమున నాసోదరుఁడవా యేమి ?

(నేపథ్యమున కోలాహలము, వాద్యధ్వని, "జై చంద్రగుప్త మహారాజుకు జై" అను ధ్వనులు పిక్కటిల్లును. పతాకధారులు ముందు నడువ చంద్రగుప్తుఁడు సైనికులతోఁ బ్రవేశించును)

చం॥కే—రమ్ము, ప్రాణబంధూ ! (కౌఁగిలింపఁబోవును)

చం॥గు—(కోపమున) చంద్రకేతూ ! నాయాజ్ఞాపత్రము నీకుఁ జేరినదా ?

చం॥కే—ఏయాజ్ఞాపత్రము, ప్రియతమా !

చం॥కే—నావిజయాగమనమునకయి పట్టణమంతయు శృంగారింపవలయు నని నేను పంపిన యాజ్ఞాపత్రము.

చం॥ కే—అవును, నాకుఁ జేరినది.

చం॥ గు—అయితే దానిప్రికారము ఎందుకుఁ జేయలేవు?

చం॥ కే—మంత్రి నిషేధించెను.

చం॥ గు—ఇటుల జరుగు నని నేను మొదటనే యనుమానపడితిని. చంద్రకేతూ! మగధకు మహారాజును నేనా లేక చాణక్యుఁడా!

చం॥ కే—వినుము, సోదరా!—

చం॥ గు—ఉత్తర మొసఁగుము. మగధకు మహారాజును నేనా లేక నామంత్రియా?

చం॥ కే—మగధమహారాజు చంద్రగుప్తుఁడు.

చం॥ గు—ఇఁక?

చం॥ కే—ప్రియతమా!—

చం॥ గు—నే నేమియు వినను. మంత్రిని బిలువుము.

చం॥ కే—వినుము, సోదరా! దీని కొక విశేషకారణము—

చం॥ గు—నే నేమియు వినను. నే నిప్పుడే దీనికి సమాధాన మడిగెదను.

చం॥ కే—ఆయన చెప్పినది యేమన—

చం॥ గు—చెప్పిన దేమైన నుండిన స్వయముగ ఆయనయే వచ్చి చెప్పుకొనును మగధదేశమునకు మహారాజు చంద్రగుప్తుఁడో లేక చాణక్యుఁడో ఇప్పుడే నిశ్చయముగఁ దేల్చుకొనవలెను.

చం॥ కే—తొందరపడక వినుము, సోదరా!

చం॥ గు—నీవుకూడ నామాట నతిక్రమించెదవా? పొమ్ము.

(చంద్రకేతుఁడు మెల్లగాఁ బోవును)

చం॥ గు—బ్రాహ్మణునిగర్వము నాధైర్యమును గొల్లఁగొట్టుచున్నది—
ఒకసారి—వలదు. ముందుగా—సాహసము—ఆశ్చర్యము!—
ఈసారి నేను—వలదు. ముందుగాఁ బ్రత్యుత్తరముఁ బడసెదను.

(చాణక్య, చంద్రకేతులు ప్రవేశింతురు)

చాణ—మహారాజునకు జయమగుఁగాక!

చం॥గు—(కోపముతో సమస్కరించి) మంత్రివరా! నావిజయమునకు నగరమంతయు శృంగారించి యుత్సవముల జరుప ఆన నిడితిని గదా! ఆప్రకార మెందుకుఁ జేయలేదు?

చాణ—నేను నిషేధించితిని.

చం॥గు—(కొంతవడి నిస్తబ్ధుఁడయి) నేను దాని కారణము తెలిసికొన వచ్చునా?

చాణ—దానివలన ప్రయోజన మేమియు లేదు.

చం॥గు—ప్రయోజనము లేదా?

చాణ—నేను చేసినది బాగుగా విచారించియే చేసితిని.

చం॥గు—అయినను నేను కారణము తెలిసికొనఁ గోరుచున్నాను.

చాణ—కారణము తెలిసికొను సమయ మింకను రాలేదు. అవసర మగు నపుడు చెప్పెదను.

చం॥గు—మంత్రీ! మగధకు మహారాజును నేను.

చాణ—(నవ్వుచుఁ జూచుచుండును)

చం॥గు—మంత్రీ! నీ యీ యౌద్ధత్యము నిఁకఁ జూచి సహింపఁజాలను. నేను న్యాయమును విచారించెదను.

చాణ—చంద్రగుప్తా! చాల నుత్తేజితుఁడ వయితివి? కొంచెము శాంతింపుము. (పోఁబోవును)

చం॥గు—మంత్రీ!

చాణ—(తిరిగి) వత్సా!

చం॥గు—ఈ రాజ్యమునకుఁ బ్రభువును నేనా లేక చాణక్యుఁడా? ఇది నేను తెలిసికొన నుత్సహించుచున్నాను.

చాణ—మహారాజు చంద్రగుప్తుఁడు.

చం॥గు—అటుల నాకు బొత్తిగాఁ గాన్పించుట లేదు. నాసామ్రాజ్యమున నేను బందీగా నుంటి నని తెలిసికొంటిని. నాయింట నేను దాసునిగా నుంట గ్రహించితిని. మంత్రి చాణక్యుఁడు పాటలీపుత్రమున నిర్విచారముగ కూర్చుని రాజభోగము లనుభవించును. ఇఁక మహారాజు చంద్రగుప్తుఁడో దేశదేశాంతరముల నెదుర్కొని జయించి వచ్చుచుండును. మంత్రిచాణక్యుని యశోగుణగీతముల సమస్తభరతవర్షము పాడుచుండును. ఆ గీతముల కుపాదానము మహారాజు చంద్రగుప్తుఁడు సంపాదించుచుండును. మంత్రి చాణక్యునియాజ్ఞ మహారాజు చంద్రగుప్తుఁడు శిరసా వహించును. చంద్రగుప్తునియాజ్ఞ చాణక్యుఁడు కాలితో రాచివేయును. ఇదియే మన యిరువుర కుండు సంబంధమయిన, ఈబంధన మెంత శీఘ్రముగ విచ్ఛిన్నమయిన నంత మంచిది.

చాణ—మహారాజుగారి యభిరుచి యెటు లుండిన నటులే జరుగును. చాణక్యుఁడు మంత్రిత్వ మాసింపలేదు ! నే నిప్పుడే నాపదవికి రాజీనామా నొసఁగుచున్నాను.

చం॥గు—పదత్యాగమునకుఁ బూర్వము దీనికి తగిన సమాధాన మీయఁ గోరుచున్నాను.

చాణ—నేను సమాధానము చెప్పను.

చం॥గు—ఇంతసాహసమా ! సైనికులారా ! బంధింపుఁడు. (సైనికులు నిలఁబడుదురు) సైనికులారా ! (సైనికులు ముందుకు రాఁబోవ చాణక్యుఁడు ప్రశాంతభావమున చేసన్నచే వారల నాపును)

చాణ——ఔరా! శూద్రుని కింత స్పర్ధయా! ఇదిగో నామంత్రిత్వము నిప్పుడే త్యజించుచుంటిని. (మంత్రిదుస్తులు మొదలగునవి తీసి యిచ్చును) కైకొనుము, మహారాజా! చాణక్యుఁడు రాజధాని యందు నిశ్చింతగ కూరుచుండి విలాసము లనుభవించుట లేదు. ఆతఁ డిక్కడనుండి యొకమహాసామ్రాజ్యమును నడుపుచు న్నాఁడు. చాణక్యునకు రాజభోగములా! ఆతఁడు భుజించునది రెండుగుప్పిళ్ళ మెతుకులు. శయనించుటో మృగాజినముపయి. ఆతఁడు రాత్రి మూఁడుజాములప్పుడు సైతము రాజ్యకార్యము లతోఁ దలఁ బగులఁగొట్టుకొనుచు తనకుటీరాంగణమున నటు నిటు తిరుగాడుచుండును. నే నికఁ బోవుచున్నాను. ఇది నీరా జ్యము. నీయిచ్చవచ్చినటుల శాసింపుము. (పోవఁబోయి వెంటనే తిరిగి) అవును, మఱచితిని. పోవుటకు ముందు నేఁ డీయుత్సవ ములు ఎందు కాపినది చెప్పి మఱిపోవుదును. గతించిన నంద మహారాజుమంత్రి విద్రోహులఁ గూడఁ దీసి వారల సాహాయ్య మున మనపై కుట్రపన్నినాఁడు. నేటిరాత్రి మనము ఉత్సవముల గొడవలో మునిఁగితేలుచుండ మననగరము ముట్టడింప వారల సైన్యముల కానయిడెను. వారిలోఁ గొందఱు నీశయనాగార మునకు సురంగము త్రవ్వి నిన్ను హత్యచేయుటకు నీరాక నిరీక్షిం చుచున్నారు. వారల నెల్లఁ బట్టి వధింప మనసైనికులఁ బంపితిని. (పోఁబోయి మఱల తిరిగి) అవును, ఇంకొకసంగతి చెప్పమఱచి తిని. భువనవిజయి యగు సెల్యూకసు సింధునది దాటెను. నలు ప్రక్కల నెటుచూచిన నశస్త్రి లగు శత్రువు లున్నారు. ఇది ఉత్సవములకు సమయముకాదు. నే నుత్సవముల నాపినకారణ మిది. పోవుచున్నాను (పోఁబోవును)

చం॥ కే——(చరణములపైఁ బడి) గురుదేవా! క్షమింపుము.

చాణ——సమాధాన మీయ నిర్బంధింపఁబడిన పిమ్మట చాణక్యుఁడు మంత్రిపదవి స్వీకరింపఁజాలఁడు. (పోవును)

చం॥ కే—బంధువరా! బ్రతిమాలి మంత్రిమహాశయుని దీసికొనిరమ్ము.

చం॥ గు—చాణక్యుఁడు లేనిదే రాజ్యము సాగదా యేమి? అంతయహంకారమా! నే నిప్పుడు స్వతంత్రుఁడ నయితిని. ఇప్పుడే నేను నిజమగు మహారాజును.

చం॥ కే—సోదరా! నాయుపదేశ మాలింపుము. చేతులుపట్టుకొని వానిని తీసికొని రమ్ము.

చం॥ గు—చంద్రకేతూ! నీయుపదేశముతో నాకుఁ బనిలేదు. నీబలవంతముచే నొకసారి చాణక్యుని క్షమించి పొరఁబడితిని. బ్రాహ్మణుని యధికారగర్వము చూడుము. నేను మహారాజనైనను నా కేమి శక్తిలేదు సరికదా, చివఱకు నాసోదరుని క్షమించుటకు కూడను శక్తిలేదు. ఈ రాజ్యముతో నా కేమియు సంబంధములేనట్లున్నది.

గీ॥ కేవలము మంత్రి లాడించు కీలుబొమ్మ
లటుల రాజాభినయము చేయంగఁజాల;
నిట్టి స్వాతంత్ర్యరహితమౌ హీనరాజ్య
పదవికన్నను బానిసపనియె మేలు.

చం॥ కే—గురూత్తముఁ డేమి చేసినను నీమేలునకే చేయును.

చం॥ గు—నామేలునకేనా యీబ్రాహ్మణుఁడు నాసోదరుని హత్యచేసినది? ఈతఁడును, కాత్యాయనుఁడును నందుని వధించి పైశాచికోల్లాసమున ఆమృతశరీరముపై తాండవమొనరించిరి. అది నేను చూచియుండలేదా?

చం॥ కే—ఈ రాజ్యలాభమునకయి నీ వాతనికి ఋణిపి—

చం॥ గు—ఋణినా! చాలు నిఁకఁ బొమ్ము. అప్రియవాక్యము లాడుటలో నీవు కడుంగడునేర్పరి వని యెఱుఁగుదును.

చం॥ కే—అప్రియ మగు సత్యము నుడువుట కొక్క మిత్రునికే యధికారము కలదు.

చం॥గు—చాలు, చాలు. నీయుపన్యాసము కట్టిపెట్టుము.

గీ॥ భరతఖండమహాచక్రవర్తి యేడ,
కొండపల్లెల దొరవైతిరిగెడవ యేడ?
హితము చెప్పుట వినుట చా లింకఁ బొమ్ము
సములకును గాక వియ్యనెయ్యములు తగునె?

చం॥ కే—మహారాజా! నాయనుచితౌద్ధత్యమును క్షమింపుము. ఇఁక ముందు మహారాజబాంధవ్యమునకుఁ బట్టుదల జూపను. రాజపదవి కనుగుణముగఁ బలికితిరి.

గీ॥ ఆపదలఁ బ్రాణరక్షకుం డైనవాఁడు
పేక్షితుం డగుఁ గలిమి పెం పెసఁగునాఁడు
శీతువున వేడ్కనై నపేక్షించు వహ్ని
దుస్సహముకాదె గ్రీష్మమందున నృపాల!

మంచిది పోయివచ్చెదను. సెలవొసంగుఁడు. పోవుటకు ముం దీమాట చెప్పి మఱిపోయెదను. మహారాజా! సంపత్కాలమున నా నేస్త ముపేక్షించిరికాని, విపత్కాలమం దుపేక్షింపకుం దురు గాక! ఎన్నఁడైన ఖమకు నావలన కాఁదగినకార్య మున్న యెడ నేటిమాటలకు లజ్జించి నన్ను పిలిపింప సంకోచింప కుందురుగాక! తమ కిసుమంత లాభముండినఁ జాలు. నాప్రాణమైనను సంతోషపూర్వకముగ సమర్పించుటకు సదా సంసిద్ధుఁడనై యున్నాను. (ప్రస్థానము)

(చంద్రగుప్తుఁడు కొంచెము సేపు మాటలాడక నిస్తబ్ధుఁడయి నిలఁబడును. ఇంతలో అయిదుగురు సైనికులు తెగిన శిరమును బట్టుకొని ప్రవేశించి చంద్రగుప్తున కద్దాని జూపించుచు)

సైని—ఇదియే మహారాజా! దళవాయిశిరము.

చం॥గు—ఏ దళవాయిది ?

సైని—మహారాజా! తమ శయనాగారమునకు సురంగము త్రివ్వి ఇరువదియైదుగురు ఘాతుకులు దాగియుండిరి. మంత్రిమహాశయుఁడు వారల వధింప మా కాజ్ఞనిడెను. మేము వారందఱం దునుమాడి దళపతిశిరము తమదరికి తెచ్చితిమి.

చం॥గు—(శిరమును జూచి) ఇది నందుని బావమఱఁది వాచాలునిది. మంచిది పొండు. (సైనికులు పోదురు) అదియా ?

(సైనికాధ్యక్షుఁడు ప్రవేశించును)

సేనాధ్యక్షుఁడు—మహారాజునకు జయమగుఁగాక !

చం॥గు—ఏమి సమాచారము ?

సేనా—విద్రోహులు నగర మాక్రమింపవచ్చిరి కాని మేము సశస్త్రులమయి యప్రమత్తతతో నుండుటఁ గని పారిపోయిరి.

చం॥గు—మిమ్మెవరు జాగరూకులై యుండ నియోగించిరి ?

సేనా—మంత్రిమహాశయుఁడు.

(చంద్రగుప్తుఁడు శూన్యదృష్టిఁ బరగించి అదేపని చూచుచుండును. సైనికాధ్యక్షుఁడు మెల్లమెల్లగాఁ బోవును. చంద్రగుప్తుఁడు అదేవిధముగాఁ జూచుచుండును. తెరవాలును.)

## తృ తీ య దృ శ్య ము

స్థానము — సెల్యూకసు శిబిరము

సమయము — రాత్రి

[సెల్యూకసు, కాత్యాయనుఁడు]

సెల్యూకసు—కాని వారల సైన్య మాఱులక్షలుకద !

కాత్యాయనుఁడు—చాణక్యుఁడు మంత్రిత్వము వదలిన పిమ్మట ఆసైన్యమంతయు నదుపాజ్ఞలు లేక యున్నది. నే నీ సంగతి కనిపెట్టితిని. నన్ను విశ్వసింపుఁడు. ముట్టడించుట కిదే తగిన యదను.

సెల్యూ—అయితే నాసైన్యము చాల తక్కువ.

కాత్యా—మీ రేమియు భయపడఁ బనిలేదు. గతించిన నందమహారాజు పక్షమువారు నగరమందు చాలమంది యున్నారు. వారు వారి సేనలతో మనకు సాయమొనర్తురు.

సెల్యూ—నిశ్చయ మెటుల?

కాత్యా—ఇది నిశ్చయమని నాకు గట్టిగాఁ దెలియును. చంద్రకేతుని సేన వారిదేశమునకుఁ దిరిగిపోయినది. బహుశః అదికూడ మనకుఁ దోడుపడవచ్చును. ఇదివఱకే మనతో నెందుకు కలియలేదా యని యోజించుచున్నాను.

(హెలీనా ప్రవేశించును)

హెలీనా—బ్రాహ్మణుఁడా! అందరు నీవలెనే విశ్వాసఘాతుకు లగుదురా?

సెల్యూ—హెలీనా! ఈసమయములో నిక్కడ కెందుకు వచ్చితివి?

హెలీ—ఈ ప్రక్కగదిలో నేను చదువుకొనుచుంటిని. మధ్యమధ్య నీ బ్రాహ్మణుఁడు నెమ్మది నెమ్మదిగా మాటలాడుట వింటిని. అది యేమయి యుండునా యని తెలిసికొన కుతూహలపడితిని. అంతట పుస్తకము కట్టిపెట్టి కొంచెముసేపు విని అచట నుండఁ జాలకపోతిని. బ్రాహ్మణుఁడా! నీవు తిన్నయింటివాసములు లెక్కపెట్టువాఁడవు. పరమవిశ్వాసఘాతుకుఁడవు.

కాత్యా—నేనా!

హెలీ—అవును, నీవే. ఒకసారికాదు నూఱుసారులు. మీరాజ్యమునకు విరుద్ధముగ కుట్రలపన్ని, సర్వస్వతంత్ర మగు నొకజాతినంతయు విచ్ఛేదమొనరింప సమకట్టి, అజన్మప్రవర్ధమాన మగు రాజభక్తిని దేశభక్తిని గంగఁ గలిపి ఆతతాయులతో సంధి కావించుచుంటివి. ఈనిర్మలప్రశాంతక్షేత్రమున రుధిరప్రవాహములు ప్రవహింపఁ

జేయనెంచితివి. నీబోటివారు నీజాతికే కాదు. ప్రపంచమందలి సమస్తమానవజాతికి శత్రువులు. శాంతికి భంగకారులు. ధర్మ విద్రోహులు. దేశమును అన్యాక్రాంతము చేయనెంచిన పరమ నీచులు. బ్రాహ్మణాధమా! చల్లారిపోవుచున్న నాతండ్రిజయ కాంక్షను మఱల ప్రజ్వలింపఁ జేసితివి. రెండు గొప్ప సభ్య జాతులమధ్య అగాధమును ద్రవ్వుచుంటివి.

సీ॥ కడుపుచల్లగ మిమ్ము గన్నతల్లిని దేశ
జనని నన్యులదాస్యమునకుఁ దార్చి
స్వాతంత్ర్యమునఁ దేలు సంతతి శాశ్వత
పారతంత్ర్యార్తిని బడలఁజేసి
సభ్యజాతులను విజ్ఞానసంపదమించు
జాతిగౌరవమెల్లఁ జక్కడంచి
శాంతివర్మచ్ఛాయసౌఖ్యమందెడి ప్రజఁ
గారాగృహమ్ముల గాసిపఱచి
గీ॥ వ్యక్తివిద్వేషమునకు సైక్యమ్ముఁ జంపి
పొట్టకూటికిగా జన్మభూమి నమ్మ
నిన్నుఁబోలు కృతఘ్నుండు నిలువఁ దుదకు
నరకమందును స్థానంబు దొరకు నొక్కొ!

కాత్యా—కాని పాణినీయము—

హెలీ—పాణినీయము వ్యాకరణము గద!

కాత్యా—అది వేదాంతసారము.

హెలీ—నీవు శుద్ధమూర్ఖుఁడవు. పొమ్ము, దూరముగా.

(కాత్యాయనుఁడు పోవును)

నాయనా! ఈబ్రాహ్మణునియొద్ద సంస్కృత మభ్యసించుచుంటిని. ఈతఁ డింత దురాత్ముఁ డని స్వప్నమందును దలఁప లేదు.

తెలిసియుండిన వెంటనే వెడలనడచుదానను. తండ్రీ! ఏల యుద్ధమొనరింపఁ జూతువు. యుద్ధము హత్యలకు మూల కందము.

సీ॥ దోపిడిగాండ్రదుందుడుకుచేతల ప్రాపు
విశ్వసాభ్రాతృత్వంపు వేరువిత్తు
క్షామదేవతకు సుస్వాగతం బిడు గేస్తు
భోగవల్లికిఁ గుక్కమూతిపిందె
పరిబలవిప్లవకార్యఫలము నీనెమ్తోఁట
యెసఁగు జాత్యేకత కెదురుచుక్క
సకలదేశారిష్టసమితి కావాలమ్ము
నఖిలకళావృద్ధి కానకట్ట
గీ॥ విజితవిజయుల కొకరీతి విపులనష్ట
కష్టములఁగూర్చి యోటమిగా జయమ్ము
సలుపు నెత్తురుకూడగు సమర మేల?
శాంతి నెలకొల్పి కనుము యశమ్ము తండ్రి!

సెల్యూ—పొమ్ము, నేను నీమాటల వినను—దాదీ!

(దాది ప్రవేశించును)

అమ్మాయి దగ్గఱ నుండుము. పొమ్ము, హెలీనా! నిద్ర పొమ్ము. (ప్రస్థానము)

హెలీనా—(కొంచెము సేపు పైన చూచి) హింస తనసహస్రఫణముల విప్పికొని కబళింపఁ బరుగిడివచ్చుచున్నది. ప్రపంచ మానైపు దైన్యదృక్కుల నిగిడించుచున్నది. వెఱవేమియు లేదు. పద, దాదీ! (ఇరువురు నిష్క్రమింతురు)

## చతుర్థదృశ్యము



స్థానము — గ్రీసుగ్రామము — నిర్జనకుటీరమున గది

సమయము — ప్రభాతము

[ఆంటిగోనస్, అతని తల్లి మాటలాడుచు బయటకు వత్తురు]

ఆంటిగోనస్— వలదు. నీచేతితో నిదు నీవైనను ముట్టను. నాతండ్రి యెవరో తెలిసికొనుటకే వచ్చితిని.

తల్లి—నేను నీకుఁ దల్లిని. మాతృప్రేమకు నీవు ఋణివి కావా! తల్లి ఋణమును దీర్చికొనవా !

ఆంటి—ప్రేమకు ఋణపడితినా? (వ్యంగ్యహాస మొనర్చి) నిజము. ప్రపంచమున నసహ్యమగు భిక్షుకుని కంటె నన్యాయముగ నన్ను చేసినది చాలక తుచ్ఛ మగు గుప్పెడు మెతుకులకు పశువును వలె సంతలో విక్రయించి యిప్పుడు ప్రేమకు వివాద మొనర్చు చుంటివా? నో రెటుల వచ్చినది? సిగ్గులేదా?

తల్లి—నేను తప్పుచేసితిని. అన్యాయ మొనర్చితిని. కాని నాపాపము నకు క్షమాపణ లేదా? ఆఁకలిబాధార్తైక్షము నీ కెట్లు తెలి యును. నాయనా! మండుచుండు క్షుధానలమునకు మలమల మాడి పిచ్చిదానవయి యెంత దుర్వ్యథకు లోనయి యీ యు కార్య మొనరించినది నీ కెట్లు తెలియును? అటుపిమ్మట నిద్రా హారవిహీనవయి కన్నీరు మున్నీరుగ నేడ్చుచు నెన్ని దీర్ఘ దిన ములు పుచ్చితినో దైవమున కెఱుక. నీకోమలముఖము స్మరిం చుటయందె నారోజులు గడచినవి. నీస్మరణయే నాకు లోకము. ఈపొట్ట నింపుకొన నిన్నమ్మి గడించిన నాలుగు మెతుకులు నావేడి నిట్టూర్పులకాకకు భస్మమయిపోయినవి. అబ్బా! పగ

వానికై నను వలదు. ఆఁకలిబాధ నీ కెట్లు తెలియును, ఎట్లు తెలియును ?

ఆంటి—ఈయంతర్గాఢ మగు మనోవ్యధ నీ వెట్లెఱుంగగలవు ? హృదయము చెదరి పిచ్చివాఁడనయి దేశదేశములు దిరిమ్మరుచుంటిని. సింహగర్జారవమునకు వెఱువక, క్రూరవ్యాఘ్రకరాఘాతమునకు జంకక దావానలకీలల లెక్కింపక, శిలావృష్టికి సరకుగొనక, శత్రుఖడ్గప్రహారములకు వెనుదీయక, తదావేగమునకు నిల్వలేక, తిరిగి తిరిగి నీదఱికి వచ్చితిని. నాశౌర్యధైర్యముల సేనాధ్యక్షుడ నయితిని. కాని నీ వాపాదించిన ఈ కళంకము, ఈకాళిమ మాత్రము పోగొట్టుకొనఁ జాలనైతిని. ఓసీ! రాక్షసీ ! చెప్పుము. నాతండ్రి యెవరో చెప్పుము.

తల్లి—చెప్పెద నాగుము.

ఆంటి—ఆగిన నేమి ప్రయోజనము ? చెప్పుము. నాజనకుఁ డెవరో ముందు చెప్పుము.

తల్లి—(అర్థస్వగతము) ఆహా ! ఇదియే ముఖము. సరిగా యిదె. ఎన్నిసారు లీవదనకమలమును స్వప్నములం దిలకించితిని. ఎన్నిమారు లీకోమలదేహము నక్కున గదించి ప్రణయప్రకంపితనై ముద్దులాడితిని ! ఎన్ని తడవలు—

ఆంటి—ఈగొడవల కేమిలే. చెప్పుము. నా తండ్రి యెవరో చెప్పుము.

తల్లి—జనకుని తెలిసికొన నింత యాతురతయా ? నేను నీ కేమియుఁ గానా ?

ఆంటి—ఏమియుఁ గావు. నీవు నా కేమియుఁ గావు. నాసంబంధమును జేతులార త్రెంపుకొంటివి. కని విని యెఱుఁగని పైశాచికకృత్య మొనరించితివి. తల్లి వయి యుండియు జేరెడు గంజికయి కన్న సంతానము నమ్ముకొంటివి.

తల్లి—అందుకే క్షమాపణకోరితిని. క్షమించిన క్షమింపుము, మానిన మానుము. కాని "అమ్మా" యని నోరార నొకసారి పిలుపుము. ఒకసారి, ఒకసారిమాత్రమె.

ఆంటి—నీవిలాపాలాపములు వినుట కిక్కడకు రాలేదు. నాతండ్రి యెవరో ముందు తెలుపుము.

తల్లి—నేను నీ కేమియుఁ గానా?

ఆంటి—ఏమియుఁ గావు.

తల్లి—ఏమి కాకున్న మానెఁగాని యష్టకష్టములుపడి నవమానములు మోసి మోసి, నిన్ను కని స్తన్యమొసఁగి పెంచితిని.

ఆంటి—ఏమి యనుగ్రహము! కన్నసంతానము గొంతుపిసికి చంపవయితివి, పాపము. చాల దయ చూపితివి. న న్నెందుకు పురిటిలోననె చంపవయితివి. పరుల కమ్ముటకంటె హత్యఁజేయుట మేలు.

తల్లి—కుమారా!

ఆంటి—నాజనకుఁ డెవరో తెలుపుము. త్వరగాఁ దెలుపుము. లేనియెడ పిచ్చివాఁడ నగుదును. తెలుపుము, నాతండ్రి యెవరో! ఎవరు నాతండ్రి?

తల్లి—మంచిది. అయిన వినుము. తనపేరు వెల్లడింపవల దని నీతండ్రి ముదలయిడెను. ఇన్నాళ్లవఱకు నీతండ్రిపేరు తెలుపనయితిని. వివాహమగుసరికి నాకు—

ఆంటి—వివాహమయినదా!

తల్లి—పదియైదు సంవత్సరములు. ఆతఁ డేది చెప్పిన నదియె నమ్మితిని. మావివాహము గూఢాముగా జరిగినది.

ఆంటి—వివాహ మయినదా?

తల్లి—అటుపిమ్మట గొప్పయింటివడుచును జేపట్టి నన్ను విడిచిపెట్టెను.
ఔరా! ఎంతక్రూరకర్ములు! ఎంతనిష్ఠురహృదయులు పురుషులు!

ఆంటి—వివాహ మయినదా—హెలీనా! నీప్రాణిగ్రహణాశ దురాశ కాఁజాలదు. సెల్యూకస్—ఎందు కులికిపడెదవు?

తల్లి—ఎవరిపేరు నీ విప్పుడు తలఁచినది?

ఆంటి—ఎందుకు? సెల్యూకసుపేరు.

తల్లి—ఆయన పే రెట్లెఱిఁగితివి? నే నింతవఱకును జెప్పనైతినిగద!

ఆంటి—నా కెట్లు తెలియునా! నే నాతనిక్రింద సైన్యాధ్యక్షునిగాఁ బని చేసితిని.

తల్లి—(ఆగ్రహమున) ఆతనిక్రిందనా? అయినను నిన్ను గురుతింపలేదా!

ఆంటి—(ఆశ్చర్యముతో) గురుతింపలేదు.

తల్లి—ఔరా, నిష్ఠురుఁడా! నీ కుమారుని నీవు పోల్చుకొనలేకపోతివి. నేనైన లక్షమంది పిల్లలలోనున్నను నాపుత్త్రుని నానవాలుపట్ట గలుగుదును. ఎంతపెద్దవాఁడైనను సరియె, చూచి యెన్నిదినములైనను సరియే.

ఆంటి—ఏమి చెప్పుచుంటి వబలా? పిచ్చిదానివలె నేమి వాగుచుంటివి?

తల్లి—కాను, కాను. పిచ్చిదానను కాను. ఈసంగతులు చెవులు ప్రిదుల వినియు నెందు కున్మాదిని కానైతినో చెప్పఁజాలను. నే నెందుకు వెఱ్ఱిదానను కానైతిని? అతఁడు చక్రవర్తి కానిమ్ము. నే నాయన ధర్మపత్నిని; పట్టమహిషిని—బిచ్చపుదానను, దారివెంట నడుగుకొను బిచ్చపుదానను, కడుపుమంటకై కన్నసంతాన మమ్ముకొనిన నిర్భాగ్యురాలను. (ఏడ్చును)

ఆంటి—ఇ దేమి! అయిన—

తల్లి—కుమారా! ఆసెల్యూకసే నీతండ్రి.

(ఆంటిగోనస్ గోడకు జాగిలఁబడి కొంతసేపటికి తల్లిపాదముల కెరగును)

ఆంటి__అమ్మా! నన్ను క్షమింపుము. నే నీయెడ ననుచితములాడితిని. క్షమింపుము. భర్తృపరిత్యక్తా! జననీ!

తల్లి__కాదు. అదియంతయు నీతండ్రివిషయమయి కావచ్చును. ఆయనకు నేను పరిత్యక్తను గావచ్చును కాని నీకు నేను తల్లిని. మఱియొక సారి 'అమ్మా' యని పిలువుము. నాకష్టములు నష్టములు సర్వము మఱతును. అన్నియు మఱచి దానినే విని యానందించెదను.

ఆంటి__రాజమహిషివి. నీ కీ దీనదశయా! అమ్మా!

తల్లి__కేవలము తల్లిని. తల్లిని. ఇం కేమియు వలదు. నా కిం కేమియు వలదు. అమ్మా యని పిలువుము. మఱల నొకసారి అమ్మా యని పిలువుము.

ఆంటి__అమ్మా!

తల్లి__ఇంకొకమారు, మఱియొకమారు.

ఆంటి__ఇ దేమి? నీపాదములు తడబడుచున్నవి. సరిగ నిలఁబడఁజాలవా? అమ్మా! నిన్ను తీసికొనిపోయి నీచరణదాస్య మొనరింతును. అమ్మా!

తల్లి__ననుగన్నతండ్రీ! మఱల నింకొకసారి పిలువుము.

ఆంటి__అమ్మా!

తల్లి__చాలును. ఇదియే నాకు స్వర్గము. మోక్షము! నాతల తిరుగు చున్నది. కుమారా! ఆంటిగోనస్! ఎక్కడ నుంటివిరా నాయనా!

(చేయిజాచును)

ఆంటి__అమ్మా! ఇక్కడ! ఇక్కడ!

(ఆంటిగోనస్ పడిపోవనున్న తల్లిని బట్టుకొనును. తల్లి ఆతని భుజములపైఁ బడిపోవును)



## పంచమదృశ్యము

స్థానము — చంద్రగుప్తుని ప్రాసాదము
సమయము — రాత్రి

చంద్రగుప్తుఁడు—(స్వగతము) చివరకు నాపత్రిజలే, నాసొమ్ము తిను నాసైనికులే నాశత్రువులలోఁ గలసిపోయిరి. బయట శత్రువులు, ఇంట శత్రువులు. ఇఁక జీవించుట చాల దుర్భరము. ప్రకృతి నన్ను పరిశోధించుచున్నటు లున్నది. పూర్తిగా నాపైఁ బ్రకృతి ప్రతీకారము తీసికొనక విడువదు. ఎవరు నాప్రాణమునకుఁ బ్రాణమో, ఎవరు నాకు హితైషియో, ఎవరు నావృద్ధికాముఁడో యాతని శత్రువుఁ డనుకొని దేశబహిష్కార మొనరించితిని. ఆహా! ఆ మానధనుఁడు నానిష్ఠురవాక్యముల కభిమానము పడి నన్ను వీడిపోయెను. స్వాభిమానముచేఁ బ్రజ్వరిల్లు నాతని నాటి నిశితదృక్కులు ఇప్పటికిని జ్ఞప్తికి వచ్చుచున్నవి. "చంద్రగుప్తా! నీ వింత కృతఘ్నుఁడవా? నేను నీ కాశ్రయమిచ్చితిని. సేనాసమూహ మొసఁగితిని. నీకై నాప్రాణ మర్పింప సిద్ధపడితిని. మగధసింహాసనాసీను నొనర్చితిని. దీని కిదియా నీవు చూపిన కృతజ్ఞత" అని నన్ను దెగడినటు లున్నవి, నాటి నీ తీక్ష్ణవీక్షణములు. చంద్రకేతూ! నీ విప్పుడు కనుపించిన నీచరణముల కెఱఁగి క్షమాపణము వేడికొనెడివాఁడను. రాజ్యము పోయిన పోవుఁగాక! ప్రాణము పోయిన పోవుఁగాక! క్షమింపుము, నీ నోట క్షమించితి ననుమాట వినినఁ జాలును. అదియే పదివేలు. పోనిమ్ము. సామ్రాజ్యము నష్టమై పోనిమ్ము. నేను యుద్ధ మొనరింపను. నాదౌష్ట్యమునకు నేను ప్రతీకారముఁ గైకొనెదను. మగధ సామ్రాజ్యము మేఘకల్పితప్రాసాదమువలె శూన్యమున లీనమైన కానిమ్ము. నేను మాత్రము పరితపింపను.

సీ॥ నిలువ నీడయు లేని నెఱి దీనదశ నన్ను
నన్నకన్నను మిన్న నాదరించె
పదిమంది యొకట పైఁబడి చంప నుంకింపఁ
డెంపుమై పోరి రక్షింపఁగల్గె
కాసువీసము లేక కడగండ్లఁబడు నన్నుఁ
బ్రాజ్యరాజ్యమునకుఁ బ్రభుని జేసె
ముందు వెన్కాడక ముదల సౌదల నిడి
కొలుచు బత్తెములేని కొలువు గొలిచె
గీ॥ ఎవ్వఁ డాప్రాణబాంధవు నెఱుఁగలేక
తప్పనాడిన ద్రోహి కృతఘ్నుఁ డితఁడె
పంచభూతమ్ములార! పైఁబడుఁడు పొడవుఁ
డవనిభారమ్ము బాపుఁ డీయధముఁ గెడపి.

(సైనికుని ప్రవేశము)

సైని—మహారాజా! మనదుర్గము దక్షిణపుబురుజు భగ్నమైనది.

చంద్రి—మంచిది పొమ్ము. ఏమి! తేఱిచూచెద వేల? పొమ్ము.

సైని—శత్రుసేన దుర్గమున ప్రవేశించుచున్నది.

చంద్రి—ప్రవేశింపనీ పొమ్ము. (సైనికుఁడు పోవును) నేను రణమొనరింపను. నాపై నేను స్వయముగా బదులు తీసికొనెదను. నేనాత్మహత్య చేసికొనెదను.

(రెండవ సైనికుఁడు ప్రవేశించి) మహారాజా!

చంద్రి—నీ వెవరు? ఇచ్చటనుండి వెడలిపొమ్ము.

సైని—శత్రువులు—

చంద్రి—శత్రువు లెవరు? శత్రువు లెవరును లేరు. వారందఱును పరమమిత్రులు. రానిమ్ము. పొమ్ము.

(సైనికుఁడు పోవును)

చంద్రి—శత్రులెవరో, మిత్రులెవరో తెలియుట లేదు. బయట చూచిన నైరులు. ఇంటచూచిన నైరులు. మహాసముద్రమున తుపాను చెలరేగినది. ఈనౌకను సరిగ నడుపు కర్ణధారుఁడు గాని నావికుఁడుగాని లేఁడు. ఎడతెగని తరంగాఘాతములు తిని తిని పగిలి పోనున్నది. కొట్టుము, పగులఁ గొట్టుము. మునిఁగి పోవును. ఇఁక నాలస్యము లేదు. ఏమి యానందము! సలహా నిచ్చుటకు చాణక్యుఁడు లేడు. ప్రాణ మర్పింప చంద్రకేతుఁడును లేఁడు. పగులఁ గొట్టుము. నీయిచ్చవచ్చినటుల పగులఁ గొట్టుము.

(సైనికుని ప్రవేశము)

చంద్రి—మఱల ఇంకొకఁడా!

సైని—మహారాజా!

చంద్రి—మహారా జెవరు? ఇందు మహారా జెవరును లేరు. (కఠినస్వరమున) పొమ్ము. (సైనికుఁడు పోవును) ఇది యేమి ధ్వని? ఇంత రాత్రివేళ తూర్యధ్వనియా! ఇ దేమి! సంకులతుముల కోలాహలము కాదుగద! యుద్ధము! ఎవ రెవరికి యుద్ధము? మఱల తూర్యనిస్వనము—చంద్రగుప్తా! జీవించియుంటివా లేక మరణించితివా? ఈ రణదుందుభిధ్వని వినియు నిర్జీవభావమున నింట దాఁగుకొంటివా? అల్లవే నీసైన్యములు. సంకులసమరమున పెనఁగుచున్నవి. తృణప్రాయముగఁ బ్రాణముల బలి నొసఁగుచున్నవి. నీవో ఇంట నొకమూల నడఁగియుంటివి. లెమ్ము, వీరుఁడా! లెమ్ము. ఈయగాధ నైరాశ్యమున నీవిద్యుద్ద్యుతులఁ బఱగించి మిఱుమిట్లు గొలుపుము. నీభీషణసింహనాదమున నీ ఝుఁఝూమరుద్ధుంకారము నడఁగింపుము. పిమ్మట సర్వమును బ్రళయకల్లోలమున లీనమగును. జై మగధకు జై.

(మురప్రవేశము)

ముర—చంద్రగుప్తా! ఇ దేమి?

చంద్ర—అమ్మా! సెల వొసంగుము. పోవుచున్నాను.

ముర—ఎచటకు?

చంద్ర—యుద్ధము చేయుటకుఁ బోవుచున్నాను. యుద్ధమున మరణించుటకుఁ బోవుచున్నాను. పంజరనిబద్ధ మగు వ్యాఘ్రమువలెఁ దీసికొని తీసికొని చావనోల్లను. యుద్ధక్షేత్రమున నక్షత్రమండిత నీలాకాశముక్రింద నాసేనాసమక్షమున యుద్ధముచేయుచు చేయుచు మరణించెదను.

ముర—కుమారా! మరణింప నేల? శత్రువులు చుట్టుముట్టిరి, పొమ్ము. యుద్ధమొనరింపుము. నీవు వీరుఁడవు; ఎందుకు మరణింతువు?

చంద్ర—ఇంతకన్న వేఱొండు తెఱఁగు లేదు. బయట శత్రువులు; ఇంట శత్రువులు. ఎవరు శత్రులో, ఎవరు మిత్రులో గుఱుతింపలేకుంటిని. వైరిసేన యొక సముద్రము—

ముర—అయిన—

చంద్ర—ఇచట అయిన గియిన లేదు. నేను చావ నిచ్ఛగించితిని. అదె! సమరకోలాహలము. సేవకా! (సైనికుఁడువచ్చి నమస్కరించును) యుద్ధమునకు సంసిద్ధుఁడనయితిని. ఇప్పుడే వచ్చుచున్నాను. పార్శ్వరక్షకుల రా నాజ్ఞాపింపుము. అదే! మాటిమాటికి రణతూర్యధ్వని వినవచ్చుచున్నది. పొమ్ము. (సైనికుఁడు పోవును)

(నేపథ్యమున "మహారాజ్ చంద్రగుప్తకు జై")

చంద్ర—ఏ మిది! మహారాజు చంద్రగుప్తునకు జయమా! నేను కలఁగనుచుంటినా యేమి? లేదు, లేదు. ఇది వైరుల వ్యంగ్య

జయధ్వని కానోపు. ఆచాణక్యచంద్రకేతులతోడనే పోయి నది, చంద్రగుప్తమహారాజు విజయలక్ష్మి. అది మఱల సమీప మున వినవచ్చుచున్నది—ఇంకను సమీపమున—చెవిదగ్గఱ— ఆకంఠధ్వని చిరపరిచితముగఁ గన్పించుచున్నది. వా రెవరు? (వెనుకకు తగ్గును)

రక్తసిక్తాంగులయి చంద్రకేతుఁడు, చాణక్యుఁడు ఛాయ ప్రవేశింతురు)

చంద్రగు—స్వప్నము! స్వప్నము!!

చం॥ కే—వచ్చిరి, సోదరా! కడుపు, కాళ్లు పట్టుకొని గురువర్యునితీదిసి కొని వచ్చితిని. ఇఁక మఱేమియు భయము లేదు.

మురా—గురుదేవా! రక్షింపుము. (చాణక్యుని చరణములపైఁ బడును. ఛాయ మురను లేవదీయును)

చాణ—మురా! లెమ్ము. చాణక్యుఁడఘటనఘటనాసమర్థుఁడు. మర ణించిన వారిని మాత్రము బ్రతికింపఁజాలఁడు. చంద్రగుప్తా! భయ మేమియు లేదు. లెమ్ము. ఇప్పుడే యుద్ధమునకు సంసిద్ధుఁ డవు కమ్ము. ఈచాణక్యుని సృష్టి భ్రష్టమొనరింప గ్రీకుల కేమి సామర్థ్యము కలదు?

చం॥ కే—మిత్రమా! తేఱిపారచూచెద వేమి! రమ్ము. ఈ విపత్కా లమున మనము చేయిచేయి కలుపుకొని నిలఁబడుదము. మన యిరువురి తలలపయి కొండ విరిగిపడుఁగాక. అదియె ఛిన్నభిన్న ములై చూర్ణమగును.

చంద్రగుప్తుఁడు—చంద్రకేతూ! ప్రాణబంధూ! సోదరా!

(కౌఁగిలించుకొనును)



## షష్ఠదృశ్యము



స్థానము — మగధదేశమున చంద్రకేతుని మందిరము

సమయము — రాత్రి

[ఛాయ, చెలికత్తెలు]

ఛాయ—ఆడుఁడు. పాడుఁడు. మీతో నేనుగూడ పాల్గొనెదను. నేఁడు చంద్రగుప్తమహారాజు గ్రీకుల జయించెను. చాల సంతోష మగుచున్నది.

చెలి—నీవు పాడెడి విజయగీతములు వారు వినఁగలుగుదురా?

ఛాయ—ఎవరు ఏదిచేసిన తమ మనోల్లాసమునకే చేయుదురు కాని యొరులమెప్పునకు కాదు.

సీ॥ ఎవ్వరు సుఖమంద నెలమావిగీములోఁ
గలరవమ్మొన కలకంఠి పాడు?
ఎవ్వ రామోదింప నెలమి లతాతన్వి
విరులకమ్మనితావి విరియఁజిమ్ము?
ఎవ్వరిమెప్పుకై పువ్వుపువ్వున కేగి
స్వరయుక్తముగ భృంగి స్వస్తిఁజెప్పు?
ఎవరివిలాసార్థ మీశ్వరుం డొనరించు
విశ్వసృష్టిస్థితివిలయములను?
గీ॥ ఎవరికయి కాయు వెన్నెలల్ హిమకరుండు?
ఎవరికయి భావగీతమ్ము కవి రచించు?
సహజపరిణయపరికృతులకు స్వకృత మనెడి
మోద మది చాలు పరుల యామోద మేల?

నాగానము నా కానందము. వారు వినిన నేమి వినకున్న నేమి? ఒరులు వినిన వచ్చునది వినకున్న పోవునది లేదు. నా సంతోష మున నేను లీనమయ్యెదను.

చెలి—నీవు వారిని ప్రేమించుచుంటివి సరే; వారు నిన్ను ప్రేమింప కోరవా? నీకు బదు లవసరము లేదా?

ఛాయ—నాప్రేమ నాసంపత్తి. నాప్రేమ నాయందే పరిపూర్ణత్వ మంది నది. నాప్రేమలో నేను మునిఁగి తేలుచుంటిని. వారిని జూచుట కైన నాకవకాశము లేదు.

చెలి—ఏమి యబ్బురము. వారు నిన్ను ప్రేమింపకున్నను నీప్రాణముల సరకుఁగొనక వారి ప్రాణరక్షణ మొనర్చితివి.

ఛాయ—నాకే పదివేల ప్రాణము లుండిన నవన్నియు సంతోషపూర్వ కముగ వారిచరణసమర్పణచేసియుండెడిదానను. వారి కుప హార మీయ యోగ్యమైనది నాదగ్గర నేమియు లేదని విచార ముగా నున్నది.

చెలి—ఏమి లేదు?

ఛాయ—నాకు సురూపము లేదు.

చెలి—నీకు సురూపము లేదని యెవ రనెదరు?

ఛాయ—నేనే రూపవతినైన వా రొకసారి నాపైఁ గటాక్షవీక్షణములఁ బఱఁగించెడివారు. ప్రపంచమునంగల లావణ్యమంతయు నన్నా శ్రయింపఁ గోరెదను. ఆ యక్షయసౌందర్యమంతయు నెడతె గని ధారగా వారిచరణముల నభిషేకించెడిదానను. కాని నాదగ్గఱ నేమియు లేదు.

చెలి—అమూల్య మగు హృదయ మున్నదికదా!

ఛాయ—పురుషులు హృదయమును గోరరు. స్త్రీల రూపమునే, పై మెఱుఁగునే కోరెదరు.

చెలి—పురుషు లుత్తమూర్ఖులు. ఏమియుఁ దెలియని మూర్ఖులు.

ఛాయ—వలదు. నన్ను దుఃఖపెట్టవలదు. నేఁడు మహోత్సవము. సంతోషముగా నుండుఁడు. ఆనందమగ్నమానసు లగుఁడు. బాలభాస్కరు స్వర్ణమయకాంతులు మీజాగరారుణనేత్రకాంతులతో మేళగింపనంతవఱకు పాడుఁడు. పక్షుల కలకలరవములు మీ నిద్రాలసకంఠధ్వనుల నుద్దీపింపనంతవఱకు పాడుఁడు.

గీ॥ అమరునిగ మర్త్యు; నవని స్వర్గముగ మార్చు
"నాత్మవ త్సర్వభూతాని" యనెడి గీతి
పాడు డిఁకఁ దుచ్ఛ మగు స్వార్థపరత తొలఁగి
విశ్వమానవకల్యాణవిభవ మెసఁగ.

(చెలికత్తెలు పాడుదురు)

గీతము.

స్వర్గమ్మయ్యదే మోక్షమ్మయ్యదె సాధుసమ్మతమ్మదియె
అరిషడ్వర్గము బడలు గడలుకొన నడుగిడుటకుఁ దా వెఱచుఁ
పరపీడనమును బరస్వహరణము పరతంత్రిత యెట పరచుఁ ॥స్వర్గ॥

స్వేచ్ఛావృత్తము స్వేచ్ఛాభావము స్వేచ్ఛాగానం బెందుఁ
స్వచ్ఛతరం బగు స్వర్గంగాజలసారణిధోరణి విందుఁ ॥స్వర్గ॥

జాతివర్ణమతభేదవాదముల జంజాటమ్ములు తఱుగఁ
వీతద్వేషమయి విగతదోషమయి విశ్వప్రణయ మెట పెఱుగుఁ ॥స్వర్గ॥

మర్మదాహమగు దుర్మతమోహము ధర్మద్రోహం బెడలఁ
అర్మిలి సోహ మ్మను మను వెల్లరు నాచరింతు రెల్లెడలఁ ॥స్వర్గ॥

(మురు ప్రవేశించును)

మురు—ఛాయా! ఛాయా! పాప ముత్సవములలో మునిఁగి తేలుచున్నది. యుద్ధమునఁ జంద్రకేతుఁడు వీరస్వర్గ మలంకరించినటుల నీమురు దృష్టి యెఱుఁగదు కాఁబోలు! కాని యిప్పుడు తెలిసికొనును.

గాక! వద్దు—ఈదుఃఖవార్త నే నేల చెప్పవలయును? జగమున దుఃఖవార్తల నెఱింగించువారు కఱవుకారుకద!

గీ॥ పరులు దుఃఖింపఁ జూచుట ప్రియదమేమొ!
కొంప మునిఁగిన యటు పనిఁగొనుచుఁ బోయి
చెడుసమాచారములు ముందు చెప్పుచుందు
మత్సరగ్రస్తులగువారిమతము లివియ.

(దగ్గరకు వచ్చి) ఛాయా!

ఛాయ—ఎవరు, అమ్మా!

ముర—ఛాయా! ఒకమాట చెప్పెద వినుము.

ఛాయ—ఏ మమ్మా! అది?

ముర—ఇన్నాళ్ల కిప్పుడు నాచిరకాంక్షిత మీడేరినది. అమ్మాయీ! నీవే నాపుత్రునకుఁ గాబోవు నర్ధాంగలక్ష్మివి. నీవే భారత సమ్రాజ్ఞివి.

ఛాయ—రాజమాతా! న న్నేల హేళన చేసెదవు? ఈఛాయ చంద్రగుప్తుని పత్నీత్వమునుగాని, భారతసమ్రాజ్ఞీత్వమును గాని తృణప్రాయముగాఁ దుచ్ఛముగాఁ జూచును. చంద్రగుప్తుఁడు భారతచక్రవర్తియైన, ఛాయయు నొకరాజకన్యయే. పరిహాస ములతోఁ బ్రయోజన మేమి?

ముర—ఇ దేమి ఛాయా! యిటు లాడెదవు? నీతో నెప్పుడైన వేళాకోళము లాడెదనా? నీతో నేను నిజమే చెప్పితిని. ముమ్మాటికిని నిజమే చెప్పితిని.

ఛాయ—(అర్ధస్వరమున) నిజము పల్కుచుంటిరా—ఇది సత్యమగునా? ఇది నాయూహకు మించినది. ఈనిష్ఠురసౌభాగ్యము—ఇంత యాకస్మికముగ! ఇంత తీవ్రముగనా! ఇంత అసహ్యముగనా! అమ్మా! అమ్మ! (మురను కౌఁగిలించి యేడ్చును)

ముర—అమ్మాయీ! ఎందుకే యిట్లేడ్చెదవు?

ఛాయ—లేదు, తల్లీ. యేడువను. —దేవతలు పుష్పవృష్టి కురిపింతురు గాక! అహో యిదేమి! ఆకాశ మింకను నీలముగను, గాఢముగను, ఉజ్జ్వలతరముగను గానవచ్చుచున్నది! ఈ పృథ్వీతలము పారిజాతదివ్యసౌరభములతో నిండిపోయినది. వీణారవములతో వాయువు మారుమ్రోగుచున్నది. ఏ మిది! నేను స్వర్గమందుంటినా లేక మర్త్యలోకమందా! కుసుమశయ్యాతలమున పరుంటినా లేక మందమలయానిలవీచికలలో ఉయ్యాల లూగుచుంటినా? నే నెక్కడ నుంటివి? ప్రియతమా! నీ వెచ్చట నుంటివి? ప్రాణాధికా! ఎచ్చట నుంటివి? ఇచ్చటనే యున్నాఁడు; నావలపులరాశి, నాజీవితసర్వస్వము, నాభాగ్యదేవత, చంద్రగుప్తుఁడు, ఇచ్చటనే యున్నాఁడు.— (మోకరిలి) ప్రాణేశ్వరా! హృదయాధిదైవతమా! నన్ను క్షమింపుము. నేను చాల ననుచితము లాడితిని. నేను దురదృష్టురాలను, మాతాపితృహీనను. నాయందు వందల కొలఁది దోషము లున్నవి. క్షమింపుము. (పైకి రెండుచేతు లెత్తి) పరమేశ్వరా! ఇదియంతయు స్వప్నముగాఁ జేయకుము.

(చాణక్యుని ప్రవేశము)

చాణ—మురా! యిదంతయు నేమి? ఈగోడవంతయు నేమి?

ము—విజయోత్సవము.

చాణ—ఉఁహూఁ! అటులనా! (కొంచెముసేపు ఛాయవైపు చూచి నిట్టూర్పు నిగిడ్చి) పోనిమ్ము. నేను సంధి కుదిరించితిని. కాని సంధిపత్రముపై నింతవఱకు సంతకము కాలేదు.

ముర—సంధిపరతు లేమి? గురువర్యా!

చాణ—చంద్రగుప్తమహారాజు సెల్యూకసునకు ఐదువందలయేనుఁగుల నిచ్చునటులను, దానికి బదులు సెల్యూకసు హిందూకోషపర్వతములకుఁ బూర్వదక్షిణములఁ దాను జయించిన రాజ్యభాగమం

తయు మన కిచ్చునటులను, సంధిరక్షణకై హామీగా చంద్రగుప్తుని కాతని కన్య నిచ్చి వివాహ మొనరించునటులను ఏర్పరచితిని.

ముర—ఇ దేమి! వద్దు, గురుదేవా! సెల్యూకస్ చక్రవర్తికన్య నా కిష్టములేదు. (ఛాయ నక్కున గదించి) ఇది నాకోడలు.

చాణ—మురా! ఇది చాణక్యునిమంత్రాంగము.

ముర—కాని పాప మీముగుద—

చాణ— గీ॥ క్షణికమగు తుచ్ఛలాభమ్ము గణనఁజేసి
దేశవిద్రోహు లగువారి తెఱవు సనక
రాజ్యకల్యాణమునకు స్వార్థమ్ము బలిగ
నొసఁగి యీఛాయ చిరయశ మొందుఁగాక!

(ప్రస్థానము)

ముర—ఛాయా! నీముఖ మ దేమే తెల్లగాఁ బాలిపోయినది. జ్యోతిర్విహీన మగు నీనిశ్చలదృష్టి యేమే? వాడుబారిన నీయధరబింబము నీయవ్యక్తవేదనను సూచించుచున్నది. కొయ్యబొమ్మ వలె అదేమి! అట్టు నిలఁబడితివి? అనాథబాలికా! ననుగన్నతల్లీ!

ఛాయ—తుచ్ఛమా! తుచ్ఛస్వార్థమా! నీ కేమి తెలియును, బ్రాహ్మణుఁడా! అబలల సుఖదుఃఖములు, చివరకు వారలజీవితము కూడ పురుషుని దృష్టిలో తుచ్ఛములు; తృణప్రాయములు. ఓ జగదీశ్వరా! ఇట్లేల చేసితివి? ప్రేమమృత్యువులను, ఆశానిరాశలను, స్వర్గనరకములను ఒక్కచో గుదిఁగూర్చితివి. ఆహా! యేమి! భూమి కులాలచక్రమువలె గిఱ్ఱునఁ దిరుగుచున్నది. ఆకసమందలి యొక్కొక్క నక్షత్రమును సూర్యునివలెఁ దేజరిల్లుచుఁ దపించుచున్నది. ఒక యశోగాథ మృదంగధ్వనిలో బయలుదేరి దీర్ఘనిశ్వాసమున లీనమగుచున్నది. ఇదె! ఇదె!!

(చేతులు పైకెత్తుకొని పోవును)





# చంద్రగుప్త

## పంచమాంకము

### ప్రథమదృశ్యము

స్థానము — నందుని ప్రమదోద్యానము

సమయము — రాత్రి

[సెల్యూకస్, హెలీనా]

సెల్యూకస్ — అసభ్యుండగు చంద్రగుప్తునకా గ్రీకుసామ్రాజ్యచక్రవర్తికుమారి నొసంగుట! ఈ హేయమగు సంధి కొడంబడి విముక్తిం బడయంజాలను. అట్టుల నే నెప్పుడు చేయను. నా విముక్తికయి ఈ యమూల్యమణి నీయంజాలను.

(చంద్రగుప్తుని ప్రవేశము)

చంద్రగుప్తుఁడు — వలదు. వీరవరా! మూల్య మీయనక్కరలేదు. గ్రీకుసామ్రాజ్యచక్రవర్తీ! మీరు విడువఁబడితిరి. ఇచ్ఛయుండిన మరల మగధ నాక్రమింపుఁడు. చంద్రగుప్తుఁడు దానికి సిద్ధపడియున్నాఁడు. పొమ్ము, వీరాగ్రణీ! పొమ్ము, రాజకన్యా! మీరు విడువఁబడితిరి. రక్షకభటులారా!

సెల్యూ—ఇదేమి?

చంద్ర—సమ్రాట్! హిందూజాతి యసభ్యబర్బరజాతి కాదు. సామ్రాజ్యమునకుఁ దగినవారలఁ బ్రవర్తింపఁగల మని మాపురుషోత్తము నకు ... చక్రవర్తికడ మున్నే ప్రకటించెను. తమదేశమునకుఁ దాము పోవచ్చును. శూరాగ్రేసరా! వీరిని విముక్తులఁ జేయుఁడి. రక్షకభటులారా!

(రక్షకభటులు ప్రవేశము)

చంద్ర—నాకిఁక సెలవిచ్చెదవు. మంచిది, సమ్రాట్! పోయివచ్చెదను.
(పోవ నుంకించును)

సెల్యూ—భారతసార్వభౌమా! చంద్రగుప్తా! మీరు మహాపురుషులు! ఒకసారి మీరు నాప్రాణముఁ గాపాడితిరి. అది నేను మఱచిపోను. నేఁడు మమ్ముల నేషరతులకొఱక విడుదల చేసితిరి. దీని నెన్నటికిని మఱవఁజాలను. ఈయొడంబడిక షరతులన్నిటి నొప్పుకొంటిని. నే నీరాజ్యభాగమును మీకు విడిచితిని. చేతనయిన మఱల బాహుబలమున జయించుకొనెదను. కాని నా కుమారినిమాత్రము మీ కీయఁజాలను. ఎందుకన? మీరు హిందువులు.

హెలీనా—హిందువులును మనుష్యులే.

సెల్యూ—హెలీనా! (విస్మయముతో హెలీనాను జూచును. హెలీనా శిరము వంచును)

చంద్రగు—రాజకన్యా! తెలిసినది. నీ యీసన్మానము శిరసా వహింతును. హృదయపూర్వకముగ స్వీకరింతును. (సెల్యూకసును జూచి) కాని వీరవరా! నే నీభిక్షాదానము పరిగ్రహింప నసమర్థుఁడను. మీ పుత్రికాప్రణయమున ముగ్ధుఁడ నయితి నని యొప్పుకొను చున్నాను. అది ఇప్పటినుండి కాదు. నానవయౌవనప్రాదుర్భావమున, నిదాఘసముజ్జ్వలసంధ్యాకాలమున సింధునదీతటమం

దేనాఁడు నీలావణ్యమయి ప్రశాంతముఖచ్ఛవి తొలుదొల్త గాంచితినో నాటినుండియు నీపెముద్దుమొగము నా మానసమును గొల్లగొట్టినది. నా యౌవనమందలి సుఖస్వప్న మెప్పుడైన సత్యమగుననికాని, నాహృదయాధిష్ఠానదైవత మెన్నఁడైన నాయెదుట సాక్షాత్కరించుననికాని నే నెప్పుడు తలఁపలేదు. నేఁ డాగౌరవస్థానము, ఆమహోత్సవలక్ష్యము, ఆ స్వర్గీయజ్యోతి హస్తగత మయ్యు జారిపోయినది. లేదు. సమ్రాట్ ! నిర్యాణావసరమున నాప్రాణబంధు వగు చంద్రకేతుండు తన సోదరి ఛాయను నాకు సమర్పించెను. అతని తుదికోరిక సఫలము చేయుట నా విధ్యుక్తధర్మము. వే ఉపాయము లేదు. ఇఁక భారతభావిసమ్రాజ్ఞి మలయరాజదుహిత యగు ఛాయాదేవి

(ఆకస్మికముగ ఛాయ ప్రవేశించును)

ఛాయ—ఇది మహారాజు అనుగ్రహము కావచ్చునుకాని యీాదయా ధర్మభిక్ష మపేక్షించు భిక్షుకి కాదు, ఈఛాయ. భారతసామ్రాజ్యమునకు యోగ్యమగు పట్టమహిషి ఈగ్రీకుచక్రవర్తికుమారి హెలీనా. (హెలీనాతో) సోదరీ ! నీవు చాల సౌభాగ్యవతివి. చంద్రగుప్తమహారాజు నీయం దనురాగబద్ధుఁ డయ్యెను. నామనోవిధానమును నాసుఖసర్వస్వమును స్వచ్ఛందచిత్తమున నీకు దాన మిచ్చుచున్నాను. సోదరీ ! స్వీకరింపుము. (తడఁబడుచు హెలీనాహస్తమును గ్రహించి స్థిరమూర్తియగుచంద్రగుప్తుని హస్తమం దిడి) ఇయ్యమూల్యరత్నమును హృదయమందు ధరింపుము. అన్నిటికన్న మిన్న యగు గౌరవ మిదియె నాకు. కాని సోదరీ ! ఈగౌరవ మెంతమూల్య మిడి సంపాదించుకొంటినో నీకుఁ దెలిసిన—(కన్నుల గుడ్డకప్పుకొని త్వరగాఁ బోవును)

చంద్రగు—(కలగని లేచువానివలె అర్ధస్వగతము) కాదు, కాదు. ఇది యెన్నటికిని కాదు. ఎన్నటికిని కాఁజాలదు. చంద్రకేతూ !

ప్రాణబంధూ! కాదు. ఎన్నటికిని కాదు, సమ్రాట్! మీరు విషమవఁబడితిరి. (చంద్రగుప్తుఁడు చింతితభావమునఁ బోవును)

సెల్యూ——హెలీనా! ఇదియంతయు నేమి?

హెలీ——నా కేమియుఁ దెలియుట లేదు.

సెల్యూ——నీవు చంద్రగుప్తుని వివాహమాడెదవా?

హెలీ——అవును, నాయనగారు! అనుమతి నొసఁగుఁడు.

సెల్యూ——అనుమతించెదను. ఇట్లు జరుగునని యెన్నఁడు ననుకొనలేదు.

(చింతతభావమునఁ బోవును)

హెలీ——నే నెందుల కీ వివాహ మంగీకరించితినో మీ కెట్టుల తెలియును? నాయనగారు! తర్కవితర్కముల అనునయవినయముల దేనిని నేను సాధింపఁజాలనయితినో దాని నీపరిణయమువలన సాధింతును. ప్రేమింపఁజాలనా! ఆశౌర్యము, ఆకరుణార్ద్రనేత్రములు, ఆ యుదారహృదయము, సద్గుణగణము లన్నియు మూర్తీభవించి నను బ్రేమింపఁజాలనా? ఆంటిగోనస్ క్షమింపుము. పరమేశ్వరా! హృదయమునకు బలము నిమ్ము. (నిష్క్రమించును)

---

## ద్వితీయదృశ్యము

---

స్థానము —— చాణక్యుని గృహము

సమయము —— ప్రభాతము

[చాణక్యుఁడు స్వగతము]

చాణ——అది యొక యపారపారావారము. నిశ్శబ్దని స్తరంగనీరాకరము. కనుచూపుమేర కెంతచూచినను మృత్యువువలె సుస్థిరముగఁ గనుపించుచున్నది. (నెమ్మదిగా నటునిటు తిరుగుచు

దీర్ఘనిశ్వాసముం గొని) శక్తిసామర్థ్యము లనురాగాభావమును బూరింపఁజాలవు. హృదయాకాంక్ష కొండవాగువలె నొకసారిగా పొంగిపొరలి వెంటనే యడఁగిపోవును. ప్రణయప్రవాహము హృదయాంతరాళమున బయలుదేరి తీవ్రమస్తిష్కజ్వాలల కావిరయి మాయమగుచున్నది. (స్థిరదృష్టితో నెదుటి మైదానముం గాంచుచు) ఈసుందరప్రభాతము, ఈగాఢనీలిమ—ఒకనాడుండెడిది. ఎవరు వారు?

(రక్షకభటపరివేష్టితుఁడయి కాత్యాయనుఁడు ప్రవేశించును)

చాణ—వచ్చితిరా! రమ్ము, భ్రాతృవరా!

కాత్యా—చాణక్యా! పరిహాసములతో నేమి ప్రయోజనము? నేను నీఖైదీని. అపరాధమొనర్చితిని. శిక్షింపుము.

చాణ—భటులారా! సంకెలల నూడదీయుఁడు. (భటులు బంధనముల విప్పుదురు) ఇదిగో చూడుము. నీవిప్పుడు నాఖైదీవి కావు. మన మిరువుర మొకతీరుగ నుంటిమి. ఇప్పుడు మన యిరువురకు భేదము లేదు.

కాత్యా—భేద మెందుకు లేదు? సశస్త్రులగు వీరభటులు నన్ను చుట్టుముట్టిరి. నీవో స్వతంత్రుఁడవు.

చాణ—(భటులతో) మీరవలకు పొండు. (భటులు పోదురు) సోదరా! ఇప్పుడు మనయిరువురకు భేదమేమియు లేదు.

కాత్యా—భేదము లేదు? నీకనుసన్న చే నన్నిముహూర్తమున చంపింపఁదలఁచిన చంపింపఁగలవు. నేనో నిర్బంధితుఁడను. నీ వీవిశాల భారతసామ్రాజ్యమునకుఁ గర్తవు, హర్తవు.

చాణ—కాత్యాయనా! ఈకత్తిని గైకొనుము. దీనితో నావక్షస్థలమును భేదించి నీమంత్రిపదవికి దారి చేసికొనుము.

(కత్తి నిచ్చును)

కాత్యా—చాణక్యా! నీయభిప్రాయ మేమి?

చాణ—నే నీసామ్రాజ్యమున క్లిష్టపరిస్థితుల నన్నిటిఁ జక్కచేసితిని. ఒక యూసరక్షేత్రమును సర్వసస్యాఢ్యగ నొనర్చితిని. ఇది నీవు చేయఁజాలవు. ఈ విశాలరాజ్యమున భయసహిత మగు శాంతి విరాజిల్లుచున్నది. భయకంపితులయి బాహ్యశత్రువులు నేప డంగిరి. నిర్భయముగ పథికులు రాజమార్గమున తమసంపదల నిడుకొని నిద్రపోవచ్చును. కాని యీగాఢప్రశాంతి యచలము వలె సుస్థిరమేగాని జీవకళ లేదు. నేను చేయఁజాలను. కాని నీవు చేయఁగలవు. మంత్రిత్వము నీ వాసించుచుంటివి కాన నీ కిచ్చుచున్నాను.

కాత్యా—నీవు గొప్ప రాజనీతిజ్ఞుఁడవు. నీమనోగతాభిప్రాయ మెఱుంగ నా కసాధ్యము.

చాణ—నేను చాణక్యుఁడను. యజ్ఞోపవీతమంటి చెప్పుచున్నాను. నీవు మంత్రిత్వ మపేక్షించిన నీక్షణమున నేను త్యజించుచున్నాను. నీవు మూర్ఖుఁడవు. కాని నీకు హృదయము కలదు. నీవు చేయఁగలవు కాని నేను చేయఁజాలను.

కాత్యా—ఇదేమి! బ్రాహ్మణప్రభుత్వ మత్యుచ్ఛస్థానమునకుఁ దెచ్చి—

చాణ—అంతయు నుత్తభ్రమ. హృదయము సంక్షోభించుచుండ నెట్టుల శాసింపఁగలను? నాకఠోరశాసనమున నే సామర్థ్యము స్వప్నప్రాసాదమువలె మిన్నుముట్టినదో యది మఱల మహాశూన్యమున లీనమగునని నే నెఱుంగుదును. అది భర్మనిర్మితహర్మ్యము కాదు. శిథిలదారుకుటీరము. కుసుమితఫలితలలితలతానికుంజము కాదు. శాఖాపల్లవవర్జిత మగు శుష్కతరుషండము. నిర్జీవ మగు బ్రాహ్మణసామర్థ్యము మఱల మంత్రిబలముచే పునరుద్ధరింపఁ గలను; కాని భ్రష్టమయిన బ్రాహ్మణుని బ్రాహ్మణత్వము తిరిగి ప్రతిష్ఠింపఁజాలను. రూక్షవీక్షణమున శూద్రుని భయ

కంపితునిగా నొనర్పఁగలనుగాని యాతనిహృదయమున భక్తిభావ ముత్పాదింపఁజాలను. అదియునుం గాక—

సీ॥ నిప్పురుగప్పినవిప్పునియతి నుండునెగాని
శాంతి కల్గునె ఘోరశాసనముల?
భయపెట్టికొనినట్టి ప్రజలహృత్సీమల
నైజభక్తిప్రేమ నాటుకొనునె?
ఖైదు లీకాయమ్ము కట్టిపెట్టునెకాని
యాత్మస్వాతంత్ర్యమ్ము నడఁపఁగలవె?
పదవులకై దేశవంచకు లగువారు
విశ్వాసనీయులై వెలయు టెట్లు?
గీ॥ పాలకులును బ్రజల్ ప్రేమబద్ధు లగుచు
నీరుపాల్వోలె నెమ్మిమై నెగడవలయుఁ
గాని శాసనబంధనాగారములకు
భక్తి కుదురునె? ద్వేషమ్ము ప్రబలుగాని.

కాత్యాయనా! నీకు హృదయము కలదు గాన నీవు చేయఁ గలవు. కాని నే నిది చేయఁజాలను. ఒసీ! రాక్షసీ! న న్నెక్క డకు లాగుకొని పోవుచుంటివి! ఏమి చేయుచున్నాను?

కాత్యా—ఏమి చేయుచుంటివి?

చాణ—అదె బౌద్ధధర్మప్రవాహము వచ్చుచున్నది. సుదూర మగుభ విష్యత్కాలము నా కెటుల కనుపించుచున్నది, నీకుఁ దెలియునా?

కాత్యా—ఎటుల కనుపించుచున్నది?

చాణ—ఈ సామ్రాజ్యము మఱల ఖండఖండములు గావింపఁబడి నిర్జీవ మగును. పిమ్మట నొక మహాశక్తి యుదయించి యీగళితశవ ముపై నైంద్రజాలకదండమును సారించి ఛిన్నభిన్నములయి పడియుండిన మాంసపిండముల నొకటిగాఁ గలిపి తన నూతన ప్రభావమున మఱలఁ బ్రాణప్రతిష్ఠ నొనరించును. తన న్యాయ

శాసనమున నెక్కున తక్కువలు లెక్కింపక బ్రాహ్మణబ్రాహ్మణే తరుల సమానప్రతిపత్తితో నిలఁబెట్టెను. ఇదిగో! ఈ మంత్రిత్వమును స్వీకరింపుము.

కాత్యా—ఏమూల్యమునకయి దీనిని విక్రయించుచుంటివి?

చాణ—కేవలము నీస్నేహమే నేను కోరునది. మఱేమియు నక్కఱలేదు. ఎక్కడిదీసంగీతము? (సంగీతము దగ్గరగా వినఁబడును. చెవియొగ్గి విని) అదే స్వరము. అదే కంఠధ్వని. కాత్యాయనా! కొంచెముపోయి వారలఁ బిలుచుకొని రమ్ము.

కాత్యా—ఎవరిని?

చాణ—ఆభిక్షుకుని, ఆతని బాలికను.

కాత్యా—ఇదేమి! మీరు—

చాణ—(అనునయముగ)పొమ్ము, సోదరా! (కాత్యాయనుఁడు పోవును) ఇటు లెందు కగుచుంటిని? ఆబాలికస్వరము విని యెందుకిట్లగుచుంటిని? (చెమట తుడుచుకొనును)

(పాడుచు భిక్షుకుఁడు పిల్ల వత్తురు వెంట కాత్యాయనుఁడు వచ్చును)

కీర్తన.

స్థిరకల్పమ్మగుదివ్యసుఖమ్ముడుపరమపదవిఁ గనుఁగొనుమా॥మనమా॥
పరువులేని క్షణభంగురమగు నీపదవికి బ్రమసెదు, సతమా?
మురిగిపోవు మూన్నాళ్ళముచ్చటకు మురిసిపడెద విటు మనమా!
ఎక్కువ కలదని నిక్కెదు జగమం దెక్కువలం గడునెక్కువయున్
దక్కువయగు నాదైవముకడ మనయెక్కువతక్కువ వృథయరయన్
జరయుఁ గ్మృతియును గలవుఁ గ్లెతియును జాడ కనంబడ వెచటన్
జిరవసంతమున జారుచంద్రికలు చిల్కు సుధారస మెచటన్
సర్వసమత్వము సర్వస్వతంత్రత సర్వము ప్రేమమయమ్మై
పర్వ యవికృతంబై నట్టి పరబ్రహ్మానందము కిమ్మా ॥స్థిరకల్ప॥

కాత్యా—నే నిట్టి దార్శనిక భిక్షుకు నెప్పుడు చూచి యెఱుఁగను. తత్పురుషః సమానాధికరణపదః కర్మధారయః అనఁగా ఆపురుషుఁడు ఒక్కఁడే ప్రకృతితో సమానగుణములు కలిగి, అనఁగా సజీవముగా జన్మమొంది కర్మధారణము పొందుచున్నాఁడు. అరె! బిచ్చగాఁడా! నీవు తప్పకుండ పాణినీయము చదివినట్లు తోఁచుచున్నది.

భిక్షుకుఁడు—లేదు బాబయ్యా! అ దేంటో నాకు తెలదు.

కాత్యా—అయినప్పటికి నీపాటలో ప్రతిమాటయందును పాణినీయము మూర్తీభవించినది. అయితే నీ కీపాట నేర్పిన దెవరు?

భిక్షు—ఒక బ్యామ్మడు చెప్పిండు, బాబయ్యా!

కాత్యా—అయి యుండవచ్చును. కాకపోయిన నిం కెవరు చెప్పెదరు?

చాణ—(బాలికను జూచి) అమ్మాయీ! ఇటురా అమ్మా! (బాలిక పరుగెత్తుకొని చాణక్యుని దగ్గఱకు వచ్చును. పిల్లశిరమును చేతితో తట్టుచు) మొగము తీరంతయు నదే. కన్నులు కూడ నదే మాదిరి. అంతయు నదే—కాని మంచిది. అబ్బీ! ని న్నొక మాటడిగెదను నిజము చెప్పుము. ఇది నీ కూతుం రేనా?

భిక్షు—ఇది నాకూతురు కాకుంటె యింకోరిది? బాబయ్యా!

చాణ—నిజము చెప్పుము. చాల ధన మొసఁగెదను. నిజము చెప్పుము.

భిక్షు—కాదు, బాబయ్యా! ఇది నాపిల్ల కాదు. నా కీరత్నం దాన్లో దొరికింది. అప్పట్నుంచి కడుపున పుట్టిన పిల్లాలె పెంచుకుంటున్నా, బాబా!

చాణ—(ఆగ్రహముతో) అయితే ఇది నీపిల్ల కాదా?

భిక్షు—కాదు, బాబయ్యా! పోతూంటె దొరికింది.

చాణ—ఎక్కడ దొరికినది?

భిక్షు—దేముడు నా కిచ్చాడు. లేకపోతే యీ ముసలిగుడ్డాణ్ని చెయ్యట్టుకొని యెవరు తీసు కెడ్తారు? యెనక జల్మంలో ఏం

పున్నెంచేస్తే యీపిల్ల దొరికిందో తెల్దు. బందిపోటేసి జీవించోణ్ణి. ఆపాపాన్ని నాకళ్లు రెండు బొత్తలడి పోయాయి.

చాణ—(అధికాగ్రహమున) నీవు బందిపోటు దొంగవా? ఇప్పుడావని వదలితివా?

భిక్షు—వదలిపెట్టక యేంచేస్తాను, బాబయ్యా! చందరగుప్తుడిరాజ్జంలో దొంగతనం చేయటానికి యెవరికి గుండె ఉంది.

చాణ—ఈపిల్ల నెచ్చటనుండి తెచ్చితివి?

భిక్షు—అవంతీపురాన్నుండి.

చాణ—అవంతీపురమునుండియా? ఎచ్చటనుండి?

భిక్షు—దార్లో దొరికింది.

చాణ—కాదు. ఒక బ్రాహ్మణుని గృహమునుండి యెత్తుకొని వచ్చితివి. నిజము చెప్పుము. భయములేదు. ఎత్తుకొని వచ్చితివి కాదా?

భిక్షు—లేదు, బాబయ్యా!

చాణ—చంపివేసెదను లేకపోయిన— నిజము చెప్పుము. దొంగిలించి తెచ్చితివి కాదు?

భిక్షు—అవును, బాబయ్యా!

చాణ—నదిగట్టుననున్న యింటినుండియేనా!

భిక్షు—చిత్తం బాబయ్యా!

చాణ—(ఎదపయి చేయిడి) హృదయమా! తత్తరపడకుము. ధైర్యము వహింపుము—అప్పు డీపిల్లవయ స్సెంత?

భిక్షు—మూడ్నాలుగేం డ్లుంటాయి బాబయ్యా!

చాణ—అమ్మాయి పే రేమి?

భిక్షు—అత్రిరి.

చాణ—ఆత్రేయి. వింటివా కాత్యాయనా! ఈపిల్లపేరు ఆత్రేయి—ఈమె తండ్రిపే రేమి?

భిక్షు—చాణక్యుఁడు.

చాణ—(సంతోషమున పొంగి యుచ్చస్వరమున) అరే! దొంగా! నిన్నుఁ జంపింపను. ని న్నేమియుఁ జేయను. భయపడకుము. కాత్యాయనా! వలదు. సైనికులారా! (సైనికులు వత్తురు) వలదు, పొండు. భిక్షుకా! నేనే యాబ్రాహ్మణుఁడను. ఈపిల్ల నా కుమారి. (సైనికులు పోదురు)

భిక్షు—నాపిల్లను లాక్కుంటారా యేంటి? బాబయ్యా! ఈ గుడ్డాడికి యిదే ఆదారం. ఇక తిండికూడా దొరకదు.

చాణ—చోరుఁడా! నీ కొక జాగీ రిచ్చెదను. తొలుత వీథివెంటఁ దిరుగు బిచ్చగానిగా నొనర్చి యిప్పుడు చక్రవర్తిని జేసితివి. నరక కూపమునం బడఁద్రోసి మఱల స్వర్గమున కెక్కించితివి. నిన్ను చంపి నీమూర్తిని ప్రతిష్ఠించి పూజించెదను. కాదు, కాదు, ఇ దేమి? ఇది యానందమా? లేక దుఃఖమా? నేను జీవించి యుంటినో లేదో తెలియుటలేదు. తారాకాణము చూచెదను. (నవ్వును)

కాత్యా—చాణక్యా! చాణక్య!

చాణ—కాత్యాయనా! నీవు నాడి పరీక్షింపఁగలవా? కొంచెము చేయి చూడుము. (చేతినిచ్చి) నేను బ్రతికియుంటినో లేదో చెప్పుము. ఇది యిహలోకమా పరలోకమా? ఇది సత్యమా లేక స్వప్నమా? ఇది జ్యోతిఃపుంజమా లేక గాఢాంధతమసమా? చూడు. లేకపోయిన ఇది సంభవమగునా? ఇన్నాళ్ళకు నాపుత్రిక. భారతశాసనకర్తపుత్రిక. తనదగ్గఱకు బిచ్చ మడిగికొనవచ్చునా? కాత్యాయనా! కాత్యాయనా! (ఏడ్చును)

కాత్యా——చాణక్యా! ఊరడిల్లు మూరడిల్లుము.

చాణ——కాదు. ఇదిసంభవము కాదు. ఇదియంతయుమాయ. ఇంద్రజాలము. కుట్ర. కాత్యాయనా! ఈపన్నాగము నీయది. సరిగా అదే ముఖము. అవే కన్నులు. ఆత్రేయీ? అమ్మాయీ! ఇన్నాళ్ళు నన్ను మఱచియుంటివా తల్లీ! ఓసీ కఠినురాలా! ఇన్నిదినము లెక్కడనుంటివి? (పిల్ల నక్కునగదించి) కాత్యాయనా! లతానికుంజమున సామగానము వినవచ్చుచున్నది. చూడుము. ఈనది యానందమున నుప్పొంగుచున్నది. వాతావరణ మంతయు దివ్య సౌరభసమాకీర్ణమయినది. నాశరీరము కంపించుచున్నది. పడి పోవుచున్నది. నన్ను నాగదిలోనికి తీసికొనిపొమ్ము కాత్యాయనా!

---

## తృతీయదృశ్యము.

స్థానము — మలయరాజభవనము.

సమయము — ఉజ్జ్వలప్రభాతము.

(మలయరాజుమంత్రి — మగధరాజదూత)

ఛాయ——మంత్రీ అనర్ఘమణిహారమొకటి రేపుసాయంత్రమునకుఁదయారు చేయింపుము. పొమ్ము...ఎల్లుండియా, వివాహసుముహూర్తము.

ఛాయ——(పత్రికఁ గైకొని మాటిమాటికి ముద్దుగొనుచు) నాజీవిత సౌఖ్యనిధానమా! అప్పుడే యామె పరమైతివా? ఎందుకయితివి? ఆహా ఏమిది నాచేతులతో నేనుగద ని న్నాగ్రీకురాజకన్యాహస్తగత మొనర్చితిని. మఱల దానిని నే నేల సహింపనైతిని? హృదయమా! యేల వ్రక్కలు కావు. జగమంతయు శూన్యముగఁ గన్పట్టుచున్నది. చంద్రగుప్తా! చంద్రగుప్తా!! వలదు ఛాయా! నీవు రాజ్ఞివి. ధైర్యము వహింపుము. మమకార రాహిత్యమున నీప్రవృత్తి నడంచుకొనుము. ప్రవహించు తప్త బాష్పముల నరికట్టుము. ఎందుకింతదుఃఖము? ఇంతమాత్రము

సహింపఁజాలవా ?—వలదు ఈప్రేమనడఁచికొనెదను. వారి సుఖానుభూతియందె నే నానందించెదను. ఇంక దుఃఖమునకు దా వెయ్యది ? ఓ నాప్రియతమా ! నీవు సుఖింపుము. అదియే నాజీవితాకాంక్ష ; అదియే నాజీవితాదర్శము.

ఉత్సాహ

పరిణయనవనిధాన మీవు పరిధితలోభి నేను నా
పరిణయదైవ మీవు మూఢభక్తురాల నేను నా
పరిణయగగనశశివి నీవు పరిమదకుముద మేను నీ
యునికిరూపు మెఱుఁగు లరసి యుబ్బుచుండెదన్ ప్రియా

గీతము

సకలదుఃఖములను సహియింతు నీకయి
ప్రకటసౌఖ్యములను బడయు మీవే ప్రియా
ఆనందమున నవ్వు చలరుచుండుము నీవు
నేను దుఃఖించెద నీకయి నిరతమ్ము.
అనిశము సుఖస్వప్నమును గాంచుమీ నీవు
వినతాస్య నయి తలాపిని మేలుకొనియుందు
నీమనోరథముల నేభంగమును జేయ
ప్రేమోపహతిఁ దిరస్కృతినైన సహియింతు.

(పాడుచు పాడుచు పోవును)

---

చతుర్థదృశ్యము.

---

స్థానము — సెల్యూకసు డేరా.

సమయము — ప్రభాతము.

(సెల్యూకసు ఒంటరిగా నుండును.)

సెల్యూకసు—(స్వగతము) చంద్రగుప్తునకు హెలీనా నిచ్చి వివాహ మొనరించుటా ? చివరకు అదికూడజరిగినది. ఈనగరమున ఘోరు

కొను కల్యాణోత్సవకోలాహలములు గ్రీకుల లజ్జావమానముల బహుభంగులఁ జాటుచున్నవి. ఔరా! హెలీనా యింతవఱకును రాలేదు. పరిణయోత్సవములలో మగ్నమయినది కాబోలును. ఇప్పు డీముదుసలితండ్రిమాట జ్ఞాపకముండునా.

హెలీ—రాజసభకు మిమ్ము తీసికొనిపోవ నేనే స్వయముగా వచ్చితిని. రండు నాయనగారూ!

సెల్యూ—రాను. నేనురాను. అందులకే నిన్నుచటకు పిలిపించినది.

హెలీ—నేను మిమ్ము తీసికొని వెళ్ళుటకే వచ్చితిని.

సెల్యూ—రాను. హెలీనా! నేను రాజాలను.

హెలీ—అయితే నాకు సెలవిచ్చెదరా?

సెల్యూ—ఇంత తొందరా! ఒక నిమిషమైన నాలస్యము నోర్వజాలవు కాబోలు. అయ్యారే! తండ్రీ! నీ వెంతమూర్ఖుఁడవు! ఎంతో ప్రేమతో, నెంతో యాదరముతో, నెన్నియోకష్టముల కోర్చి పెంచి పెద్ద జేసిన నీపుత్రిక ఒక్కరోజులో నొక్కసారిగా నీకు పరాయిదై పోవును.

హెలీనా—వివాహముకాదు. ఆత్మబలిదానము.

సెల్యూ—ఆత్మబలిదానమా! అంతకర్మ మేమి తల్లీ.

హెలీ—తండ్రీ! ఇందు దుష్కర్మమే మున్నది. స్వేచ్ఛానుసారముగ వరించినపుడు? పరహిత ప్రాపకమునకై, నిజకర్తవ్యపాలనమునకయి సమర్పించు నాత్మబలిదానము సంప్రాప్తమగు పరమసుఖము యధికోల్లాసము, చిరగౌరవము మఱెందుకలదు?

సెల్యూ—అది నీకు గౌరవము కావచ్చును. కాని గ్రీకులకు తలవంపు.

హెలీ—తలవంపా! ఇంతగొప్పవివాహము. ప్రపంచములో నెప్పుడైన జరిగినదా? ఈవివాహమున నెడతెగక చెలరేగనున్న ప్రీయ

ఝంఝూమారుతము శాంతించినది. ఈవివాహమున దూరదేశములందొప్పారు ఆర్యజాతులు రెండు పరస్పరగాఢాలింగనమున సుఖించుచున్నవి. ఈవివాహము హెలీనా చంద్రగుప్తులదికాదు. కర్మమోక్షములది? చింతాకల్పనలది; విజ్ఞానకవిత్వములది. ఈ వివాహమువలన రెండు సభ్యజాతు లంతర్భేదముల విడనాడి ఒకదానియం దొకటి సైక్యమైనవి. వాని మధ్యనుండు జలప్రపాతముపయి వంతెనకట్టబడినది. రెండు మహాదేశములు వియ్యమందినవి. ఇంత గొప్పవివాహము ప్రపంచమం దింతవర కెన్నడైన జరిగినదా?

సెల్యూ—లేదు. హెలీనా! ఇదివఱ కెన్నడును జరుగలేదు.

హెలీ—నాయనా! క్షమింపుడు. కర్తవ్యము నన్ను త్వరపెట్టుచున్నది. ఇంకేమి చెప్పుటకు నాకవకాశములేదు. పోయివచ్చెదను. నాయనగారు! (మోకరిలి సెల్యూకస్ పదములంటికొని) నేను జీవించునంతకాల మీచరణస్పర్శము నాకు జ్ఞాపక ముండునుగాక! జగదీశా! నాబలిదానమును గ్రహింపుము. (త్వరగాపోవును.)

సెల్యూ—హెలీనా! (కొంచెము ముందుకుపోయి వెనుకకుతగ్గి) కాదు దివ్యజ్యోతీ—ఇది అపూర్వము; స్వర్గీయము. ప్రపంచమున నింత కపూర్వ మెన్నడు నెవ్వరు నింతగొప్పబలిదానము నిచ్చియుండ లేదు. పోయెదను. నాదేశమునకు తిరిగిపోయెదను. కాని యెక్కడకు?—ఘోరాంధకారము—దారికూడను కనిపించుటలేదు. నన్నంధునిజేసి యెక్కడకు పోతివి తల్లీ హెలీనా!

(ఆంటిగోనస్ ప్రవేశము)

సెల్యూ—ఎవరు?

ఆంటి—నేను ఆంటిగోనసును.

సెల్యూ—(విస్మయమున) ఆంటిగోనస్! నీవు ఇక్కడకా! ఈసమయముననా!

ఆంటి—ఆశ్చర్యపడెదరేల ? సమ్రాట్ !

సెల్యూ—ఔరా ! పరాజయమునకు న న్నధిక్షేపింపవచ్చితివా ?

ఆంటి—లేదు సమ్రాట్.

సెల్యూ—అయితే మఱల నెందుకు ?

ఆంటి—నాజనకునిసంగతి తెలిసికొని వచ్చితిని.

సెల్యూ—దానివలన ప్రయోజనము లేదు.

ఆంటి—కలదు. ప్రయోజనము కలదు. ప్రయోజనమే లేనియెడ పిచ్చివానివలె నిలిచినచోట నిలువక గ్రీసుదేశము పరుగెత్తు కొనిపోవను. ఈసమాచారము తెలిసికొని మఱల పిచ్చివాని వలె భారతవర్షమునకు పరుగెత్తుకొని రాను. ప్రయోజన మున్నది.

సెల్యూ—కాని, హెలీనా చంద్రగుప్త మహారాజునకు పట్టమహిషి యయినది.

ఆంటి—ఇంతకంటె యోగ్యతరమగు సంబంధ మామెకు లభింపదు. నేను స్వయముగా రాజసభకు పోయెదను. నూతనదంపతుల నాశీర్వదించెదను.

సెల్యూ—ఆక్షేపించుచుంటివా యేమి ?

ఆంటి—ఆక్షేపణకాదు. ఇది యంతయు సత్యము సమ్రాట్ ! దివ్య నదీప్రవాహము నాపై ప్రవహించి నాపంకకళంకము కడిగి వైచినది. సకామప్రేమను నిష్కామప్రేమతో శుద్ధిచేయుట, మర్త్యుల నమర్త్యుల జేయుట, మర్త్యము స్వర్గముగనొనరించుట, ఈమనుష్యులకు సాధ్యమగునా కాదా యని చింతించుచుంటిని. కాని యత్నించిన కార్యసిద్ధి యెందుకుగలుగదు ? నే నిపుడు బాగుగా గ్రహించితిని. దానివలననే నేను హెలీనాను సోదరిగ ప్రేమింపఁగలను.

సెల్యూ—నీవేమి చెప్పుచుంటివో తెలియుటలేదు.

అంటి—ఇది మీరెట్లు తెలిసికొనగలరు? రూపలోభమున నొకవర్తక బాలికను ధర్మానుసారముగ పెండ్లాడి పిమ్మట నాపెను, ఆపె చిన్నకుమారుని భిక్షుకులుగాఁజేసి విడిచి తాము స్వయముగ చక్రవర్తులయి సింహాసనముపై టింగురంగాయని కూరుచుండు మహాత్ములకు ఇది యెట్లు తెలియును? సామ్రాట్! ఆ యదృష్ట హీన నాజనని మరణించినది. మీవిశ్వాసఘాతుకఖడ్గప్రహార మున కాదు; నాయింగల యనుపమప్రేమచే పోయినది. అను రాగస్రవంతిలో నాజనని మునిగిపోయినది. అంత ఘోరతర దుఃఖానంతరము ఇంతగాఢసుఖము భరింపజాలక నాతల్లి మర ణించినది. (కంపితస్వరముతో) సమ్రాట్!—

సెల్యూ—కన్నులు చీకట్లు క్రమ్ముచున్నవి. నీ వెవ డవు? ఎవఁడవు నీవు?

అంటి—ఎవఁడనా? విక్రీతదాసుఁడను భిక్షుకుఁడను. కాని జారజుఁడను మాత్రము కాను. నాతండ్రి ధర్మానుసారముగ నాతల్లిని పాణిగ్రహణము చేసికొనెను.

సెల్యూ—(కఠినస్వరమున) నీతండ్రి యెవరు?

అంటి—నాతండ్రియా? చెప్పుకొనుటకు సిగ్గగుచున్నది తలవంపులగు చున్నది. సమ్రాట్! (కంపితస్వరమున) నాతండ్రి ధర్మపత్నీ పరిత్యాగియగు సెల్యూకస్ (త్వరగా పోవును) (సెల్యూకస్ ద్వారము పట్టుకొని తల నించుకవంచి స్థిరభావమున నిలఁబడును. మెల్ల మెల్లగా నిష్క్రమించును.)



## పంచమదృశ్యము.

స్థానము — మగధరాజప్రాసాదము.

సమయము — రాత్రి.

(పలురంగుల జెండాలు కట్టబడును. అస్ఫుటముగ మంగళ వాద్యధ్వనులు వినఁబడుచుండును. హెలీనాచంద్రగుప్తులు సింహాసనము నధిష్ఠించియుందురు. ప్రక్కను మంత్రి యంగరక్షకులు కూరుచుందురు. చెంత చాణక్యకాత్యాయను లుందురు)

చాణ—చంద్రగుప్తమహారాజా! ఆసేతుహిమాచలపర్యంత పరివ్యాప్తమగు నీసామ్రాజ్యమును నీబాహుబలముచే స్థాపించితివి. ఈ మహాసామ్రాజ్యము నింతవఱ కేమహారాజును ఊహించియైన నుండఁడు. నిర్వక్రపరాక్రమమున గ్రీకుచక్రవర్తి సేనాసమూహము నుక్కడంచితివి. నీనామము భారతదేశ చరిత్రమున సువర్ణాక్షరముల లిఖింపఁబడుగాక.

చంద్ర—ఇదియంతయు గురువర్యుని ప్రసాదము. ఈకీర్తి యంతయు తమ రాపాదించినది.

చాణ—సర్వము పరమేశ్వరోద్దిష్టము. దానికేమిగాని నేనుచెప్పునది సావధాన మనస్కుఁడవై యాలింపుము.

సీ॥ తలనూపు బ్రాహ్మణేతర బ్రాహ్మణ విభేద
వాదముల్ మూలవిచ్ఛేదమంద
మొలకెత్తు నగ్రజాతుల యమానుష దురా
ధ్యత్యభావమ్ము తద్దయు నశింప
పసిపట్టగా వచ్చు ప్రజలవర్ణ ద్వేష
దుస్సహ గంధంబు దూలిపోవ
పొడకట్టు పరదాస్యమునకు మార్గంబైన
నంతఃకలహశీల మంతరింప

గీ॥ పాలపాలితభేదమ్ము పరగనీక
బలముచేఁగాక యనురాగబలముచేత
ప్రజలమానససీమతోఁబాటు భరత
ఖండ మేలుమ యాదర్శకముగ వత్స!

ఇంక నాపని ముగిసినది. సెలవు పుచ్చుకొనెదను.

చంద్ర—గురువర్యా! నే నేమి యపరాధ మొనర్చితిని, నన్ను పరిత్య జించుటకు?

చాణ—వత్సా! నీయం దేయపరాధమును లేదు నే నింతవఱకుఁ గావించినదంతయు నాశ్చర్యావహమయినను బ్రాహ్మణోచిత కృత్యము కాదు. దర్పము, అత్యాశ, ప్రతిహింస బ్రాహ్మణ ప్రవృత్తులు కావు. క్షమ, శాంతి, త్యాగము, తపశ్చర్య బ్రాహ్మణధర్మములు. నీ దోర్బలముచే సంపాదించిన యీ సామ్రాజ్యమును యోగ్యతముఁ డగు నీమంత్రిసహాయమునఁ బరిపాలింపుము.

కాత్యా—మీరో?

చాణ—నే నిఁక శాసింపఁగోరను. (ఆత్రేయితో) తల్లి! రా, అమ్మా! ఇఁక నన్ను నీవు శాసింపుము. నీ భ్రాంతపుత్రుని అనురాగ పాశమున బంధింపుము. బాలకృష్ణుఁడు యశోదాదేవిని బంధించులాగున నీచిన్ని చేతులతో నన్ను బంధింపుము. కాత్యా యనా! దీని కేమైన మహేంద్రజాలము తెలియునా యేమి? దీని మోహమంత్రప్రభావమున నల్లరాయి పగిలి నీరు ప్రవహించు చున్నది. ఎండుమోడు చిగిరించుచున్నది. తప్తమరుభూమిపై సుధాపాథోధివీచికలు తాండవించుచున్నవి. తల్లీ! రమ్మా. శరత్కాలపూర్ణచంద్రునిభాతి నా జీవితాకాశమున నీ ప్రణయ చంద్రికలఁ బరగింపుము. జగద్ధాత్రి పరమేశ్వరిరీతి నాహృదయ

జీర్ణమందిరమున నివసింప రమ్ము. కైదండ నిడి యాలోకితపర లోకమునకుఁ దీసికొని పొమ్ము.

(ఆత్రేయితో నిష్క్రమించును)

చంద్రి—ఈశుష్కావరణమం దింత కోమలహృదయము దాగియుం డెనా ?

కాత్యా—ప్రకృతి యిప్పుడు పాటుసఁ బడినది. ఇంత సునిశితబుద్ధి—హృదయము లేకుండునా ? పృథివిపై నీ యనియమ మెంతకాల ముండఁగలదు ?

(మురి ప్రవేశించును)

మురి—చంద్రగుప్తమహారాజునకు జయమగుఁగాక ! (చంద్రగుప్తుఁడు హెలీనా సింహాసనముల దిగి నమస్కరింతురు) "శూద్రాణి తల్లియా" అను సంబోధనమునకు నేఁడు సముచితోత్తర మీయఁ బడినది. ఆశూద్రాశిపుత్రుఁడే నేఁడు భారతసామ్రాజ్య చక్రవర్తి యయ్యెను.

చంద్రి—ఆతని తల్లిపేరుగా నీరాజవంశము "మౌర్యవంశ" మను నామమునఁ బ్రసిద్ధి వహించునుగాక.

మురి—చిరంజీవి వగుము, కుమారా ! కుమారీ ! చిరంజీవి వగుము.

గీ॥ పటుప్రజాకంటకంబైన ప్రభుతఁ గెడపి
రామరాజ్యముఁ బోలిన రాజ్య మవని
వెలయఁజేసితి నీవంటి వీరసుతులు
పుట్టుదురుగాక ! భారతభూమి సతము.

గృహలక్ష్మి ! రమ్ము. నాభవనము నాలోకింప రమ్ము.

(నిష్క్రమించును)

చంద్రి—హెలీనా ! నేఁడు నాప్రియతముని స్వరాభావమున ఈవిజయ మంగళధ్వానములన్నియు విషాదకరము లగుచున్నవి.

హెలీ—మహారాజా! ఏప్రియతముని స్వరాభావమున?

చంద్ర—నాప్రాణబంధువు చంద్రకేతుని స్వరాభావమున! నేటి విజయోత్సవమున కాతనిముఖ మెంత యానందోజ్జ్వల మయ్యెడిది. ఆతని సంతోషచంద్రికలచే నీసభ యెంత కలకల లాడుచుండెడిది?

హెలీ—ఆ యభావమును నేను పూరింపఁజాలనా?

చంద్ర—పూరింపఁజాలవు, హెలీనా! ఉపకారమునకుఁ బ్రత్యుపకారము చేయకుండు టటులుండ నుపకారము నుపకారముగ గ్రహింపని యీప్రపంచమున అన్యహితార్థమయి తన సర్వస్వము తుదకుఁ దన ప్రాణముసయితము నర్పించిన ప్రాణమిత్రుఁడు లేనికొఱంత దేనిచేతను బూరింపఁబడదు. అకటా! అట్టి ప్రాణబాంధవు నకారణముగ ననుచితాలాపము లాడితిని. పాపము చేసితిని. అందులకే న న్నవహేళనసేయ విడనాడి పోయెను. నన్ను శాశ్వతాపరాధునిగాఁ జేసిపోయెను.

(ఆంటిగోనస్ ప్రవేశించును)

ఆంటి—హెలీనా!

హెలీ—ఎవరు? ఆంటిగోనస్!

(రెండుచేతులతో ముఖము కప్పుకొనును)

ఆంటి—సోదరీ! హెలీనా! నీకళ్యాణసందర్శనార్థినయి గ్రీసునుండి వచ్చితిని. నీసోదరుని పరిణయపూర్వకాశీర్వాదమును గ్రహింపుము. భారతచక్రవర్తీ! చంద్రగుప్తా! భిదురసమానమగు నీఖడ్గరాజము నీకుఁ గానుకగాఁ దెచ్చితిని. స్వీకరింపుము. సామ్రాజ్యకల్యాణమునకు వినియోగింపుము.

(ఖడ్గమును చంద్రగుప్తుని కాళ్ళకడ నుంచును)

చంద్ర—వీరవరా! నీ వెవరవు?

ఆంటి—గుఱుతింపలేదా, చంద్రగుప్తా! నేను మాత్రము నిన్ను మఱవలేదు. ఎవని యాఘాతమున ఆంటిగోనస్ కరవాలము క్రిందపడెనో ఆయాంటిగోనస్ నిన్ను మఱవఁజాలఁడు. కాని అదికూడ దైవేచ్ఛయే. ఆ నీయాఘాతము పితృహత్యాపాతకమునుండి నన్నుఁ దప్పించినది.

చంద్ర—అ దెటుల? నీజనకుఁ డెవరు?

ఆంటి—గ్రీకుచక్రవర్తి సెల్యూకస్.

హెలీ—(కంపించుచు) సెల్యూకస్ నీతండ్రియా?

ఆంటి—అవును, హెలీనా! నీవు నాప్రేమ నంగీకరింపకుంటయే మంచి దైనది. అదియు దైవేచ్ఛయే. సోదరునిగాఁ బ్రేమింపఁజాలవా?

హెలీ—ఇదేమి? ఆంటిగోనస్! నీవు—సోదరుఁడవు. తాఱుమాఱైనది—ఒకచోటనే విలయము, సృష్టి, మృత్యువు, పునర్జన్మ—నీవు నాసోదరుఁడవా?

ఆంటి—అవును, సోదరీ!

హెలీ—ఆంటిగోనస్! నామానసమునుండి దుర్భరభారమును దీసివైచితివి. నే నిఁక స్వేచ్ఛగా శ్వాస తీసికొనఁగలను. ఆంటిగోనస్! సోదరా! నన్ను క్షమింపుము. నన్ను క్షమింపుము.

(ఆంటిగోనస్ కాళ్ళపైఁ బడును)

ఆంటి—లెమ్ము, హెలీనా! (లేవదీసి) చంద్రగుప్తా! ఈ స్త్రీరత్నమును మనఃపూర్వకముగ హృదయమున ధరింపుము. దీనితో సరిసమానమగు రత్నము వేరొండు ప్రపంచమున లేదు. దీనిరూపము ముందు నిదాఘనిర్మేఘప్రభాతము దివిటీక్రింద దివ్వె యగును. వర్షకాలీనచపలాలతిక దీని గని నామసార్థక్యముం బొందును. ఈ అపురూపపురూపము నిర్మలాంతఃకరణముతోఁ బోల్పఁ గుడ్డిగవ్వకుఁ బనికి రాదు. హెలీనా సౌందర్యమున నప్సరస; అంతఃకరణమున దేవి.

(ఛాయ ప్రవేశించును)

ఛాయ—భారతచక్రవర్తినికి జయమగుఁగాక !

చంద్రి—ఆఁ! మనఛాయలా గున్నదే—రమ్మ, ఛాయా! [illegible] నున్న ఈయుత్సవకోలాహలముల నీప్రేమసంజీవినిచేతనే [illegible] వింపఁజేయుము.

ఛాయ—సమ్రాట్! భారతమహారాజ్ఞి కొక చిన్ని కానుక సమర్పింప వచ్చితిని. మీయాజ్ఞ యయిన నాచేతులలో [illegible] గళసీమ నిడి పోదును.

చంద్రి—ఎక్కడకుఁ బోదువు, ఛాయా!

ఛాయ—ఈ విపుల బ్రహ్మాండమున సన్యాసిని యగు ఛాయకు [illegible] నింత—నేలయే కర వగునా ?

చంద్రి—ఛాయా! చంద్రకేతుఁడు నన్ను విడిపోవనే పోయెను. ఇఁక నీవైనను నన్ను విడిచి పోకుము. సోదరీస్వరూపిణి వగు [illegible] మయిన నాహృదయసీమను జిరస్థాయిని వగుము.

ఛాయ—మహారాజా! (తల కొంచెము వంచి [illegible]) ! మహారాజా! నాయభిమానమును చూర్ణము చేసి [illegible]. ఈయగ్నిపరీక్షయం దుత్తీర్ణ నయ్యెదను. [illegible] చెంతనుండి మీసుఖానుభూతియందే నేను సౌఖ్య[illegible]. ఇదియే నావ్రతము. ఇదియే నాసాధన. ఇదియే [illegible] తపస్య. మహారాజా! తపస్సిద్ధికయి న న్నాశీర్వదింపుము.
(ముఖమును కప్పుకొనును)

హేలి—(ఛాయకడకు పోయి స్నేహపూర్వకముగ చేయి పట్టుకొని) ఛాయా! ఛాయా! ముఖము పైకెత్తుము. సోదరీ! నీ ముఖ మెందులకు? రమ్మ, సోదరీ! మనమిరువురము సాగరమున సంగ మించు రెండునదులవలె లీన మయ్యెదము. వర్షజలధార [illegible]

కిరణములతోఁ గలిసి మేఘమున క్రింద ధనుఃకాంతు లాపా
దించుటలేదా? ఒకే గగనమున సూర్యచంద్రు లిరువు రుద
యించుట లేదా? రమ్మ, సోదరీ!

ఛాయ—రాను. హెలీనా! నేను సహించెదను. ఇదియే నేను సహిం
పఁజాలనియెడ నిఁక స్త్రీజన్మ మెత్తినసార్థక మేమి? రమ్ము,
హెలీనా! యీమాణిక్యహారము నీగళసీమ నలంకరించెదను.
ఈముఖము, ఈసౌందర్యము, ఈవిశాలహృదయము—అపూ
ర్వము— నీవు మాచంద్రగుప్తుని సుఖపెట్టఁ జాలుదువు. నా కిఁక
రవంతయు దుఃఖము లేదు—రమ్ము, హెలీనా!

(రత్నహారమును హెలీనా మెడను వేయ నెత్తును)

హెలీ—(ఛాయ చేతులు పట్టుకొని) ఛాయా! నీవు పొరబడుచుంటివి.
ఈ హార మెవరి కర్పింపవలసినది చెప్పెదను, రమ్ము. (ఛాయ
చేతులతో మణిహారము చంద్రగుప్తుని మెడలో వేయించును.
ఛాయ రెండుచేతులు తన మెడలో నైచుకొని) నై తన్యరహితమగు
దానికంటె నమూల్యమగు నీహారమును నాకంఠసీమ నలంక
రింపుము. (కౌఁగిలించి) ఛాయా! నీవు చంద్రగుప్తునకు సోద
రివి కావు. నాసోదరివి.

ఆంటి—చంద్రగుప్తా! నీవు ఛాయాసోదరుఁడవు కావు, నాసోదరుఁడవు.
(కౌఁగిలించుకొనును) చంద్రగుప్తా! శ్రీభూదేవులంబోలె హెలీనా
ఛాయలు నిన్ననవరతముఁగొలుచుచుండ విష్ణుమూర్తివలె భారత
మహాసామ్రాజ్యము ఈతిబాధారహితముగఁ బరిపాలింపుము.
జయమగుఁగాక!



# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 10 | 18 | బాష్టమ్ము | దాష్ట్యమ్ము |
| 24 | 20 | ముదాహా | ముదావహా |
| 25 | 19 | ప్రిళయశిఖ | ప్రిళయశిఖి |
| 50 | 14 | అంధకారాగార | అంధకారకారాగార |
| 78 | 10 | నైరాస్య | నైరాశ్య |
| 75 | 1 | బార్వము | బూర్వము |
| 89 | 23 | సహాసము | సాహాసము |
| 122 | 3 | పాృణిగ్రహణ | పాణిగ్రహణ |
| 125 | 11 | పొడువు | పొదువు |
| 131 | 14 | ర్గము బడలు | ర్గమ్మడలు |
| 137 | 18 | నోవిధానము | నోనిధానము |
| 148 | 7 | నిన్న చటకు | నిన్ని చటకు |
| 151 | 2 | వర్క్క | కర్షక |
| ,, | 8 | నాయింగల | నాపయింగల |
| 152 | 18 | తలనూపు | తలసూపు |
| 158 | 1 | క్రింద | కింద్రి |

☞ కేవల మపార్థములు కల్పించునవి మాత్రమే పైన పేర్కొనఁబడినవి. పలు చోటుల "థ ధ" లు "ర ఱ" లు తాఱుమారైనవి. అరసున్నలు విడువఁబడినవి. ఇంక నెన్నియో స్ఖాలిత్యము లుండవచ్చును. పాఠక మహాశయులు వానిని సద్భావముతో సవరించుకొనఁ బ్రార్థితులు.

కొత్తనాటకము! ఇపుడే వెలువడినది!!

# కాలకేతనము

(గ్రంథకర్త: సోమరాజు రామానుజరావుగారు)

కథానాయకుఁడగు కాలకేతనుఁడు మహాభయంకర స్వరూపుఁడై - నిరంతర హత్యాదాహముచే ప్రకృతిభీకరుఁడై - యొనరించిన హత్య లసంఖ్యాకములు. కాలకేతనునివంటి భయంకరవ్యక్తి మన యాంధ్ర నాటకములో నింతకు మున్ను చిత్రింపఁబడియుండలేదు. ఇతఁడు కుటిలురాలగు చిన్నభార్య మంగళ దుర్బోధనలు తలకెక్కి పెద్దభార్యయు పరమసాధ్వియు నగు సులోచనను ఘోరముగ వధించినాఁడు. విశ్వాసపాత్రుఁడైన భృత్యుఁడగు అగభాషిప్రాణములు తీసినాఁడు. కాలక్రమమున చోరాగ్రేసరుఁడగు మృగేశునియొక్కయు, బావమఱఁదియగు నీలకంఠునియొక్కయు మోసము బహిర్గతమై నిరపరాధుల వధించిన పశ్చాత్తాపమున నీలకంఠ మృగేశుల శిక్షించి యున్మత్తుఁడగుట. విషాదాంతమగు విచిత్రకథావిధానము. ఇందలి దొంగయగు మృగేశపాత్ర కథావృక్షమునకు బీజము. వీఁడు త్రాగుబోతు. జూదరి - జారుఁడు - ఝూటాకోరు. సకల దుర్గుణాలంకారుఁడు. మృగేశుని సాధనముగ నుంచుకొని, నీలకంఠుఁడు కాలకేతనుని సింహాసనము నారోహించుటకై విశ్వప్రయత్నములు చేసి భంగపడినాఁడు. ఇందలి చిత్రప్రకృతులు నింతకుము న్నేయాంధ్రనాటకమందును చూచి యెఱుంగము. కాలకేతనుఁడు అగభాషీసులోచనలను వధించిన భయంకరనిశీథమునందలి కథాఘట్టము చదువుచున్నపు డెట్టిదృఢచిత్తులకైనను గుండెలు సంచలింపక మానవు. ఆకాళరాత్రియందు నడచిన యపూర్వ, అననుభూత, విద్రోహ, భయానక, విషాద విషయము లత్యంతభీభత్సస్వరూపమును ధరించి, నిరంతరము పాఠకుల కన్నుల గట్టినట్లుండును. కాలకేతన నామాక్షరములు పాఠకులకు భయప్రదములై యుండును.

వెల రు. 1—0—0.

వలయువారు:—సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.